# వీక్షణం

ఆర్థిక, సామాజిక పత్రిక

52

నవంబర్ 2005

రూ. 10



# 50 వ పడిలో ప్రవేశిస్తున్న ఆంధ్రప్రదేశ్

# వీక్షణం

ఆర్థిక , సామాజిక పత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

52 నవంబర్ 2005




వార్షిక చందా: రు.120 విడి ప్రతి: రు. 10

*సంపాదకీయం*

*వి.హనుమంతరావు*

# పునరాలోచనకిది సమయం

ఒక జాతి జీవనంలో 50 సంవత్సరాలు పెద్ద లెక్క ఏమీ కాదు. కానీ వెనక్కు తిరిగి ఏం జరిగింది, ఏమి సాధించాం, ఏం చెయ్యాలి అని ఆలోచించుకోవాల్సిన సమయం. ప్రాజెక్టులు నిర్మించారు. పరిశ్రమలు స్థాపించారు. పథకాలు అమలు చేశారు. ప్రజల బాగోగులు కొంతమేరకు ప్రభుత్వం పట్టించుకొంది. ఇవన్నీ కాదనలేని విషయాలు. అయితే అదే సమయంలో ఈ అభివృద్ధి ఫలితాలు ఎవరికి దక్కాయి అని ప్రశ్న వేసుకుంటే దారిద్ర్యంతో ఇంకా కుస్తీ పట్టే పరిస్థితిలో రాష్ట్రం ఉండడమేననే జవాబు వస్తుంది. ఇంకా నిరుద్యోగ సమస్య వెనకాలపడి, పగ్గాలు బిగించాల్సిన పరిస్థితిలో వున్నాం. పెట్టుబడులు పెట్టకపోవడం, రుణసౌకర్యం కొరవడి రైతుల ఆత్మహత్యలు, పరిశ్రమలు మూసివేత, చేనేత పరిశ్రమ దీనావస్థ, వ్యవసాయకూలీల వలసలు చూస్తుంటే అభివృద్ధి ఫలితాలు గ్రామీణ ప్రజలకు దక్కలేదనిపిస్తుంది. పేదల, సంపన్నుల మధ్య అంతరం పెరిగింది. మధ్యతరగతి వర్గంలో ఒక సెక్షన్‌ను విడగొట్టి, ఇంకా పైపైకి తీసుకునివెళ్ళే విధానాన్ని అవలంబించడం కిందిస్థాయిలో వున్న మధ్యతరగతి జీవితాలు మరింత దుర్భరం కావటానికే దారితీస్తుంది. యువతను పెడదారి పట్టించే సర్వావకాశాలను ప్రభుత్వ విధానాలు సమకూరుస్తున్నాయి. లంచగొండితనానికి అవధులు లేకపోవడంతో ప్రభుత్వం ఖర్చు చేసే ప్రతి రూపాయిలో పదిహేను పైసలే పేదలకు అందుతున్నాయి. సంపన్నులు కుబేరులవుతున్నారు. వారే రాజకీయాల్ని శాసిస్తున్నారు. వారితోపాటు నేరచరితులు కూడా చట్ట సభల్లో ప్రవేశించడంతో చట్టాలు ధిక్కరించేవారు శాసనాలు తయారుచేస్తే చట్టాల పరిధిలో నడుచుకునే మనం వాటికి తలవంచాల్సి వస్తుంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అపహాస్యం పాలవుతుంది. రాజకీయాలను డబ్బు సంచులు శాసిస్తున్నాయి. ఈ అవలక్షణాలన్నీ జరుగుతున్న కాస్త అభివృద్ధినీ కారుమబ్బులా కమ్మేస్తున్నాయి. తెలుగుభాషకు తెగులు పట్టించడంతో భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటు చేసి పరిపాలనా వ్యవస్థను ప్రజల వద్దకు చేర్చాలనే లక్ష్యం నీరుగారిపోతుంది. ఈ నేపథ్యంలో, గ్రామాలను, వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేసిన ఫలితంగా తెలుగుదేశం ఓటమి పాలై, కాంగ్రెస్ అధికారంలోకి వచ్చింది. ఇలా రావడం మూడోసారి. చేసిన వాగ్దానాలను వెన్వెంటనే అమలు పరచాలనే రంధిలో పడి ముందు వెనుక ఆలోచించకుండా తీసుకున్న నిర్ణయాలతో అసలే ఆర్థిక సంక్షోభంలో వున్న రాష్ట్రం మరిన్ని ఇబ్బందులకులోనై ఆ ఇబ్బందుల నుండి బయటపడడానికి ఏ ప్రపంచ బ్యాంకు విధానాలను తీవ్రంగా విమర్శిస్తూ వచ్చారో, ఆ బ్యాంకు విషకౌగిలిలోకే ప్రస్తుత ప్రభుత్వం కాలు పెట్టడం రాష్ట్రాన్ని మరింత రుణభారానికి గురి చేస్తుంది. సమాజం, అభివృద్ధి, ద్రవ్య పరిస్థితుల గురించి పునరాలోచించుకోవాలి. ❑

## లోపలి పేజీల్లో...



## ఉత్తరాలు:

మీరు నడుపుతున్న ఆర్థిక, సామాజిక పత్రికలో విశ్లేషణాత్మక వ్యాసాలు ప్రచురితమవుతున్నాయి. 'వోక్స్ వ్యాగెన్ డబ్బు లాగెన్' శీర్షిక, వ్యాసం బాగుంది. పత్రిక సామాజిక పత్రిక అన్నారు కనుక 'కవిత శీర్షిక' పెట్టండి. ఉత్తరాల కోసం పేజీ కేటాయించండి. ప్రభుత్వం అనుసరిస్తున్న విద్యావ్యతిరేక విధానాలపై వ్యాసాలు ప్రతి సంచికలో వచ్చేలా చూడండి. డాటా ఎక్కువగా ఉండే విధంగా కృషి చేయగలరని విజ్ఞప్తి

- **జి.శ్రీనివాస్**, మహబూబ్‌నగర్

సెప్టెంబర్ 2005 వీక్షణం లో మీరు ప్రచురించిన పుస్తక పరిచయం నాలో చాలా ఆసక్తి రేపింది. జాన్ పెర్కిన్స్ రచన 'కన్ఫెషన్స్ ఆఫ్ ఏన్ ఎకనామిక్ హిట్‌మాన్' పుస్తకం ఎక్కడ దొరుకుతుంది? ధర ఎంత? తెలుగు అనువాదం దొరుకుతుందా? అగ్రరాజ్యాల దుర్మార్గాలూ మరీ ముఖ్యంగా అమెరికా పెత్తనం మనకర్థమవుతాయి. సామ్రాజ్యవాద స్వభావం మనకు తేటతెల్లమవుతుంది. ప్రజల హక్కుల కోసం పోరాడే వారికీ, దేశ ప్రయోజనాల కోసం బ్రతికే వారికి ఇలాంటి పుస్తక జ్ఞానం చాలా అవసరం.

సిడిఆర్‌సి ప్రచురణ 'మునిసిపల్ సర్వస్వం' ఎప్పటికల్లా ప్రచురిస్తారు?

- **వి. ఎస్. నాయుడు**, పార్వతీపురం

వీక్షణం అక్టోబర్ 2005 సంచికలో మీరు ప్రచురించిన 'హైటెక్ యుగంలో టీచర్ ఫ్యూచర్' - ఎ. పున్నయ్య గారి వ్యాసం చాలా బాగుంది. ఈ వ్యాసంలో ఉపాధ్యాయుల పరిస్థితి కళ్ళకు కట్టినట్లు చూపించారు. ప్రపంచబ్యాంకు విధానాల వెలుగులో ప్రభుత్వ పాఠశాలల స్థితిగతులూ, ప్రైవేటీకరణ స్వభావం మనకు అర్థమవుతాయి. వ్యాసంలో కాల్పనికత బాగుంది. పిల్లలకు పాఠాలు చెప్పడమనే ప్రధానమైన పని విడిచిపెట్టి ఇతరత్రా ఎన్ని అప్రధానమైన పనులు ఉద్దేశ్య పూర్వకంగా చేయిస్తున్నారో మనకు తెలుస్తుంది. సంక్షేమ దృష్టిలేని పాలకులు మనకంటిని మన వేలుతోనే పొడిచే కుట్రలో భాగమే ఈ ప్రైవేటీకరణ.

- **భారతి**, హైదరాబాద్

'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష సామాజిక, ఆర్థిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్ని రకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.


వీక్షణం ఆర్థిక, సామాజిక పత్రిక
సమతా పబ్లికేషన్స్
సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫోన్ : 040 - 55843495
ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్.

# ఐదు దశాబ్దాల ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి - వెలుగు నీడలు

ఎన్. వేణుగోపాల్

**"అభివృద్ధి అనే భావన ఏకకాలంలో క్లిష్టమయిందీ, సులభంగా అర్థమయ్యేదీ కూడా. సులభంగా ఎందుకర్థమవుతుందంటే దాని బలమయిన దర్శనీయత వల్ల. క్లిష్టమయింది ఎందుకంటే దాని వెలుతురుని అర్థం చేసుకోగలిగినంత సులభంగా అది సృష్టించే నీడల్ని అర్థం చేసుకోలేం కాబట్టి."**

**- ఆర్. ఎస్. రావు**

ఈ నవంబర్ 1 న ఆంధ్రప్రదేశ్ యాభయ్యవ పడిలో అడుగుపెడుతోంది. మొట్టమొదటి భాషాప్రయుక్త రాష్ట్రంగా, రెండు శతాబ్దాలు విడివిడిగా బతికిన ఒకే జాతి సమైక్యం కావాలనే ఆకాంక్ష ఫలితంగా, భిన్నాభిప్రాయాలను తొక్కిపట్టి సాధించిన ఐక్యతగా, రెండు ప్రాంతాల కలయికకు ఒక పెద్దమనుషుల ఒప్పందం ప్రాతిపదికగా ఏర్పడిన పాలనా ప్రాంతంగా 1956 నవంబర్ 1న ఏర్పడిన ఆంధ్రప్రదేశ్‌కు చాల ప్రత్యేకతలు, విశిష్టతలు ఉన్నాయి. గత ఐదు దశాబ్దాల ఆంధ్రప్రదేశ్ చరిత్ర కూడ అనేక గుణాత్మక మార్పులతో, ఉద్వేగభరితమైన, సంచలనాత్మకమైన పరిణామాలతో, గొప్ప ప్రజా ఉద్యమాలతో, ప్రజాజీవితాన్ని అల్లకల్లోలం చేసిన సాంఘిక, ఆర్థిక, రాజకీయ సందర్భాలతో నిండి ఉంది.

ఏ జాతి జీవితం లోనయినా అర్ధశతాబ్దకాలం సాధారణమైనదేమీ కాదు. తెలుగు జాతి చరిత్రలో ఈ యాభై సంవత్సరాల కాలం మరింత అసాధారణమైనది. ఈ అసాధారణమైన చరిత్రను సాకల్యంగా విశ్లేషించడానికి ఒక వ్యాసమో, ఒక పుస్తకమో కూడ సరిపోదు. దాదాపు ప్రతి ఒక్క రంగంలోనూ జరిగిన ఘటనలను వివరించడం, ఆ ఘటనల వెనుక ఉన్న క్రమాన్ని పరిశీలించడం, ఆ పరిణామక్రమపు మూల ధాతువులను, సారాంశాన్ని వెలికి తీయడం చాల వివరమైన, కఠోరమైన పరిశోధన అవసరమైన పనులు. అటువంటి పరిశోధన జరపడానికి ప్రాతిపదికలను సూచించడమే ఈ వ్యాసం ఉద్దేశ్యం. ఇక్కడ ప్రతిపాదిస్తున్న ప్రాతిపదికలు కూడ సంపూర్ణమూ కావు, సమగ్రమూ కావు. ఈ ప్రాతిపదికలతో పాటు మరెన్నో ప్రాతిపదికలను కూడ చేర్చుకోవలసి ఉంటుంది. ఇక్కడ ప్రతిపాదిస్తున్న ప్రాతిపదికలకు కూడ ఇక్కడ సూచిస్తున్న కోణాలు కాక మరెన్నో కోణాలు ఉండే అవకాశం ఉంది. అటువంటి సంపూర్ణ, సమగ్ర ప్రాతిపదికలు ఏర్పరచుకుని, ఆంధ్రప్రదేశ్ 1956-2006 అభివృద్ధి వెలుగు నీడల దృశ్యాన్ని వీలయినంత విస్తృతంగా చిత్రించే ప్రయత్నానికి మొదటి మెట్టుగా ఉండడమే ఈ వ్యాస లక్ష్యం.

ఐదు దశాబ్దాల ఆంధ్రప్రదేశ్ చరిత్ర అధ్యయనానికి తాత్విక అవగాహన నుంచీ, రాజకీయార్థిక సామాజిక గమనం నుంచీ, అంతర్గత, బాహ్య ప్రేరణల నుంచీ, చలనాల నుంచీ కొన్ని ప్రాతిపదికలను గుర్తించవచ్చు.

ఈ యాభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ చరిత్రను అవలోకించినపుడు కొట్టవచ్చినట్లు కనిపించే అంశం పురోగమనానికి సమాంతరంగా తిరోగమనం, అభివృద్ధికి పక్కపక్కనే అభివృద్ధి రాహిత్యం. భారతీయ సామాజిక అభివృద్ధిలో అత్యాధునిక ఉత్పత్తి సాధనానికీ అతిప్రాచీన ఉత్పత్తి సంబంధానికీ మధ్య శాంతియుత సహజీవనం ఉందని చూపుతూ డి.డి.కోశాంబీ చేసిన విశ్లేషణకన్నా కూడా భిన్నమైన దృశ్యాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రదర్శిస్తోంది. అందువల్ల ఆంధ్రప్రదేశ్ ఈ యాభై ఏళ్ళలో ఎంతో అభివృద్ధి సాధించిందని అనడం ఎంత వాస్తవికమో, ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి సాధించలేదు, వెనకబడిపోయింది అనడం కూడా అంతే వాస్తవికం. మొదటి నిర్ధారణకు సమర్థనగా ఎన్ని గణాంకాలు ఇవ్వవచ్చునో రెండో నిర్ధారణకు మద్దతుగా అన్ని గణాంకాలు ఇవ్వవచ్చు.

ఇది కేవలం వర్గదృష్టితో ప్రతి అంశాన్నీ పాలకవర్గాల దృష్టి నుంచీ, పాలిత వర్గాల దృష్టి నుంచీ చూడడం కాదు. ప్రతి అంశానికీ అనుకూల, ప్రతికూల కోణాలుంటాయనే దృష్టి కాదు. ఒక వైఖరి తీసుకుని మరొక వైఖరిలో లోపాలెన్నడం కాదు. ఇది కేవలం సాపేక్షవాదం కూడా కాదు. అభివృద్ధికి సంబంధించి నిర్వచనాలూ, దృక్పథాలూ, పరిశీలకులు తీసుకోదలిచిన వైఖరి, పరిశీలకుల దృష్టికోణం, పరిశీలకులు ఉపయోగిస్తున్న పరికరాలు- అన్నీ కూడా ఈ వాస్తవికతను ప్రభావితం చేస్తున్నాయి. అసలు వాస్తవికతకే ఏకైక, పరమ స్వభావం కాక బహుముఖీన, సంక్లిష్ట స్వభావం ఉంది.

ఉదాహరణకు, రాష్ట్రంలో 1956లో మొత్తం రహదారుల నిడివి 27,762 కి.మీ. తాజా గణాంకాలు దొరుకుతున్న 2003 మార్చి చివరకి ఇది 2,01,203 కి.మీ.కు పెరిగింది. స్థూలంగా చూస్తే రహదారుల నిడివిలో తొమ్మిది రెట్ల పెరుగుదల సాధించి రాష్ట్రం చాల అభివృద్ధి సాధించినట్లు కనబడుతుంది. కానీ ఈ రహదారులు ప్రజలలో ఏ బృందానికి ఉపయోగపడ్డాయి? ఈ రహదారుల మీద సాగిన రవాణా ఏ ప్రజల అవసరాలను తీర్చింది? ఈ

రహదారులమీద ఏ ప్రాంతాల నుంచి ముడి సరుకులు ఏ ప్రాంతాలకు తరలి పోయాయి? ఈ రహదారుల మీంచి ఏ ప్రాంతాల సరుకులు ఏ ప్రాంతానికి అమ్మకానికి వచ్చాయి? ఈ రహదారులు ఎటునుంచి ఎటు వలసలను ప్రోత్సహించాయి? ఆ వలసల వల్ల ఆయా సమాజాలకు ఏమి జరిగింది? లాంటి ప్రశ్నలలోకి పోయినకొద్దీ ఈ రహదారుల నిడివి పెరుగుదల అనే స్థూల అభివృద్ధి చిత్రం సంక్లిష్ట, మిశ్రమ చిత్రంగా బయట పడుతుంది. అంత మాత్రమే కాదు రాష్ట్రం మొత్తానికి చూసినప్పుడు తొమ్మిది రెట్ల పెరుగుదలగా ఉన్న ఈ అంకె ప్రాంతాలవారీగా, జిల్లాల వారీగా, మండలాలవారీగా విడగొట్టి చూస్తే సమానంగా లేదనీ, కొన్ని ప్రాంతాలలో, జిల్లాలలో, మండలాలలో యాభై ఏళ్ళలో రహదారుల నిడివి 2,3 రెట్లు కూడా మించలేదనీ అర్థమవుతుంది.

మరో ఉదాహరణ చూడాలంటే, రాష్ట్రంలో 1956లో వ్యవసాయంలో 1626 ట్రాక్టర్ల వినియోగం జరుగుతుండేది. అది తాజా గణాంకాలు దొరుకుతున్న 1999 నాటికి 90,333 ట్రాక్టర్లకు పెరిగింది. వ్యవసాయ యంత్రపరికరాల వినియోగం అభివృద్ధికి చిహ్నమనీ యూరపులోనూ అమెరికాలోనూ వ్యవసాయాభివృద్ధి మార్గం ఇదేననీ నమ్మేవారు ఈ ఐదువందల రెట్ల పెరుగుదలను చూసి మురిసిపోవచ్చు. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయాభివృద్ధిలో ఉరకలు పరుగులుగా ముందుకు సాగుతుందనుకోవచ్చు. అందులో కొంత వాస్తవం కూడా లేకపోలేదు. కానీ అదే సమయంలో ఈ నాణేనికి మరోవైపు చూడవలసి ఉంటుంది. ఒక అంశం, ఈ ట్రాక్టర్ల పెరుగుదలను కొన్ని జిల్లాలు మాత్రమే సాధించాయని గమనంలో ఉంచుకోవాలి. దానికన్నా ముఖ్యమైన అంశం మరోటి ఉంది. 1956కూ ఇప్పటికీ గడిచిన యాభై ఏళ్ళలో రాష్ట్రంలో సాగుకు లాయకైన మొత్తం భూమి విస్తీర్ణం పెద్దగా పెరగలేదు. అది అప్పటికీ, ఇప్పటికీ 2.5 కోట్ల ఎకరాలకు అటుఇటుగా ఊగిసలాడుతోంది. సాగుయోగ్యమై కూడా వినియోగంలోకి రాని దాదాపు కోటి ఎకరాల భూమి అప్పటికీ ఇప్పటికీ అలాగే ఉంది. ఇక్కడ చర్చించే విషయం అదికాదు. కొత్తగా భూమి సాగులోకి రాక, కొత్తగా ఎనభై ఎనిమిది వేల ట్రాక్టర్లు భూమిలోకి దిగాయంటే అర్థం ఏమిటి? ఒక్కొక్క ట్రాక్టర్ కనీసం పదిమంది రైతుకూలీల ఉపాధిని కొల్లగొట్టి ఉంటుంది. ఆ కూలీలు ఏమయ్యారు? పెరిగిన నిరుద్యోగం వల్ల వారి కూలి రేట్లకు ఏమి జరిగింది? కోల్పోయిన ఉపాధి వల్ల వారి కుటుంబాలకు ఏమి జరిగింది? వారి పిల్లల విద్యాబుద్ధులకేం జరిగింది? వారి తల్లిదండ్రుల ఆరోగ్యాలకేం జరిగింది? మిరుమిట్లుగొలిపే ట్రాక్టర్ పెరుగుదల అంకెల ముందు ఈ చీకటి కనబడదు.

ఇంకొక ఉదాహరణ చూద్దాం: యంత్ర పరికరాల వినియోగం, ఆధునిక వాహనాల వినియోగం అభివృద్ధి చిహ్నంగా అందరూ నిరభ్యంతరంగా అంగీకరిస్తున్నారు. సమాజ అభివృద్ధి కేవలం సొంత వాహనాల వినియోగదారుల అంకెల పెరుగుదలలోనే ఉందన్నట్లుగా అంకెలు గుప్పిస్తున్నారు. కచ్చితంగా 1956కూ ఇవాల్టికీ ఆంధ్రప్రదేశ్ వాహన వినియోగంలో బ్రహ్మాండంగా ముందుకు పోతోంది. 1956లో రాష్ట్రం మొత్తం మీద నమోదయిన వాహనాల సంఖ్య 26,559. తాజా గణాంకాల (2003 మార్చ్) ప్రకారం అవి 49,60,176. మళ్ళీ ఈ రెండువందల రెట్లు పెరుగుదల ఎంత సంక్లిష్టమయినదో, దాన్ని ఎట్లా విడదీసి పరిశీలించవలసి ఉంటుందో చూస్తే అభివృద్ధి చిహ్నంగా కనబడేదల్లా అంత సులభంగా అభివృద్ధిగా నిర్వచించడానికి వీలులేనిదిగా తేలిపోతుంది.

ఒక సూచికను అభివృద్ధి సూచికగా అంగీకరించడానికి అనేక పరిమితులు, పరస్పర వ్యతిరేకంగా ఉండే ప్రమాణాలూ, ప్రయోజనాలూ, స్థల కాల ప్రత్యేకతలూ వంటి అనేక అంశాల సమాహారంగా చూడవలసి ఉంటుంది. ఒక ప్రాంతానికి అభివృద్ధిగా ఉనికిలోకి వచ్చినది మరో ప్రాంతాన్ని వెనుకబాటుతనంలో ఉంచవచ్చు. ఒక వర్గం జీవనస్థితిగతులను గణనీయంగా మెరుగుపరిచినది మరో వర్గం జీవనాన్ని అతలాకుతలం చేసి దిగజార్చి ఉండవచ్చును. అంతకన్నా ముఖ్యంగా ఒక సమాజానికి తన పరిసరాల గురించీ, తన గురించీ అవగాహనలు పెరిగేక్రమంలో నిన్న నిరభ్యంతరంగా అభివృద్ధిగా కనబడినది, ఇవాళ లోపపూరితమైనదిగా, అభివృద్ధి రాహిత్యంగా, అసమ అభివృద్ధిగా కనబడవచ్చు.

ఈ నేపథ్యంలో చూసినపుడు ఆధునిక ప్రయాణ సౌకర్యాల పెరుగుదల అనే ఒక స్థూల అభివృద్ధి సూచిక సూక్ష్మ స్థాయిలో సమస్యాత్మకంగా మారుతుంది. ఈ వాహనాల సంఖ్యను ప్రాంతాలవారీ, జిల్లాల వారీ విభజన చేస్తే ఫలితం వేరు. ప్రజా రవాణా సాధనాల సంఖ్యనూ వ్యక్తిగత రవాణా సాధనాల సంఖ్యనూ వేరు వేరుగా చూస్తే వచ్చే ఫలితం వేరు. అసలు ఏ ప్రయాణ సౌకర్యాలూ అందని జనాభాకూ, విరివిగా అన్ని ప్రయాణ సౌకర్యాలూ అందుబాటులో ఉండే జనాభాకూ పోలిక తీస్తే వచ్చే ఫలితం వేరు. ఇవన్నీ అలా ఉంచి ఇన్ని వందల రెట్లు పెరిగిన వాహనాల వల్ల ఖర్చవుతున్న ఇంధనమెంత? ఆర్థిక వ్యవస్థలో దానివాటా ఎంత? ఎంత తక్కువ మంది ప్రజలు తమ వాహన సౌలభ్యం కొరకు ఆర్థిక వ్యవస్థలో ఎంత ఎక్కువ వాటాను వినియోగిస్తున్నారు? వంటి విశ్లేషణలు చేస్తే దిగ్భ్రాంతికరమైన అంశాలు బయటపడతాయి. ఇది ఇవాల్టికివాళ సామాజిక ఆర్థిక వ్యవస్థ గురించి చెప్పేదైతే, ఈ పెరిగిపోయిన వాహన ఇంధన వినియోగం వల్ల పెరిగే కాలుష్యం, తరిగే సహజవనరులు, తరిగే ఆయుః ప్రమాణం వంటివి భవిష్యత్ తరాల స్థితిగతులను నిర్ణయించే అంశాలు. బహుశా లెక్కకు తేలవు.

ఇందులోనే మరొక చిన్న ఉదాహరణ చెప్పుకోవాలంటే బహుశా 1956 నాటికి రాష్ట్రంలోని నమోదయిన వాహనాలలో రిగ్ అనే వాహనం లేదు. 2003 మార్చి నాటికి రాష్ట్రంలో 1491 రిగ్గులున్నాయి. ఇది కొందరికి అభివృద్ధి సూచికగా కనబడవచ్చును. ఇంకా కొంచెం లోతుకు వెళితే 251 రిగ్గులతో కరీంనగర్, 240 రిగ్గులతో నల్గొండ, 205 రిగ్గులతో రంగారెడ్డి జిల్లాలు అభివృద్ధి

పథంలో అగ్రభాగాన ఉన్నట్లుగా కనబడతాయి. కానీ ఈ నాణానికి అవతలివైపు ఈ మూడు జిల్లాలలో నానాటికీ అడుగంటుతున్న భూగర్భ జలాలు, బావులు మూలకు పడిపోవడం, బావుల మోటలకు అవసరమయిన పనులు చేసే వడ్రంగి, కమ్మరి, తోలు పనుల వృత్తిదారుల ఉపాధి రద్దయిపోవడం, పశువుల అవసరం తీరిపోవడం వంటి పరిణామాల వరుస కనబడుతుంది. కనుక ఒక మారుమూల తెలుగు గ్రామంలోకి రిగ్ అనే అత్యాధునిక ఉత్పత్తి సాధనం ప్రవేశించడం అభివృద్ధా? కాదా? అనే ప్రశ్నకు సూటిగా ఒకే జవాబు చెప్పగల స్థితిలేదు. ఒక ఆధునిక పారిశ్రామిక పరికరంగా రిగ్ ప్రవేశం ఆధునికతకు, అభివృద్ధికి ఎంతగా సూచికో అది పరోక్షంగా భూగర్భ జలాలు అడుగంటి పోవడానికి చిహ్నంగా అభివృద్ధి రాహిత్యానికి అంతే సూచిక. పాత బావుల మీద ఆధారపడిన ఒక సమూహపు జీవనోపాధిని రద్దు చేసి అందుకు ప్రత్యామ్నాయం కూడా చూపించకపోవడంలో అది అభివృద్ధి రాహిత్యంగా మాత్రమే కాదు ఒక ఉద్దేశ్యపూర్వక కుట్రగా కూడా కనబడుతుంది.

ప్రకాశం జిల్లా కారంచేడును 1985కు ముందువరకు చాలమంది ఆంధ్రప్రదేశ్ అభివృద్ధిచిహ్నంగా భావించేవారు. ఆ ఊరు అంతకుముందు అర్ధశతాబ్దానికి పైగా వాణిజ్యపంటలు, మార్కెట్‌తో అనుసంధానించిన పంటలు వేయడంలో పేరు సంపాదించింది. వ్యవసాయంలో మిగులు ఆదాయం కాంట్రాక్టులు, ఎరువుల వ్యాపారం, పొగాకు, పత్తి వ్యాపారాలు, సినిమా నిర్మాణం, సినిమా డిస్ట్రిబ్యూషన్ లాంటి రంగాలకు ప్రవహించింది. గ్రామంలోకి ఆధునిక సౌకర్యాలు, పరికరాలు వచ్చి చేరాయి. గ్రామం నుంచి చెప్పుకోదగినంత మంది మద్రాసు, హైదరాబాదు లాంటి నగరాలకే గాక విదేశాలతో కూడ నిత్యసంబంధం లోకి వచ్చారు. ఈ అభివృద్ధి కోణమంతా 1985 జులై 17న ఆ గ్రామ దళితులపై సాగిన మారణహోమంతో పటాపంచలయిపోయింది. గ్రామంలో ఇంత 'అభివృద్ధి' తర్వాత కూడ ఏదో ఒక స్థాయిలో అస్పృశ్యత కొనసాగుతున్నదని, కులవివక్ష ఉన్నదని, దళితుల ఆత్మగౌరవానికి ఆటంకాలున్నాయని రుజువయింది. ఆధునిక అభివృద్ధివాహికలుగా ఉండిన కులాలు, వ్యక్తులు అతి ప్రాచీన, అభివృద్ధి నిరోధక విశ్వాసాలతో తోటిమనుషులను చంపడానికి పూనుకున్నారు.

ఇలా పరిశీలిస్తూ పోయినపుడు ప్రతి అభివృద్ధి సూచికకు ఒక అవతలి కోణం ఉందని అర్థమవుతుంది. నీటిపారుదల కాలువలు వ్యవసాయ ఉత్పత్తులను పెంచాయి. లక్షలాది మందిని నిర్వాసితులను చేశాయి. వ్యవసాయంలో ట్రాక్టర్ల ప్రవేశం విశాల భూక్షేత్రాల సాగును సులభతరం చేసింది. లక్షలాది మంది కూలీల ఉపాధినీ రద్దు చేసింది. రిగ్గులు పాతాళం నుంచి నీటిని తోడిపోశాయి. పర్యావరణ సంక్షోభానికి నిదర్శనంగానూ నిలిచాయి. సమాజాన్ని దగ్గర చేయదలిచిన, ఆధునీకరించదలచిన రోడ్లు, రవాణా, సమాచార సంబంధాలూ ఆధునిక పాలనా పద్ధతులూ తాము పెట్టుకున్న లక్ష్యాలను సాధించింది తక్కువ. ఆ సంబంధాల వల్ల ఏ కుల, మత, ప్రాచీన సామూహిక భావనలు రద్దయి ఆధునిక మానవమైత్రి పెరగవలసిందో అది జరగలేదు సరికదా అన్ని అభివృద్ధి నిరోధక అభిప్రాయాలకూ ఆధునిక సమాచార సంబంధాలే వాహికలుగా నిలుస్తున్నాయి.

ఈ మొత్తం క్రమాన్ని పరిగణనలోకి తీసుకోవడం ఆధునిక ఆంధ్రప్రదేశ్ చరిత్ర రచనకు ముఖ్యమైన షరతు. ఈ యాభై ఏళ్ళలో అభివృద్ధి జరిగిందని గానీ, జరగలేదని గానీ ఒక్క మాటలో తేల్చి చెప్పలేం. వెలుగు ఉంది, వెలుగు వెంట నీడా ఉంది అని చెప్పవలసి ఉంటుంది. అయితే కొన్ని వెలుగులు వాటితో పాటు అసంకల్పితంగానే నీడలను సృష్టించాయి. కొన్ని వెలుగులు ఉద్దేశిత లక్ష్యాల వల్లనే కొన్ని నీడలకు కారణమయ్యాయి. కొన్ని స్థలాలమీద వెలుగు ప్రసరించనక్కరలేదని ఈ యాభై సంవత్సరాల సామాజిక, ఆర్థిక వ్యవస్థల నిర్వాహకులు భావించిన ఫలితంగా కొన్ని నీడలు ఏర్పడ్డాయి. మరిన్ని నీడలు చరిత్రలోనూ సామాజిక వ్యవస్థలోనూ కొన్ని వందల ఏళ్లుగానూ దశాబ్దాలుగానూ కొనసాగుతున్నాయి. ఈ అన్నిటినీ సమన్వయించి ఐదు దశాబ్దాల పరిణామక్రమంలో అంతర్భాగాలుగా గుర్తించినపుడే సాధికారికమైన, విశ్వసనీయమైన చరిత్ర రచన చెయ్యగలం.

తాత్విక స్థాయిలోని ఈ వెలుగునీడల సమస్య ఒక ఎత్తుకాగా ఈ యాభై సంవత్సరాలలో జరిగిన వాస్తవిక పరిణామాల రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక కోణాల మదింపు మరొక ఎత్తు. అటువంటి వాటిలో ప్రధానంగా గుర్తించవలసినవి ఈ ఐదు దశాబ్దాల ప్రయాణంలో గుర్తించదగిన మలుపులేవి? ఈ ప్రయాణపు వడికి పద్ధతి ఏమైనా ఉన్నదా? అనేవి. 1956 నవంబర్ 1న రూపొందిన ఆంధ్రప్రదేశ్ 2005 వరకు ఏకముఖంగా సరళరేఖలా సాగిరాలేదు. ఈ చలనానికి కొన్ని సంవత్సరాల్లో, కొన్ని దశాబ్దాల్లో ఊర్ధ్వముఖ స్వభావమూ ఉంది, మరికొన్ని సంవత్సరాలలో అధోముఖ స్వభావమూ ఉంది. వాటిని బట్టి ఈ ఐదు దశాబ్దాలనూ దశలుగా విభజించవచ్చునా అనే ఒక చర్చ అర్థశాస్త్రవేత్తల మధ్య జరుగుతూ ఉంది. 1970 వరకూ ఆంధ్రప్రదేశ్ సామాజిక ఆర్థిక గమనం ఒకరకంగా ఉండిందనీ. డెబ్భైలనుంచి ఎనభైల మధ్య వరకూ ఒక దశగా, తొంభైల తరువాత మరొక దశగా ఇలా వేరువేరుగా సాగిన విశ్లేషణల్లో ఈ యాభై సంవత్సరాలనూ మూడు దశలుగానో, నాలుగు దశలుగానో విభజించే స్థూల ఏకాభిప్రాయం ఉంది. అయితే ఈ దశలు ఆర్థిక వ్యవస్థకు, మరీ ముఖ్యంగా ద్రవ్య వ్యవస్థ నిర్వహణకు మాత్రమే వర్తిస్తాయా? ఇతర రంగాలన్నిటికి వర్తింప జేయగలమా? సందేహమే. మొత్తంగా సామాజిక ఆర్థిక వ్యవస్థలో కొట్టవచ్చినట్లు కనబడే ధోరణులు- గుణాత్మక మార్పులు ఉంటే వాటిని బట్టి దశల విభజన సాధ్యమవుతుంది కానీ ఇటువంటి దశ విభజనకు విడివిడిగా రాజకీయ రంగంలోనో, ద్రవ్య విధానాలలోనో, పారిశ్రామికీకరణలోనో, వ్యవసాయరంగ మార్పులలోనో, రాజకీయ పాలనా పరమైన మార్పుల లోనో దొరికే సూచికలు

ఉన్నాయిగాని మొత్తంగా అన్ని రంగాలకు వర్తించే సూచికలు లేవు. అంటే తెలుగు సమాజపు మొత్తం పరిణామాన్ని ఒకే దశ సూచిక ద్వారా వివరించడం సాధ్యం కాదన్నమాట. తెలుగు సమాజ పురోగమన క్రమంలో తీవ్రమైన అసమాభివృద్ధి ఉందనడానికి ఇదొక నిదర్శనం.

అలాగే ఈ యాభై ఏళ్ళ చరిత్రను అధ్యయనం చేసేటప్పుడు మరొక ముఖ్యమైన అంశం వర్గపొందికలో, కుల పొందికలో వచ్చిన మార్పులు. ఇవికూడా సరళంగానూ లేవు, స్పష్టంగానూ లేవు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడడానికి ముందు రెండు పాలనా ప్రాంతాలలోనూ అమలులోకి వచ్చిన కౌల్దారీ సంస్కరణల చట్టాలు, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత అమలులోకి వచ్చిన భూగరిష్ట పరిమితి చట్టాలు, ఏజెన్సీ ప్రాంతాల భూబదలాయింపు చట్టాలు -- ఈ చట్టాలన్నీ అరకొరగా అమలయిన తీరు మొత్తం మీద గ్రామీణ ప్రాంతాలలో భూ యజమాన్యంలో ఎంతో కొంత మార్పులు తెచ్చాయి. ఈ మార్పులు ఆశించిన ఫలితాలను సాధించాయా? గ్రామీణ భూసంబంధాలలో సమానత్వం, సామాజిక శ్రేయస్సు, ఉత్పాదకత పెరుగుదల వంటి లక్ష్యాలు సాధించబడ్డాయా? చర్చించవలసే ఉంది. అదే విధంగా గ్రామీణ వ్యవసాయరంగ మిగులు విస్తృత పునరుత్పత్తిగా పరిణమించి పారిశ్రామిక అభివృద్ధికి పునాది వేసిందా? ఈ నేల నుంచి ఒక స్వతంత్ర నూతన పారిశ్రామిక పెట్టుబడిదారీ వర్గం లేచి నిలిచిందా? పరిశీలించవలసి ఉంది. మరొక పక్క ముఖ్యంగా కోస్తా జిల్లాల వ్యవసాయ మిగులు అనుత్పాదక సేవా, వ్యాపార రంగాలలోకి ప్రయాణించి రియల్ ఎస్టేట్, సినిమా, ఫైనాన్స్, సారా, మాఫియా, రవాణా తదితర రంగాలలోకి ప్రవేశించినందువల్ల తెలుగు సమాజంలో ఏ కొత్త వర్గపొందిక ఏర్పడిందో పరిశీలించవలసే ఉంది.

ఇక కులాల పొందిక పరిశీలిస్తే 1950లలో ఊహించిన విధంగా కాకుండా తెలుగు సమాజం మరింతగా కుల ప్రస్తావనలు పెరిగిపోయిన సమాజంగా మారుతూ వచ్చిందనేది ఒక చేదు వాస్తవం. బ్రాహ్మణ, క్షత్రియ, రెడ్డి, కమ్మ కులాల రాజకీయాధిపత్యాన్ని చూసిన తెలుగు సమాజం ఒక క్రమంలో వెనకబడిన కులాల ఆధిపత్యం వైపు ప్రయాణిస్తున్నదని డా॥ రామ్‌మనోహర్ లోహియా 1950లలో చేసిన విశ్లేషణ అరకొరగాను, వికృతంగాను అమలులోకి వచ్చింది. తెలుగు సమాజంలోని అన్ని రాజకీయ పార్టీల బలాబలాలకు కుల స్వభావం ఉందని, కులమే ప్రాతిపదిక అని 1950లలో, 1960లలో అమెరికన్ పరిశోధకులు సెలిగ్ హారిసన్, కెరొలిన్ ఎం ఇలియట్ లు చేసిన విశ్లేషణ తప్పని తెలుగు సమాజం నిరూపించలేక పోయింది. 1956లో ఏ కులాలు, ఏ కులాల పొందిక రాష్ట్ర రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాలను నిర్దేశించిందో అదే పొందిక 50 ఏళ్ళ తర్వాత మరింత అప్రజాస్వామికంగా, మరింత నిస్సిగ్గుగా, మరింత ప్రగతి నిరోధకంగా సాగుతోంది.

కనుక యాభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ పరిణామక్రమాన్ని అంచనా వేసేటప్పుడు ఈ వర్గ, కుల బలాబలాల పొందికను కూడా పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది. అదే విధంగా ఇటీవలి రెండు దశాబ్దాలలో దళితులలోను, బహుజన కులాలలోను, ఆదివాసి బృందాలలోను రేకెత్తిన సామూహిక చైతన్యం, ఆత్మగౌరవ స్పృహ, అణగారిన కులాల మధ్య ఐక్యత ఆంధ్రప్రదేశ్ రాజకీయ, సామాజిక చరిత్రకు కొత్త వెలుగులు అద్దాయి. వాటిని కూడ సారాంశం నుంచి అర్థం చేసుకోవాలి.

ఈ యాభై ఏళ్ళ చరిత్ర అధ్యయనంలో గుర్తించ వలసిన మరొక ముఖ్యమైన అంశం మౌలిక సాధన సంపత్తి పెరుగుదల. మౌలిక సాధన సంపత్తిలో విద్యుత్తు, రహదారులు, రైలు మార్గాలు, సమాచార సంబంధాలు, నీటిపారుదల, కాల్వలు మొదలైన వాటిని ఆర్థిక సాధన సంపత్తిగానూ విద్య, వైద్య, ఆరోగ్య, సంక్షేమ సౌకర్యాల కల్పనను సామాజిక సాధన సంపత్తిగానూ పరిగణిస్తున్నారు. ఈ సాధన సంపత్తిలో రాష్ట్రంలో గత యాభై ఏళ్ళలో మొదటిరకం కాస్త ఎక్కువగానూ రెండవరకం కాస్త తక్కువగానూ అభివృద్ధి చెందింది. ఐతే ఇక్కడ కూడా పైన వెలుగు నీడల గురించి వేసిన ప్రశ్నలన్నీ వర్తిస్తాయి. ఈ మౌలిక సాధన సంపత్తి ప్రతి ఒక్క దానిలోనూ 1956కూ, ఇవాల్టికీ గణనీయమైన పెరుగుదల కనబడుతుంది. కానీ దాని ఫలితంగా జనజీవనంలో వచ్చిన అభివృద్ధి ఏమిటనేది అంత స్పష్టంగా ఉండదు. అంటే జరిగిందనిపించే అభివృద్ధి కూడా వైశాల్యంలోనూ లోతులోనూ సమానంగా వ్యాపించలేదనిపిస్తుంది. పైన అభివృద్ధి సాగితే కిందికి బొట్లుబొట్లుగా జారిపడుతుందని భావించిన నెహ్రూ తరహా అభివృద్ధి నమూనా గానీ మొదట కేక్‌ను పెంచితే తరవాత దాని పంపిణీ సంగతిని ఆలోచించవచ్చునన్న చంద్రబాబు తరహా అభివృద్ధి నమూనా కానీ రాష్ట్రంలో అట్టడుగు మనిషి దాకా అభివృద్ధి ఫలాలను చేర్చలేదు.

కార్పొరేట్ ఆరోగ్య రాజధానిగా హైదరాబాదు వెలుగొందుతుండగానే, వెయ్యి మైళ్ళలోపు మన్యంలో విషజ్వరాలతో, చలి జ్వరాలతో వేలాది మంది ఆదివాసులు దిక్కులేని చావు చావవలసి వచ్చింది. నానో టెక్నాలజీ వంటి అత్యాధునిక శాస్త్ర సాంకేతిక అభివృద్ధి సాగుతున్న హైటెక్ సిటీ నీడలో నరబలులు, బాణామతి హత్యలు విచ్చలవిడిగా సాగుతున్నాయి. ఆధునిక చట్టబద్ధపాలన గురించి గంభీర ప్రవచనాలకూ కొదవలేదు, చట్టవ్యతిరేక హత్యల పరంపరకూ అడ్డంకి లేదు. ఈ వైరుధ్యం ఆంధ్రప్రదేశ్ సామాజిక జీవనంలోని అసమతౌల్యానికి, హెచ్చుతగ్గులకు, అవ్యవస్థకు చిహ్నంగా నిలిచి సాంస్కృతిక వ్యక్తీకరణలు పొందుతోంది.

పైన చెప్పిన అన్ని రకాల మార్పులకూ ప్రతిఫలనంగా సాగిన సాంస్కృతిక మార్పులున్నాయి. ఈ సాంస్కృతిక మార్పులు

తెలుగు సమాజంలో ఒక మధ్య తరగతి వర్గాన్ని విస్తృతంగా పెంచాయి. పారిశ్రామిక కార్మికుల సంఖ్య, ఉద్యోగుల సంఖ్య పెరగడం మాత్రమే కాదు, సమాజంలోని వర్గ విభజన నానాటికీ మరింత తీవ్రంగానూ, సంక్లిష్టంగానూ మారిపోతూ వచ్చింది. పట్టణీకరణ అత్యంత విస్తృతంగా జరిగిన రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడే నాటికి రాష్ట్ర జనాభాలో 17.4% పట్టణ ప్రాంతాలలో ఉండగా, 2001 జనాభా లెక్కలలో అది 27.30% కి పెరిగింది. అంటే రాష్ట్ర జనాభాలో 50 ఏళ్ళలో పట్టణ జనాభా వాటా 10% పెరిగిందన్నమాట. నిజానికి ఆ స్థాయిలో పారిశ్రామిక కార్మికుల సంఖ్యగానీ ఉద్యోగుల సంఖ్యగానీ పెరగకపోవడం దృష్టిలో ఉంచుకుంటే రాష్ట్రంలోని పట్టణీకరణ కూడా అసమతౌల్యంగా జరిగిందని అర్థమవుతుంది.

పట్టణాభివృద్ధి అవసరాల కొద్దీ కాక ఇలా అసమంగా జరిగినందువల్ల పట్టణాలు పౌర సౌకర్యాలు కల్పించలేక పోగా సౌకర్యాల లేమికి చిహ్నాలుగా నిలిచాయి. అందువల్ల ఆంధ్రప్రదేశ్‌లోని పట్టణాలన్నిటిలో రియల్ ఎస్టేట్ వ్యాపారం వాస్తవికతా పునాదులపై కాక గాలిబుడగలులాగ విస్తరించింది. అందువల్ల దీనికి మాఫియా తోడై అక్కడినుంచి రాజకీయాలు కూడా ప్రవేశించాయి. కనక తెలుగు సమాజ అభివృద్ధిలోని పట్టణీకరణ అనే ఒక సాంస్కృతిక మార్పును అధ్యయనం చెయ్యాలంటే రియల్ ఎస్టేట్ వ్యాపారం అనే ఆర్థిక పరిణామాన్ని, రాజకీయ నేరప్రపంచ సంబంధం అనే రాజకీయ చట్టపాలనా సంబంధమైన పరిణామాలనూ కలిపి అధ్యయనం చెయ్యాలి.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో ప్రాథమిక (వ్యవసాయం, అడవులు, చేపలు, గనులు), ద్వితీయ (పరిశ్రమలు, నిర్మాణం, విద్యుచ్ఛక్తి, ఇంధనం, నీటి సరఫరా), తృతీయ (సేవారంగం) రంగాల వాటాల విషయంలో విశిష్టమైన మార్పులు కనబడుతున్నాయి. ఈ విశిష్టతే ఆంధ్రప్రదేశ్ 50 ఏళ్ళ చరిత్రకు విశిష్టతను కల్పించిందేమో చూడాలి. ప్రాథమికరంగం వాటా 1955-56లో 51.85 శాతం ఉన్నదల్లా 2004-05 నాటికి 28.3కు తగ్గింది. ద్వితీయరంగం వాటా అదేకాలంలో 14.70 శాతం నుంచి 22.5 శాతానికి పెరిగింది. తృతీయరంగం వాటా 32.74 శాతం నుంచి 49.2 శాతానికి పెరిగింది. ఇందులో కూడ మళ్ళీ విడివిడిగా చూస్తే వ్యాపారం, హోటళ్ళు, రెస్టారెంట్ల వాటా మూడు వందల రెట్ల పైన పెరిగింది. బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, ఫైనాన్స్ సేవల వాటా 0.81 శాతం నుంచి 5.2 శాతానికి, భూముల కొనుగోళ్ళు, అమ్మకం, నివాస భవనాలు, తదితర వ్యాపారాల వాటా 2.3 శాతం నుంచి 7.9 శాతానికి పెరిగింది.

చిట్టచివరగా చెబుతున్నప్పటికీ గత 50 సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ పరిణామ చరిత్రలో అత్యంత ముఖ్యమైన అంశం ప్రజాఉద్యమాల చరిత్రకు సంబంధించినది. ఒక సమాజ పురోగమనానికి ఆ సమాజంలోని వివిధ బృందాలు వాటా కోసం, హక్కుల కోసం పడే తపన, చేసే ప్రయత్నం, ఎలుగెత్తే ఆకాంక్షలు చోదక శక్తిగా ఉంటాయి. ఈ ఆరాటాలూ ఆకాంక్షలూ పోరాటాలూ ఆ సమాజానికి రంగు, రుచి, వాసన ఇస్తాయి. పరిమాణాత్మక, గుణాత్మక మార్పులకు కారణమవుతాయి. తెలుగు సమాజ చరిత్రనిండా ఇటువంటి ఉద్యమాలు ఉన్నాయి. అవి ఒక్కొక్కసారి బహిరంగ, ఉధృత వ్యక్తీకరణ పొందిఉండవచ్చు. ఒక్కొక్కసారి లోలోపల రగులుకునే అసంతృప్తిగా ఉండవచ్చు. కాని వాటిలో ఏ ఒక్కటైనా అనేక సామాజిక ఆర్థిక, రాజకీయ సాంస్కృతిక ఆకాంక్షలకూ అసంతృప్తులకూ అవసరాలకూ ప్రతిఫలనాలుగా ప్రతీకలుగా ఉంటాయి. అందువల్ల గత యాభై సంవత్సరాలలో తెలుగు సమాజం అనుభవించిన ఇటువంటి ఉద్యమాలన్నిటినీ వరుసగా వివరిస్తూ వస్తే తెలుగు సమాజ చరిత్ర తయారవుతుంది.

ఆంధ్రప్రదేశ్ అవతరణకు ముందే అప్పటికి రెండు వేరువేరు పాలనా ప్రాంతాల కింద ఉన్న తెలుగు సమాజం గొప్ప ఉద్యమాలను నడిపింది. విశాలాంధ్ర ఏర్పాటు కూడా ఒక ప్రజాఉద్యమ ఆకాంక్షగానే వ్యక్తమయ్యింది. విశాలాంధ్ర ఏర్పాటులో నష్టపోతామేమోనని ఒక ప్రాంతం వెలిబుచ్చిన ఆందోళన కూడా ప్రజా ఉద్యమ రూపం ధరించింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఐదారు సంవత్సరాలకే భూసంబంధాలలో మార్పులకోసం రాష్ట్ర వ్యాప్తంగా చిన్నా పెద్దా పెనుగులాటలు ప్రారంభమయ్యాయి. 1966 నాటికి తెలుగు సమాజపు నిరుద్యోగ సమస్యకు ఒక పరిష్కారంగా 'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' నినాదంగా యువజనోద్యమం పెల్లుబికింది. పెద్దమనుషుల ఒప్పందాన్ని ఉల్లంఘించి తెలంగాణకు అన్యాయం చెయ్యడం జరిగిందని ప్రత్యేక తెలంగాణా ఉద్యమం 1969లో ప్రారంభమయింది. భూమి, భుక్తి, విముక్తి నినాదంతో నక్సలైట్ ఉద్యమం ఆంధ్రప్రదేశ్‌లో వేళ్ళూనుకుంది. ఆ ఉద్యమం గత మూడున్నర దశాబ్దాలుగా ఎడతెగకుండా సాగడం మాత్రమే గాక తెలుగు సామాజిక రాజకీయ జీవితం మీద అపారమైన ప్రభావాన్ని వేస్తోంది. ఇక ఆ తరువాత గడిచిన మూడు దశాబ్దాలు ఎన్నెన్నో డిమాండ్లపై ఎన్నో ప్రజా ఉద్యమాలు చెలరేగాయి. జై ఆంధ్ర, అధిక ధరలకు వ్యతిరేక ఉద్యమం, దళితుల ఆత్మ గౌరవ పోరాటం, వివిధ కులాల ఉద్యమాలు, మహిళా ఉద్యమం, సారా వ్యతిరేక ఉద్యమం, 1/70 పరిరక్షణ ఉద్యమాలు, ఆదివాసీ హక్కుల ఉద్యమాలు, ప్రపంచ బ్యాంకు నిర్దేశిత విధానాల వ్యతిరేక ఉద్యమాలు, నీటిపారుదల ప్రాజెక్టుల కోసం ఉద్యమాలు, ప్రాజెక్టు నిర్వాసితుల పరిష్కారం కోసం ఉద్యమాలు, రాజ్య నిర్బంధ వ్యతిరేక ఉద్యమాలు, ఆత్మహత్యలకు నిరసనలు, విద్యుత్ చార్జీల పెంపుదల వ్యతిరేక ఉద్యమం, స్థానిక సమస్యలపై, చిన్నచిన్న సమూహాల సమస్యలపై ఆందోళనలు మొదలైనవి ఎన్నో సాగాయి. ఈ అన్ని ఉద్యమాలలోనూ పాల్గొన్న జనాభానంతా లెక్కబెడితే తెలుగు సమాజంలో ఏదో ఒక ఉద్యమంలో పాల్గొనని జనాభా అతి తక్కువ అంటే అతిశయోక్తి కాదు.

ఈ యాభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ పరిణామాలను మదింపు వేసేటప్పుడు ఈ అన్ని ప్రాతిపదికలనూ పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది. ❑

# ఐదు దశాబ్దాల విహంగ వీక్షణం

వి. హనుమంతరావు

మానవుని జీవితంలో బాల్యం, యవ్వనం, కౌమారం, వృద్ధాప్యం వున్నట్లే ఒక దేశం మనుగడలో ఇన్ని దశలు ఉండవనుకుంటా - లేదా ఒక్కొక్కదశ ఒక్కోశతాబ్దం పడుతుందో ఏమో! ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికే పరిమితమై చూసుకుంటే గడిచింది 50 సంవత్సరాలైనా మనం ఏ దశలోవున్నామో నాకైతే తెలియుటంలేదు. ఒకోసారి రివర్స్‌గేర్‌లో నడుస్తున్నామా అనిపిస్తుంది. నేనేమీ తేల్చుకోలేక అయిదు దశాబ్దాలను విహంగ వీక్షణం చేసి మీ ముందుంచి మీరేమంటారో తెలుసుకొందామనే ప్రయత్నమే ఈ వ్యాసం. ఆ ప్రయత్నంలో రాజకీయ పరిణామాలను, రాష్ట్రపురోగమన, తిరోగమన పరిణామాలను వేర్వేరుగా చూడలేం.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆంధ్ర జిల్లాలు వివక్షకు, తెలంగాణ జిల్లాలు నిజాం నిరంకుశ, ఫ్యూడల్ పరిపాలనలో వెనుకబాటు తనానికి గురైన రాష్ట్రం కావటంతో, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన వెంటనే అభివృద్ధి వైపు ప్రభుత్వం దృష్టి సారించింది. అయితే, అభివృద్ధి సాధించాలనే తపనలో వెనుకబాటుతనంలో కూడా తరతమ భేదాలను, మరీవెనుకబడిన ప్రాంతాలకు ప్రాధాన్యత ఇవ్వాలనే విషయాన్ని పక్కన పెట్టడం జరిగింది. ఈ రోజున మనం చూస్తున్న ప్రాంతీయ విభేదాలకు ఆనాటి విధానలోపమే పునాదులు వేసిందని భావించాలి. 60వ దశకంలో రాష్ట్రాన్ని పారిశ్రామికీకరణ గావించాలనే తలంపుతో తమ రాష్ట్రం పారిశ్రామికంగా వెనుకబడిన రాష్ట్రం కాబట్టి కేంద్ర ప్రభుత్వరంగ పరిశ్రమలు రాష్ట్రంలో స్థాపించాలని కేంద్రాన్ని అడిగిన రాష్ట్ర ప్రభుత్వం, రాష్ట్రంలోనే మరీవెనుకబడిన ప్రాంతాల విషయంలో అదే వైఖరిని అవలంబించక పోవటం ఆనాటి నాయకత్వ లోపంగా భావించాలి. ఈ లోపం కారణంగా ఆనాడు రాష్ట్రంలో ఏ జిల్లాలు వెనుకబడివున్నాయో, ఆ జిల్లాలు ఇతర జిల్లాలతో పోలిస్తే ఇంకా వెనుకబడే వున్నాయి.

రాష్ట్రం ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రం కావటంతో ఎన్నికైన శాసనసభ సభ్యులు, పార్లమెంటు సభ్యులు ప్రధానంగా వ్యవసాయ దారులే అధికారంలోకి వచ్చారేమో, వారు చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలునీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణంతోనే ప్రారంభమయ్యాయి. ఆంధ్ర ప్రాంతంలో నాగార్జునసాగర్, తెలంగాణా ప్రాంతంలో పోచంపాడు (ఇపుడు శ్రీరాంసాగర్) ప్రాజెక్టులు చేపట్టడం అందుకు నిదర్శనం. ప్రధాని నెహ్రూ ఈ ప్రాజెక్టులు "ఆధునిక దేవాలయాలు" అని నామకరణం చేసింది మన రాష్ట్రంలోనే. అప్పట్లో నాగార్జున సాగర్ నిర్మాణాన్ని రాష్ట్రావతరణ జరిగిన వెన్వెంటనే చేపట్టడానికి మరో కారణం కూడా ఉంది. 1950-55 సంవత్సరాల మధ్య కాలంలో మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి రాజాజీ కృష్ణా జలాలను మద్రాసుకు కృష్ణా - పెన్నార్ ప్రాజెక్టుల పేరుతో తరలించడానికి ప్రయత్నం చేయడాన్ని ఆంధ్ర ప్రజలు తీవ్రంగా ఖండిస్తూ పెద్ద ఎత్తున ఆందోళన చేసారు. ఈ నేపథ్యం నాగార్జునసాగర్ నిర్మాణాన్ని వెంటనే చేపట్టడానికి ప్రోత్సహించింది. ఈ రకంగా నీటిపారుదలకు పెద్దపీట వేయటం, వ్యవసాయాభివృద్ధిపై ప్రత్యేక శ్రద్ధ చూపించటం ఫలితంగా 1955-56 నాటికి 27.47 లక్షల హెక్టార్లకు అందుతున్న నీటి సదుపాయం 1981-82 నాటికి 36.92 లక్షల హెక్టార్లకు పెరిగింది. ఆహార ధాన్యాల ఉత్పత్తి 56-57లో 56 లక్షల టన్నుల నుంచి 82-83 నాటికి 119 లక్షల టన్నులకు, వరిపంట హెక్టారుకు దిగుబడి అదేకాలంలో హెక్టారుకు 1137 కిలోల నుంచి 2161 కిలోలకు పెరిగింది. ఎలక్ట్రిక్ మోటార్లు కేవలం 4930 నుంచి 5.37 లక్షలకు పెరిగాయి. 1955-56 కు 1982-83కు మధ్య 27 ఏళ్ళలో 63 లక్షల టన్నుల ఆహారధాన్యాల పంటపెరగగా 82-83 నుంచి 2003-04 వరకు మధ్య 21 ఏళ్ళలో పంట పెరుగుదల 43 లక్షల టన్నుల మాత్రమే.

## విద్యుచ్ఛక్తి

ప్రణాళికలు ప్రారంభించిన 1951 నాటికి ఆంధ్ర ప్రాంతంలోని 11 జిల్లాల్లో విద్యుదీకరించిన గ్రామాల సంఖ్య 197 మాత్రమే. విద్యుదుత్పాదక శక్తి 43.1 మెగావాట్లు, తలసరి వినియోగం 2.5 యూనిట్లు, మొత్తం రాష్ట్రంలో ఉత్పత్తి చేస్తున్న విద్యుచ్ఛక్తి 103.9 మి.కి.వా. మాత్రమే. వ్యవసాయానికి వినియోగిస్తున్నది 8.5 శాతం తెలంగాణాలో కొన్ని జిల్లాల్లో విద్యుచ్ఛక్తి లేదు. హుస్సేన్ సాగర్ వద్ద ఒక విద్యుదుత్పాదన కేంద్రం వుండేది. 1982-83 నాటికి విద్యుదుత్పత్తి 2753.4 మెగా వాట్లు, తలసరి వినియోగం 136.6 యూనిట్లు, గ్రామాల సంఖ్య 20661కు పెరిగింది. అభివృద్ధికి విద్యుచ్ఛక్తి కీలకం కాబట్టి ఈ రంగంలో సాధించిన విజయంతో వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లో అభివృద్ధి జరిగి మొత్తం రాష్ట్రం ముందుకు సాగడానికి తోడ్పడింది. రాష్ట్రం చీకటి నుంచి వెలుగులోకి అడుగుపెట్టింది. 1983 నాటికే కృష్ణా, గుంటూరు, అనంతపురం, రంగారెడ్డి, మెదక్ జిల్లాల్లో నూటికి నూరు గ్రామాలు విద్యుదీకరించ బడ్డాయి.

## పరిశ్రమలు

వ్యవసాయం, పరిశ్రమలు బండికి రెండు చక్రాల్లాంటివి. పారిశ్రామికంగా చూస్తే హైదరాబాద్ నగరంతో సహా తెలంగాణాలోనే ఎక్కువ పరిశ్రమలు, ఆంధ్ర ప్రాంతాలలో తక్కువ పరిశ్రమలు వుండేవి. వ్యవసాయం, నీటిపారుదల మీద రాష్ట్ర ప్రభుత్వం దృష్టి కేంద్రీకరించటంతో, పరిశ్రమల మీద చూపించాల్సినంత శ్రద్ధ చూపించలేక పోయినా, సమతూకంగా రాష్ట్రాలు అభివృద్ధి సాధించాలని ప్రణాళికా సంఘం చేసిన అభ్యర్థనల ఫలితంగా హైదరాబాద్, విశాఖ, విజయవాడల్లో పరిశ్రమలు విరబూశాయి. విశాఖ ఉక్కుకు ఆ కాలంలోనే పునాదులు పడ్డాయి. అయితే పెద్ద ఎత్తున విశాఖ ప్రజలు ఆందోళన చేసిన ఉద్ఘాటనను ఆధారం చేసుకొని రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి చేసిన తర్వాతనే అది సాధ్యమైంది. రాష్ట్రం పారిశ్రామికంగా మూలమలుపు తిరిగిందంటే ఆ పరిణామానికి కేంద్ర ప్రభుత్వరంగ పరిశ్రమల స్థాపనే పునాది వేసింది. అయితే రాష్ట్ర ప్రభుత్వం పరిశ్రమల స్థాపనకు కావల్సిన భూమి కేటాయింపు, మౌలిక సౌకర్యాల కల్పన, అనేక పారిశ్రామిక సహాయ కార్పోరేషన్ల ఏర్పాటు, అనేక ప్రోత్సాహకాల ప్రకటనల ద్వారా తన వంతు కృషి చేసింది.

వీటన్నిటికన్నా భూసంస్కరణలు ప్రవేశపెట్టడం ముఖ్యపాత్ర వహించింది. సంస్కరణల ఫలితంగా పేదలకు భూమి పంపకంలో ఘోరంగా విఫలమైనా, భూకామందులు భూములను నమ్ముకుంటే అంతే సంగతులని గ్రహించి, మెల్లమెల్లగా పరిశ్రమల స్థాపన వైపు మొగ్గు చూపించటం ప్రారంభమైంది. పరిశ్రమలు ఏర్పడాలంటే విద్యుదుత్పత్తి కీలకం కావడంతో 1970 పూర్వార్థ కాలంలో విద్యుత్ కేంద్రాల నిర్మాణానికి ప్రయత్నం ప్రారంభించటం, అవి ఉత్తరార్థ కాలంలో మరిన్ని పరిశ్రమల ఏర్పాటుకు అవకాశం ఏర్పడింది. పారిశ్రామికంగా ఆంధ్రప్రదేశ్ 1975-85 మధ్య కాలంలో స్వర్ణయుగంగా నిస్సందేహంగా చెప్పవచ్చు. భారీ పరిశ్రమలు ఏర్పడటంతో వీటికి కావల్సిన ఉప ఉత్పత్తులను తయారుచేసే చిన్న పరిశ్రమలు వాటి చుట్టు వెలిశాయి.

1956-83 మధ్య కాలంలో పంచాయతీరాజ్ సంస్థల ఏర్పాటు ఒక ముఖ్య సంస్కరణగా చెప్పవచ్చు. పరిపాలనా వ్యవస్థను ప్రజలకు దగ్గరగా తీసుకెళ్ళటం దీని లక్ష్యం. కాని దీని వెనుక వున్న రాజకీయలక్ష్యం అధికారం కోసం రాష్ట్ర, కేంద్ర నాయకత్వాల మీద కిందిస్థాయి నుంచి వస్తున్న ఒత్తిడులనుంచి తప్పించుకోవటానికి చేసిన ఏర్పాటు. అధికార వికేంద్రీకరణతోపాటు లంచగొండి తనం కూడా వికేంద్రీకరణ జరిగింది. రాజకీయాల్లోకి అసాంఘిక శక్తుల ప్రవేశానికి అపుడే పునాదులు పడి చట్ట సభల్లో నేరస్తుల ప్రవేశానికి దారితీసింది. ఏమైనా పరిపాలన వ్యవస్థ వికేంద్రీకరణ జరిగిందనే విషయం కాదనలేం. బస్సుల జాతీయకరణ, ఉద్యోగాల్లో దళిత, గిరిజనులకు రక్షణ, ఆరుసూత్రాల పథకం, లెజిస్లేటివ్ కౌన్సిల్ ఏర్పాటు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల ప్రారంభం, విస్తృతంగా ప్రాథమిక, ఉన్నత కాలేజీ, విశ్వవిద్యాలయాల స్థాపన ఈ కాలంలో మరికొన్ని మైలురాళ్ళు.

## తెలుగుదేశం

అయితే రాష్ట్రం అభివృద్ధి పథాన పయనం సాగించింది కాని, ఆ అభివృద్ధి ఫలితాలు సామాన్యులకు దక్కలేదనడానికి ప్రభుత్వ అభివృద్ధి కార్యక్రమాల ఫలితాలు పేదలకు, గిరిజనులకు అందని ఫలితంగా నక్సలైటు ఉద్యమం ప్రారంభం, అలాగే 1982 లో అప్పటి వరకు అధికారంలో వున్న కాంగ్రెస్ పార్టీ చిత్తుగా ఓడిపోయి ప్రముఖ సినీనటుడు ఎన్.టి. రామారావు తొమ్మిది నెలల క్రితం స్థాపించిన తెలుగుదేశం అధికారంలోకి రావటమే తార్కాణం. రాష్ట్ర చరిత్రలో ఇదొక నూతన అధ్యాయం. సినిమాల్లో కథానాయకుడిగా ఎన్.టి. రామారావుకు సామాన్య ప్రజల్లోవున్న గొప్ప గుర్తింపు, ఎన్నికల సమయంలో రెండు రూపాయలకు కిలో బియ్యం నినాదంతో విజయం తెలుగుదేశం పార్టీని వరించింది. ఆపార్టీ విజయం, రాజకీయాలంటే ఓనమాలు తెలియని ఎన్.టి. రామారావు అఖండమైన మెజారిటీతో గెలుపు మొత్తం దేశంలోనే సంచలనాత్మక వార్త అయింది. అప్పటి వరకు కాంగ్రెస్ 27 సంవత్సరాలు పరిపాలించి అనేక భౌతిక సదుపాయాలు, మార్పులు చేసినా, అవన్నీ కేవలం అభివృద్ధి కార్యక్రమాల్లో భాగంగానే జరిగాయి. కానీ ఎన్.టి. రామారావు పరిపాలనా వ్యవస్థలో, సామాజిక వ్యవస్థలో విప్లవాత్మకమైన సంస్థాగత మార్పులు ప్రవేశపెట్టారు.

* గ్రామీణ ప్రజల పాలిట యమధర్మరాజైన గ్రామీణాధికారుల (కరణం-మున్సబు, పటేల్-పట్వారీ) వ్యవస్థ రద్దు
* తాలూకా వ్యవస్థ స్థానే మరింత దగ్గరగా మండల వ్యవస్థ ఏర్పాటు
* శాసన మండలి రద్దు
* రాష్ట్రాల ముఖ్యమంత్రుల సమావేశానికి చొరవతీసుకొని కేంద్ర ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు జెండా ఎగురవేసిన ఫలితంగా సర్కారియా కమిషన్ ఏర్పాటు
* గవర్నర్ వ్యవస్థ రద్దుకు శాసనసభ తీర్మానం
* స్త్రీలకు ఆస్తిహక్కు
* రెండు రూపాయలకు కిలో బియ్యం
* జనతా వస్త్రాల పథకం
* శ్రీరామ్‌సాగర్ రెండోదశ, కనకదుర్గ వారధులకు శంకుస్థాపన
* దేశంలో ఎక్కడాలేని తరహాలో ఆర్.టి.సి. కాంప్లెక్సులు
* తెలుగు గంగకు శ్రీకారం

అయితే ఈ మార్పుల్లో కొన్నిటి వెనుక పరిపాలనేతర కారణాలు లేకపోలేదు. తెలుగుదేశం అధికారంలోకి వచ్చేసరికి అత్యధిక పంచాయతీ సమితులు కాంగ్రెస్ పార్టీ చేతుల్లో వున్నాయి. వెంటనే వారిని తొలగించే అవకాశం లేకపోవటంతో వాటిని రద్దుచేసి

మండల వ్యవస్థను సృష్టించి, తన పార్టీకి కిందిస్థాయిలో పునాదులేర్పరచుకున్నారు. రెండు రూపాయలకు కిలో బియ్యంతో పేదప్రజలకు ఆరాధ్యుడై పోవడమే కాక, పేదరికాన్ని కొంత మేరకు తగ్గించగలిగారు. స్త్రీలకు ఆస్తిహక్కు సంక్రమింప చేయటంద్వారా వోటుగాలం వేశారు. రాజకీయ ప్రయోజనాలకు ప్రజానుకూల సంస్కరణలనే పాప్యులిస్ట్ ముసుగు వేయటంలో కొంత పరిణతి కనిపిస్తుంది. అయితే ఆయన చేసిన కొన్ని నిర్ణయాలు ముందువెనుకాల చూసుకోకుండా చేసిన నిర్ణయాలు కావటం 1989లో ఆ పార్టీ ఓటమికి కారణమేమోనని అనిపిస్తుంది. ఉదాహరణకు రెండు రూపాయలకు కిలో బియ్యం పేదలపాలిట పెన్నిధే, అయినా అందువల్ల బియ్యం సబ్సిడీ భారం రు. 1100 కోట్లను ప్రత్యామ్నాయ చర్యల ద్వారా ఎలా పూడ్చడం అనే ఆలోచనేలేదు. ప్రణాళికలో విద్యుచ్ఛక్తికి కేటాయింపు తగ్గించటంతో ఆనాటినుంచి ఈనాటి వరకు విద్యుత్ రంగంలో ఆటు పోటులకు కారణమయ్యారు. 'నేనేపార్టీ, నాతర్వాత పార్టీలేదు' అనే నియంతృత్వ పోకడ(చంద్రబాబుకు ఈయన వారసత్వమే అబ్బినట్లుంది) పార్టీలోనే అసంతృప్తి నివురు గప్పిన నిప్పులా వుంటూవచ్చింది. ఇందిరాగాంధీ హత్య తర్వాత జరిగిన ఎన్నికల్లో రాజీవ్ హవా దేశమంతటా వీచినా, ఆంధ్రను ప్రభావితం చెయ్యలేకపోయింది. అలాంటి పార్టీ 1989 ఎన్నికల్లో ఎందుకు ఓడిపోయింది? ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు తీసుకొన్న నిర్ణయాలు ఆక్షేపించదగినవి, ఖండించదగినవి కాకపోయినా, వివిధ వర్గాలను వివిధ రకాలుగా ప్రతికూలంగా ప్రభావితంచేశాయి. ఉదాహరణకు కూడు (రెండు రూపాయలకు కిలో), గూడు (పక్కాగృహనిర్మాణం), గుడ్డ (జనతావస్త్రాలు) లాంటి సంక్షేమ కార్యక్రమాలు, వితంతువులు, వృద్ధులకు పెన్షన్లు, రిక్షా సొంతం చేసుకోవడానికి ఆర్థిక సహాయం లాంటి నిర్ణయాలు పేదప్రజలకు సంతోషాన్ని కలుగచేశాయి. ఇవి ఆయన పాలనలో ప్లస్ పాయింట్లయినా, అదేసమయంలో మైనస్ పాయింట్లు కూడా చాలానేవున్నాయి. రద్దు చేసిన గ్రామాధికార వ్యవస్థ స్థానే ప్రత్యామ్నాయ ఏర్పాటు చేయక పోవటంవల్ల గ్రామాల్లో ఇతర పథకాల వల్ల లాభపడినవారు కూడా ఇబ్బందులు పడ్డారు. సంఘటిత రంగాల్లో డాక్టర్లు, ఉపాధ్యాయులు, ఎన్.జి.వో.లతో తగవు తెచ్చిపెట్టుకున్నారు. ప్రయివేటు ప్రాక్టీస్, ప్రైవేటు ట్యూషన్ల నిషేధం, రిటైర్‌మెంటు వయస్సు తగ్గింపు నిర్ణయాలు ఆహ్వానించ దగినవేఅయినా, ఆ వర్గాలతో వైరం కొని తెచ్చుకొన్నట్లయింది. అలాగే మండల ఎన్నికల్లో ఎస్సీ, ఎస్టీలకు రిజర్వేషన్లు పెంచటం, స్త్రీలకు, బిసిలకు రిజర్వేషన్లు కల్పించటం హర్షించదగిన నిర్ణయాలే. అయినా ఆచరణలో ఆ వర్గాలను విభజించినట్లయింది. బిసికి సీటు కేటాయిస్తే, బిసిలతో బిసిలే పోటీపడడంతో, బిసిలను విభజించినట్లయింది. ఇది వారిలో అసంతృప్తికి దారితీసింది. మొత్తం రిజర్వేషన్లు సగానికి సగం కావటంతో సంపన్న వర్గాల ఆధిపత్యాన్ని సవాలు చేసినట్లయింది. దీన్ని అవకాశంగా తీసుకొని అగ్రవర్ణాలు, ఇతర వర్గాల మధ్య చిచ్చురేగింది. బలహీన వర్గాలకు ఎక్కువ ప్రాతినిధ్యం ఇస్తున్నామని పాలకులు భావిస్తే, వర్ణ, వర్గ విభేదాలు ఆ సదాలోచనను దెబ్బతీసాయి. తెలుగుదేశం ఓడిపోయింది. తర్వాత అయిదేళ్ళు పాలించిన కాంగ్రెస్ ప్రజలను పెద్దగా ప్రభావితం చెయ్యకపోగా ముగ్గురు కాంగ్రెస్ ముఖ్యమంత్రులు మారారు. చెన్నారెడ్డి పాలనలో ఎవరి మీద లేనన్ని అవినీతి ఆరోపణలు వచ్చాయి. జనార్దనరెడ్డి హయాంలో ప్రయివేటు యాజమాన్యాలకు కాలేజీల పందారం జరిగి అపఖ్యాతి కొనితెచ్చుకున్నారు. కోట్ల విజయభాస్కరరెడ్డి అధికారంలోకి వచ్చేనరికి మెడికల్ కాలేజీల ఉత్తర్వులు, సబ్సిడీబియ్యం పథకం, సారావ్యతిరేక ఉద్యమంలాంటి అపరిష్కృత సమస్యలని ఎదుర్కోవాల్సి వచ్చింది. ఈ వైఫల్యాలను తెలుగుదేశం సొమ్ముచేసుకుందంటే ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. ఇది తెలుగుదేశం మళ్ళా అధికారంలోకి రావడానికి తోడ్పడింది. అధికారంలోకి వస్తే మద్యపాన నిషేధాన్ని అమలు చేస్తానని, రెండు రూపాయలకు కిలో బియ్యం పథకం పునరుద్ధరిస్తానని చేసిన వాగ్దానాలు ప్రజలనాకట్టుకున్నాయి. తిరిగి తెలుగుదేశానికి పట్టంకట్టారు. ఈ రెండు వాగ్దానాలు అమలు పరచినందుకు సంతోషించాలా? ఈ నిర్ణయాల వల్ల ఖజానాలో తీరనిలోటు ఏర్పడి ఆర్థిక వ్యవస్థ సంక్షోభానికి రాష్ట్రాన్ని రుణగ్రస్తం చేసినందుకు విచారించాలా?

ఆర్థిక సంక్షోభం తీవ్రమైంది. ఆ నేపథ్యంలో ఎన్.టి. రామారావు రాజప్రాసాదంలో చంద్రబాబు చిచ్చురేపి అధికారంలోకి రావటం, ప్రపంచబ్యాంకు ఆర్థిక సహాయంతో ఈ సంక్షోభం నుంచి బయట పడడానికి ప్రయత్నం చేయటం, కాని సంక్షోభం మరింత ముదిరి రాష్ట్రాన్ని అప్పుల ఊబిలోకి లాగటం-ఇవన్నీ ఇటీవల జరిగిన పరిణామాలే కాబట్టి వాటిని ఇక్కడ మళ్ళా చెప్పబూనటం మీ జ్ఞాపకశక్తిని కించపరిచినట్లవుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే చంద్రబాబు ముఖ్యమంత్రిత్వం రాజధాని నగరానికే పరిమితమైంది. జన్మభూమి ఆయన పరిపాలనకు ఫ్లాగ్‌షిప్. ఆయన ఆ ఫ్లాగ్‌షిప్ మీద కాసబియాంకా ఆన్ ది బర్నింగ్ డెక్‌గా హెలికాప్టర్‌లో గ్రామాలు తిరుగడానికి పనికివచ్చింది కాని, వారి సమస్యలను పరిష్కరించడానికి తోడ్పడలేదు. పంచాయతీ వ్యవస్థకు పోటీగా నోడల్ వ్యవస్థనేర్పాటుచేసి ఎన్నికైన పంచాయతీ వ్యవస్థ నోట్లో మన్ను కొట్టారు. ఆ పార్టీ పొలిట్ బ్యూరో సభ్యులంతా విద్యాధికులే, ఆర్థిక పరిస్థితిని, సమాజాన్ని, తలెత్తుతున్న ధోరణులను అవగతం చేసుకోగలిగినవారే. కాని మర్రి చెట్టుకింద ఏ మొక్క మొలవదు. మామ మంచిలక్షణాలన్ని అబ్బలేదు కాని అవలక్షణాలన్ని పుణికి పుచ్చుకొన్నారు. చరిత్ర నుంచి పాఠాలు నేర్చుకోవటం అలవాటు లేదని కాంగ్రెస్‌ను ఎద్దేవా చేసే మాజీ ముఖ్యమంత్రి ఆపని తాను చేసివుంటే, వరుసగా రెండు ఎన్నికల్లో ఘోర పరాజయాల్ని చవిచూసి వుండేవారు కాదు. ఇక ముందయినా ఆ పార్టీ పొలిట్ బ్యూరో సభ్యుల ఉమ్మడి విజ్ఞానానికి విలువ ఇస్తే అత్యంత అవసరమైన ప్రతిపక్ష పాత్ర నిర్వహించ గలుగుతారు.

## మళ్ళా కాంగ్రెస్

మళ్ళా కాంగ్రెస్ అధికారంలోకి వచ్చిందంటే ఆ ఘనత వ్యక్తిగతంగా రాజశేఖర రెడ్డికి దక్కుతుంది. అలాగే పంచాయతీ ఎన్నికల్లో గెలిచిన ఘనత కూడా. ఎన్నికలముందు, తర్వాత వరాల జల్లు కురిపిస్తునారు. కోటి ఆశలు రేపుతున్నారు. చేసిన, చేస్తూన్న వాగ్దానాలకు ఆచరణరూపం ఇవ్వగలరా? అనుమానమే. 46 వేలకోట్ల ఖర్చుతో 26 ప్రాజెక్టులను అయిదు సంవత్సరాల్లో పూర్తి చేయగలరా? అనుమానమే. ప్రాజెక్టుల నిర్మాణం గురించిన నిర్ణయంచేసి ప్రభుత్వ దృష్టిని గ్రామాల వైపు మళ్ళించటం అత్యవసరమైన, హర్షణీయమైన నిర్ణయమే. గత అయిదారు సంవత్సరాలుగా వర్షాలకోసం రైతాంగం మొఖం వాచివున్నారేమో, రైతాంగానికి ఈ నిర్ణయం ఎర్రటి ఎండలో తిరిగి వచ్చి చల్లని నీరు తాగినంత స్వాంతన కలిగిస్తుంది. ఇన్ని ప్రాజెక్టులకు నిధులేవి అని రైతులు అడగటం లేదు, వారి నాయకులే అడుగుతున్నారు. స్వాభావికంగా రైతుకు ఓపిక ఎక్కువ. కాకపోతే దశాబ్దాలుగా, శతాబ్దాలుగా పండినా పండకపోయినా, విరగకాసినా, తుపాన్లు వచ్చి కొట్టుకుపోయినా, ఇంకా వ్యవసాయాన్నే అంటి పెట్టుకొని వుంటున్నాడు. టెండర్ల మీద ఎంత దుమారం లేపినా, రైతు స్పందించలేదెందుకు? అయితే ఈ ఓపికను పాలకులకు పరీక్ష పెట్టరనే ఆశించాలి. అలాగని నిధుల గురించి ఏమరుపాటు తగదని ఎవరో హెచ్చరికలు చేయకుండానే ప్రభుత్వం రకరకాల ప్రయత్నాలు చేస్తుంది. ముందే నిధులు జేబుల్లో పెట్టుకొని ప్రాజెక్టులు నిర్మాణం ప్రారంభించాలనే విమర్శలో అర్థంలేదు. మన రాష్ట్ర బడ్జెట్ మొత్తం రు. 95 కోట్లు మాత్రమే ఉన్న 1956లోనే రు. 90 కోట్లు ఖర్చు అయ్యే నాగార్జునసాగర్‌కు శంఖుస్థాపన జరిగింది. వరుసగా లోటు బడ్జెట్లతో ప్రభుత్వాన్ని నెట్టుకు వచ్చిన చంద్రబాబు 40 లక్షల కోట్లు ఖర్చు అయ్యే స్వర్ణాంధ్ర ఏర్పాటుకు ప్రణాళిక రచించలేదూ? కాని ఆయనలాగే ప్రస్తుత ముఖ్యమంత్రి కూడా ప్రపంచబ్యాంకు వైపు మోర ఎత్తి ఎదిరిచూడటం చూస్తే చంద్రబాబుకు ప్రజలు చూపిన బాటనే రాజశేఖర రెడ్డికి కూడా చూపిస్తారేమోనని హెచ్చరించాలి. ఈ వ్యాసం రాస్తుండగా 05-06 మూడవ త్రైమాసం బడ్జెట్‌ను ఆర్థికశాఖ ఇంకా విడుదల చేయలేదని తెలిసింది. తాజాగా విడుదల చేసిన 04-05 సంవత్సరం అప్రోప్రియేషన్ ఎకౌంట్స్ ప్రకారం ఆ సంవత్సరంలో బడ్జెట్‌లో కేటాయించిన మొత్తంలో ఏడువేల కోట్లు ఖర్చుచేయలేదని చెప్పింది. అంటే రెవెన్యూ లోటు తగ్గిందని, తగ్గనున్నదని ఆర్థికమంత్రి చేస్తూ వచ్చిన ప్రకటనల్లో వాస్తవం లేదని తేలుతుంది. చూడగా చూడగా 50 సంవత్సరాల నాడే రు. 95 కోట్ల బడ్జెట్‌తోనే మనం సంతృప్తిగా బతికామేమో, ఇపుడు రు. 50 వేలకోట్లకు బడ్జెట్ పెరిగినా, దినదినగండంగా బతుకు వెళ్ళదీస్తున్నామేమోననిపిస్తుంది. ప్రజల్లో విశ్వాసం కలిగించే విధంగా నిధుల గురించిన ఒక చర్చా పత్రాన్ని విడుదల చేసి వారితో తన కష్ట సుఖాలను పంచుకోవాలి. 50 సంవత్సరాల్లో జరిగిందని చెబుతున్న అభివృద్ధి ఫలితాల్లో తమకూ వాటాలభిస్తుందనే భరోసా ముఖ్యమంత్రి కలిగించాలి.❑

# రాష్ట్ర వ్యవసాయ రంగం ఆరోహణ, అవరోహణల పర్వం

ప్రొఫెసర్ కె.ఆర్.చౌదరి

గత యాభై ఏళ్ళలో రాష్ట్రంలో అనేక మార్పులు వచ్చాయి. వ్యవసాయరంగంలోనూ వచ్చాయి. కొన్ని కొన్ని సంవత్సరాల్లో వచ్చిన మార్పులు వ్యవసాయ రంగాన్ని అభివృద్ధిపథం వైపు మళ్ళించాయి. మరికొన్ని సంవత్సరాల్లో వచ్చిన మార్పులు వ్యవసాయ రంగాన్ని అధోగతికి నెట్టేశాయి. ఏభై ఏళ్ళలో రాష్ట్ర వ్యవసాయరంగంలో కొంత మంచి ఉన్నది. కొంత చెడూ వున్నది. మంచి కంటే చెడే ఎక్కువుందని వ్యవసాయ రంగ పరిశీలనలు తెలుపుతున్నాయి. రాజ్యాంగం ప్రకారం వ్యవసాయం రాష్ట్రానికి సంబంధించిన అంశం అయినా కేంద్ర ప్రభుత్వ విధానాలు రాష్ట్రాల్లోని వ్యవసాయ రంగాన్ని అమితంగా ప్రభావితం చేస్తాయి. రాష్ట్ర విధానాలు మరింత తీవ్రంగా, ప్రత్యక్షంగా ప్రభావితం చేస్తాయి. ఏభై ఏళ్ళలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వ్యవసాయ రంగానికి చేయాల్సినంత అవసరమైన మేరకు చేయలేదనేది సుస్పష్టం. గ్రామీణ రంగంలో ముఖ్యంగా వ్యవసాయ రంగంలో సమూలమైన మార్పులు, మౌలికమైన మార్పులు తీసుకొని రావడానికి పాలకవర్గాలు పాటుపడలేదు. వ్యవసాయాభివృద్ధికి, ఈ రంగంపైన ఆధారపడి జీవిస్తున్న కోట్లాదిమంది రైతులు, వ్యవసాయ కూలీలు, వృత్తిదారులు, తదితర గ్రామీణ ప్రజల అభ్యుదయానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఒక సమగ్రమైన విధానం రూపొందించ లేకపోయాయి. సమగ్ర వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలను చేపట్టలేకపోయాయి. భూసంస్కరణలు ఉత్పాదకాలతో పాటు రుణసౌకర్యం, విద్య, వైద్య సదుపాయాల కల్పన తదితర విప్లవాత్మక విధానాలను అవలంబించి, ఆసియా ఖండంలోనే జపాన్, చైనా, వియత్నాం, కొరియా లాంటి దేశాలు వ్యవసాయ రంగంలో అద్భుత విజయాలను సాధించాయి. అలాంటి విధానాలు, కార్యక్రమాలను రూపొందించుకుని ఆచరణలో పెట్టలేనందువల్లనే మన వ్యవసాయం నత్తనడక నడుస్తోంది. ఒక అడుగు ముందుకు మరో అడుగు వెనుకకు నడుస్తుంది. వ్యవసాయ రంగానికి అగ్ర తాంబూలం ఇస్తున్నామని, పెద్ద పీట వేస్తున్నామని పాలకులు చెబుతూనే వాస్తవంలో ఈ రంగం పట్ల ఉదాసీనత, నిర్లక్ష్యం చూపిస్తున్నారనడంలో ఏమాత్రం సందేహం లేదు. పాలకుల ద్వంద్వ వైఖరికి, కపట నీతికి వారి విధానాలే నిలువుటద్దాలు.

ఈ యాభై ఏళ్ళలో ప్రభుత్వాలు వ్యవసాయరంగాభివృద్ధికి ఏమీ చేయలేదా? రాష్ట్రంలో అభివృద్ధి ఏమాత్రం జరగలేదా ? ప్రభుత్వాలు వ్యవసాయాభివృద్ధికి కొంతవరకు కృషి చేసిన మాట వాస్తవం. కానీ ఆ కృషి అరకొరగానే మిగిలిపోయింది. విధానాలు అస్తవ్యస్తంగావున్నాయి. రాష్ట్రంలో వ్యవసాయాభివృద్ధి జరిగింది. ముఖ్యంగా పైర్ల ఉత్పాదకత, ఉత్పత్తి గణనీయంగా పెరిగాయి. కానీ అవసరమైన మేరకు అవసరమైనంత వేగంగా పెరగలేదు. ఈ స్థితికి మూలమైన కారణాల విశ్లేషణ అవసరం.

గత ఏభై ఏళ్ళ కాలాన్ని వ్యవసాయాభివృద్ధి కి సంబంధించి ప్రధానంగా నాలుగు భాగాలుగా విభజించవచ్చును.

1. 1956 నుండి 1965 వరకు
2. 1966 నుండి 1980 వరకు
3. 1981 నుండి 1990 వరకు
4. 1991 నుండి 2005 వరకు

1956 - 1965 సంవత్సరాల మధ్య కాలంలో వ్యవసాయ రంగానికి కొన్ని సౌకర్యాలు కలిసివచ్చాయి. బ్రిటిష్ కాలంలో రైతుల కష్ట నిష్ఠూరాలను వ్యవసాయరంగంలో చోటు చేసుకున్న దుర్భర పరిస్థితులను ఆనాటి రైతు నాయకులు అనేక ఉద్యమాల ద్వారా ప్రభుత్వానికి గట్టిగా తెలియచెప్పినారు. తదనంతరం రాజకీయ పార్టీలు ముఖ్యంగా వామపక్షాలు భూ పంపకాల కోసం ఉద్యమించాయి. అందువల్ల ప్రభుత్వం బంజరు, శివాయిజమా భూములను కొంతవరకు పేద రైతాంగానికి పంచి పెట్టాయి. కానీ ప్రభుత్వ భూములు భూస్వాములు, పెద్ద రైతుల దురాక్రమణలోనే ఇప్పటికీ ఉన్నాయనే విమర్శలున్నాయి. ఏదేమైనప్పటికీ కొత్త భూములను సాగులోకి తీసుకురావడం జరిగింది. అట్లాగే భారీ నీటి ప్రాజెక్టుల వల్ల అప్పుడప్పుడే సాగునీటి సౌకర్యం కూడా కలిగింది. ఆహార సమస్య తీవ్రంగా ఉన్న కాలమది. అమెరికా నుండి దిగుమతయ్యే గోధుమలు, మొక్కజొన్నలపైన జనం ఆధారపడే దుస్థితి ఆనాడు ఉండేది. అందువల్ల ప్రభుత్వం ఆహారోత్పత్తిని పెంచే కార్యక్రమాలను చేపట్టింది. అందువల్ల వ్యవసాయోత్పత్తి పెరగడం సాధ్యమైంది. సాగులో వున్న భూమిలో 75శాతం మెట్ట సేద్యం క్రింద వుండేది. ఆహారధాన్యాలైన జొన్న, సజ్జ, కొర్ర, సామ, అరికలు, పెసలు, అలసందలు, మినుములు మొదలైన పంటలనే రైతులు పండించేవారు. ఆముదాలు, కుసుమలు, కొద్దిగా వేరుశనగ పండించేవారు. ఎకరా దిగుబడులు ఈ అన్ని పంటలలో కూడా చాలా తక్కువగా వుండేవి. సాగునీటి వసతి గల భూములలో ఉత్పాదకత కొద్దిగా ఎక్కువగా వుండేది. ప్రజలు ఆహార సమస్యలతో పాటు పేదరికంతో సతమతమవుతూ వుండేవారు. అయినప్పటికీ రైతులు తమ ఉత్పాదకాలు ముఖ్యంగా విత్తనాలు, ఎరువులు మొదలైనవాటిని తామే తయారు చేసుకొని ఉపయోగించుకునేవారు. వాటి కోసం మార్కెట్‌పై ఆధారపడేవారు కాదు. డబ్బు పెట్టి కొనేవారు కాదు. అందువల్ల ఉత్పత్తి ఖర్చులు తక్కువస్థాయిలోనే వుండేవి. లాభాలు ఎక్కువగా రాకపోయినా నష్టాలు అధికంగా ఉండేవి కావు. అందుచేత పంటలు నష్టపోయినా రైతులు మరీ కృంగిపోయేవారు కాదు.

1966-1980 మధ్య కాలంలో రాష్ట్రంలో వ్యవసాయాభివృద్ధి బాగానే జరిగింది. దేశంలో, రాష్ట్రంలో ఈ కాలంలో హరిత విప్లవం

వచ్చింది. అధిక దిగుబడులు ఇచ్చే నూతన వంగడాలు వచ్చాయి. పైర్లకు అవసరమైన రసాయనిక ఎరువులు, పోషక పదార్థాలు వచ్చాయి . రోగాలు, పురుగులను నివారించ డానికి మందులు, వ్యవసాయ పనిముట్లు, భారీ యంత్రాలు వచ్చాయి. భూగర్భ జలాలను వెలికితీసి వాడుకోవడానికి ఆయిల్ ఇంజన్లు వచ్చాయి. కరెంటు మోటర్లు వచ్చాయి. వీటన్నింటిని సమర్థవంతంగా సేకరించుకుని ఉపయోగించుకోవడానికి అవసరమైన పరపతి సౌకర్యాలు రైతులకు సంస్థాగత రుణాల ద్వారా కొంతవరకు లభించాయి. కానీ ఇవన్నీ కూడా ధనిక రైతాంగానికే అధికంగా దక్కాయి. చిన్న రైతులు దీనినుంచి లాభం పొందలేకపోయారు. మెట్ట ప్రాంతాలలోని రైతులు కూడా అభివృద్ధిని పొందలేకపోయారు. వ్యవసాయాభివృద్ధికి ముఖ్యంగా రుణ సౌకర్యాలు అవసరం. బ్యాంకుల జాతీయీకరణ ద్వారా ఇది కొంతవరకు తీరింది. రైతులు పండించే పంట తమ కుటుంబ వినియోగానికే కాక, మార్కెట్‌కు సరఫరా చేయడానికి కూడా కొంత మిగిలి ఉంటుంది. ఈ ఉత్పత్తులకు గిరాకీ కావాలి. అందువల్లనే ప్రాసెసింగ్ సౌకర్యాలు అభివృద్ధి అయ్యాయి. అప్పో సప్పో చేసి పెట్టిన ఉత్పత్తి ఖర్చులకూ, ఆరుగాలం కష్టపడి పని చేసిన శ్రమకూ, రైతుకు ప్రతిఫలం న్యాయంగా దక్కాలి. ఉత్పత్తులకు న్యాయమైన ధరలు కావాలి. వ్యవసాయ ధరల కమిషన్‌ను కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేసి, వ్యవసాయోత్పత్తులకు కనీస మద్దతు ధరలను ప్రకటిస్తున్నది. భారత ఆహార సంస్థ మొదలైన వాటి ద్వారా వ్యవసాయోత్పత్తులను కొంతమేర కొనుగోలు చేసి, వ్యాపారస్థులతో పోటీ పరిస్థితిని నెలకొల్పింది. అందువల్ల రైతాంగానికి ప్రోత్సాహకరమైన ధరలు లభించి, ఉత్పత్తిని పెంచడానికి దోహదకారి అయింది.

1981 నుండి 1990 మధ్యకాలంలో వ్యవసాయాభివృద్ధి రాష్ట్రంలో గణనీయంగా జరిగింది. ముఖ్యంగా సాగునీటి వసతి గల భూమిలో పెరుగుదల రేటు అధికంగా ఉంది. ఆహారధాన్యాల స్థానే వాణిజ్యపంటలు కూడా వచ్చాయి. వేరుశనగ, పత్తి, పొద్దు తిరుగుడు మొదలైన పంటల విస్తీర్ణం బాగా పెరిగింది. ఉత్పాదకత రేటు మొత్తం మీద పెరిగింది. సాగునీటి విస్తీర్ణం గణనీయంగా పెరిగింది. బావులు, బోరు బావుల సంఖ్య పెరిగింది. రుణ సౌకర్యాలు పెరిగాయి. సహకార పరపతి సంఘాలు, జిల్లా సహకార కేంద్ర బ్యాంకుల నుండి రైతాంగం రుణాలు పొందే సౌకర్యం పెరిగింది. ధరల పెరుగుదల వ్యవసాయాభివృద్ధికి దోహదం చేసింది. అయితే, ఈ కాలంలోనే కొన్ని అవాంఛనీయమైన దుష్పరిణామాలు వ్యవసాయరంగంలో చోటు చేసుకోవడం మొదలైంది. మేలైన మన సాంప్రదాయ వ్యవసాయ పద్ధతులు క్రమేణా మరుగున పడ్డాయి. ఉత్పాదకాలను రైతులు మార్కెట్లో కొనాల్సి వచ్చింది. రైతులు మార్కెట్‌పైనే ఆధారపడుతున్నారు. ఉత్పత్తి ఖర్చులు తడిసి మోపెడయ్యాయి. ఏక పంట విధానం అమల్లోకి వచ్చింది. ముతక ధాన్యాలు, పప్పు ధాన్యాలు సాగు అయ్యే విస్తీర్ణం తగ్గింది. ఆహారధాన్యాల విషయంలో, ముఖ్యంగా బియ్యం విషయంలో అభివృద్ధి బాగా జరిగింది. ఇతర రాష్ట్రాలకు కూడా బియ్యాన్ని ఎగుమతి చేసేవారు.

1991 నుండి వ్యవసాయరంగం తీవ్ర సంక్షోభానికి గురి అయింది. ప్రభుత్వం యొక్క నూతన ఆర్థిక విధానాలైన, ప్రైవేటీకరణ, సరళీకరణ, ప్రపంచీకరణ దీనికి ముఖ్యంగా కారణాలు. రైతులు ఉత్పత్తి కార్యక్రమంలోనే కాదు, మార్కెటింగ్ తదితర కార్యక్రమాల్లో కూడా అనేక కష్ట నిష్టూరాల పాలయ్యారు. ప్రభుత్వం వ్యవసాయరంగానికి నిధులు కేటాయించడం లేదు. పెట్టుబడులు తగ్గాయి. మూల ఆస్తులు పెరగడం లేదు. రైతాంగానికి అందించాల్సిన ఉత్పాదకాల సరఫరాలో ప్రభుత్వ వాటా అతి స్వల్పం. వీటికోసం ప్రైవేట్ వ్యాపారస్తులు, కార్పొరేట్ రంగంపై ఆధారపడి, వారి దోపిడీకి గురి అవుతున్నారు. కల్తీ, నకిలీ విత్తనాలు, రసాయనాలు రైతులను నిలువునా ముంచాయి. రాయితీలు తగ్గినందువల్ల ఉత్పత్తి ఖర్చులు పెరిగాయి. వ్యవసాయ మార్కెటింగ్‌లో దోపిడీ జరుగుతోంది. క్రమబద్ధ మార్కెట్లను బలోపేతం చేసి, అక్కడున్న లొసుగుల్ని కూడా తొలగించి, రైతాంగానికి మేలు చేకూర్చే బదులు ప్రైవేట్ మార్కెట్లకు అంకురార్పణ జరుగుతోంది. వ్యవసాయోత్పత్తుల ధరలు రైతాంగానికి ఏమాత్రం అనుకూలంగా లేవు. న్యాయంగానూ లేవు. రాష్ట్రంలో సంస్థాగత రుణాలు అందక, రైతులు ప్రైవేట్ వడ్డీ వ్యాపారులు, దుకాణదారుల దోపిడీకి గురి అయి నానా అగచాట్లు పడుతున్నారు. అప్పుల బాధలు పడలేక, వ్యవసాయం గిట్టుబాటు కాక బలవన్మరణాలకు పాల్పడ్డారు. ఇంకా ఆత్మహత్యల పరంపర కొనసాగుతూనే వుంది. గత సంవత్సరం తప్ప, ఆరేడేళ్ళుగా రాష్ట్రంలో వర్షాభావ పరిస్థితులు నెలకొని, కరువు తీవ్రంగా వుండేది. ఉత్పత్తి పెరుగుదల రేటు, ఉత్పాదకత పెరుగుదల రేటు గణనీయంగా పడిపోయాయి. అన్ని వర్గాల రైతులు సంక్షోభంలో ఉన్నారు. ముఖ్యంగా చిన్న రైతుల పరిస్థితి కడు దీనంగా వుంది. గోరుచుట్టుపై రోకటి పోటు అన్నట్లు, వ్యవసాయోత్పత్తుల దిగుమతుల ప్రవాహం మన రైతాంగాన్ని అధోగతికి నెట్టివేస్తోంది. వ్యవసాయంపైన ఆధారపడి జీవిస్తున్నవారి బతుకులు దుర్భరమయ్యాయి.

యాభై సంవత్సరాల అనుభవం చెప్పేదేమంటే ప్రభుత్వ విధానాలు వ్యవసాయాభివృద్ధికి అనుకున్నంతగా దోహదం చేయలేదని. సమూలమైన, సమగ్రమైన మార్పులు రానిదే ఇది జరుగదు. వ్యవసాయాభివృద్ధికి భూమి కీలకమని పాలకులకు బుద్ధి చెప్పాలి. ప్రభుత్వ భూములు పంచాలని ఒత్తిడి తేవాలి. గరిష్ట పరిమితి చట్టాలను మార్పు చేసి, పేద రైతాంగానికి మిగులు భూములను పంచాలి. సాగునీటి సరఫరాలో ప్రాంతీయ దురభిమానాలు, అసమానతలు పెరిగిపోయాయి. క్షామపీడిత ప్రాంతాలకు, వెనుకబడిన ప్రాంతాలకు కాలువల ద్వారా ఎత్తిపోతల ద్వారా నీరు అందించాలి. పాలకవర్గాల చేతిలో చిక్కి శల్యమైన సహకార పరపతి సంఘాలకు జీవం పోసి, రైతాంగానికి రుణసదుపాయం కల్పించాలి. ప్రభుత్వ పెట్టుబడులు, నిధుల కేటాయింపు ఈ రంగానికి పెంచాలి. వ్యవసాయం అంటే కేవలం పంటలే కాదు, నిర్లక్ష్యం చేయబడిన పశుపోషణకు అన్ని విధాలా ప్రోత్సాహమివ్వాలి. చిన్న రైతులకు ప్రత్యేక ప్యాకేజీలు అవసరం. వ్యవసాయ పద్ధతుల్లో సేంద్రియ పద్ధతులకు ప్రాముఖ్యత నివ్వాలి. ప్రపంచీకరణ కబంధ హస్తాల్లోకి పోకుండా నివారించుకోగలగాలి. ఏభై ఏళ్ళ వ్యవసాయ చరిత్రలో చీకటి కోణాలే ఎక్కువ. ఈ చీకటి నుండి సూర్యకిరణాలు ప్రభవించాలని ఆశిద్దాం. ❑

# నిర్దిష్ట ప్రణాళికలతోనే నీటిప్రాజెక్టులు సాధ్యం!

విద్యాభూషణ్

వ్యవసాయ రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్‌లో నీటి ప్రాజెక్టుల నిర్మాణానికి ప్రాముఖ్యతనివ్వడం అవసరమే కాదు అత్యంత సహజం కూడా! పాలకులు ప్రధానంగా వ్యవసాయ కుటుంబాల నుంచే వచ్చినవారు కావడంతో భూమికీ వారికీ వున్న పేగు సంబంధం ఈ ప్రాధాన్యతకు పాదుపోసింది. ఇందుకు గత ప్రణాళికల్లో ఈ శాఖ మీద చేసిన కేటాయింపులే సాక్ష్యం! ప్రతీ ప్రణాళికలో మూడో వంతు నుంచి నాలుగోవంతు వరకూ కేవలం నీటిపారుదలకే కేటాయిస్తూ వచ్చారు. అయినా ఈ భూదాహం తీరడం లేదు. కేటాయింపులు ఘనంగా చేసినంత మాత్రాన నీటి లభ్యత పెరగదు. దీనికి ప్రాజెక్టుల నిర్మాణ ఖర్చులు పెరగడం, రాజకీయ ఒత్తిడులకు తలవొగ్గి శక్తికి మించిన ప్రాజెక్టులను అనుమతినస్తూ, ఉన్న పరిమిత వనరులను తలాకాస్తా కేటాయించడంతో ప్రాజెక్టులు పూర్తి కావడానికి దశాబ్దాల కాలం పట్టడం, ఈలోగా ఖర్చు అంచనాలు పెరిగి ఏ ఒక్క ప్రాజెక్టూ నకాలంలో పూర్తి కాకపోవడానికి కారణాలని చెప్పుకోవచ్చు. ఉదాహరణకు 1955లో నాటి ప్రధాని శంకుస్థాపన చేసిన నాగార్జున సాగర్ నేటికీ 'నేనూ' వున్నానని అంటోంది. 1960లో సవరించిన ఈ ప్రాజెక్టు అంచనా రెండు దశలకు 40 కోట్ల రూపాయలే, ఇప్పటికే ఆ ప్రాజెక్టు మీద మన పాలకులు వెచ్చించింది సుమారుగా రూ. 900 కోట్లు.

పైన పేర్కొన్న కారణాలన్నింటికన్నా, నీటిపారుదల గురించి ఒక విధానపత్రం లేకపోవడం ప్రధాన కారణమనిపిస్తుంది. అధికారంలోకి వచ్చిన ప్రభుత్వాలు లోటుపాట్ల లోతుల్లోకి పోకుండా, 'నీరు-మీరు' 'ఇంకుడు గుంతలు' లాంటి ప్రచార ప్రాధాన్యత గల పథకాలకు ప్రాధాన్యతను ఇచ్చిన వారు ఒకరైతే, తరువాత అధికారంలోకి వచ్చిన ప్రభుత్వం ఒక్కసారిగా 26 ప్రాజెక్టులను, సుమారు 46వేల కోట్ల భారీవ్యయంతో నిర్మించనున్నట్లు ప్రకటించడం గమనార్హం. ప్రకటించిన ప్రాజెక్టుల నిర్మాణాన్ని ఒక విధానంలో భాగంగా నిర్మించబోవడం లేదు. ప్రాంతీయ అవసరాలు, రాజకీయ ఒత్తిడులు, ప్రాంతీయ అసమానతల తగ్గింపులాంటి లక్ష్యాలతో నిర్మాణం చేపట్టదలిచారు. ఇంతవరకూ ఉనికిలో వున్న ప్రాజెక్టుల నిర్మాణాలను సమీక్షించుకొని, నూతన ప్రాజెక్టుల నిర్మాణానికి ఒక నమూనాను తయారుచేసుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది.

### ప్రణాళికల్లో కేటాయింపులు :

నీటి పారుదలకు గత ప్రణాళికల్లో పెద్ద పీటే వేసారని చెప్పుకున్నాం. ఖర్చు శాతాలు ఇలా వున్నాయి.

మొత్తం ప్రణాళికా ఖర్చులో నీటిపారుదల ఖర్చు శాతం

| | |
|---|---|
| 1వ ప్రణాళిక | 22.58 |
| 2వ ప్రణాళిక | 34.75 |
| 3వ ప్రణాళిక | 35.32 |
| 4వ ప్రణాళిక | 22.82 |
| 5వ ప్రణాళిక | 31.58 |
| 6వ ప్రణాళిక | 26.80 |
| 7వ ప్రణాళిక | 24.23 |
| 8వ ప్రణాళిక | 18.44 |
| 9వ ప్రణాళిక | 18.84 |

ప్రారంభంలో సాగిన 'ప్రాధాన్యత' క్రమానుగతంగా తగ్గిపోవడం గమనించవచ్చు. తెలుగుదేశం పాలించిన ఏడో ప్రణాళిక కాలం నుంచి తొమ్మిదో ప్రణాళికా కాలం వరకూ నీటిపారుదల పద్దు కింద వ్యయం ఎలా తగ్గిపోయిందో తెలుస్తుంది. తిరిగి కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి రావడంతోనే '04-05 లో ఈ పద్దు కింద కేటాయింపు 31.76 శాతానికి పెరిగింది. బహుశా ఈ మొత్తం అంతా ఖర్చు కాకపోవచ్చు. కానీ కోల్పోయిన ప్రాధాన్యతను తిరిగి తీసుకొచ్చే ప్రయత్నం మాత్రం జరిగింది.

### సాగునీరు - తాగునీటి కోసం పాలకుల ప్రాధాన్యత :

రాష్ట్రంలో నీటి పారుదల సౌకర్యాలు 10వ శతాబ్దినుంచే మొదలయ్యాయని తెలుస్తుంది. కాకతీయ, విజయనగర రాజులు, కుతుబ్‌షాహి వంశీయులు ఈ నీటిపారుదల వసతికి పెద్దపీట వేశారు. తెలంగాణా ప్రాంతంలో 13వ శతాబ్ది నాటికే కాకతీయ రాజులు పాకాల, రామప్ప, లఖ్నవరం, శనిగరం, ఘనపురం మొదలైన చోట్ల చెరువులని నిర్మించారు. అయితే 16వ శతాబ్ది నాటికి విజయనగర రాజులు మాత్రం తుంగభద్రా నదిపై చిన్న చిన్న ఆనకట్టలు నిర్మించారనేందుకు ఆధారాలు వున్నాయి. మళ్ళీ రాయలసీమ ప్రాంతానికి వచ్చేసరికి చెరువుల నిర్మాణానికే ప్రాధాన్యత ఇచ్చారు. ఒక కర్నూలు జిల్లాలోనే 400 చెరువులు తవ్వించారు. ఇదీ విజయనగర రాజుల కాలంలోనే ప్రసిద్ధి పొందిన కంభం, కనిగిరి, బుక్కరాయ సముద్రం వంటి చెరువులు ఉనికిలోకి వచ్చినట్లు చరిత్ర చెపుతోంది.

ఇదేకాలంలో కుతుబ్‌షాహి వంశస్థుడైన ఇబ్రహీం కుతుబ్-షా హైదరాబాద్-సికింద్రాబాద్‌ల మధ్య హుస్సేన్‌సాగర్‌ను నిర్మించారు. 1530-1580 మధ్యకాలంలో ఇబ్రహీంపట్నం చెరువును నిర్మించింది ఈయనే. తదనంతరం నిజాం పాలనాకాలంలో నవాజ్‌జంగ్ వంటి ఇంజనీర్ల కృషితో హిమాయత్‌సాగర్, ఉస్మాన్‌సాగర్, పోచారం సరస్సు, నిజాంసాగర్, డిండి, పాలేరు,

వైరా మొదలైన ప్రాజెక్టులు నిర్మించబడ్డాయి. తదనంతరం 1765లో ఈస్టిండియా కంపెనీ పాలన మొదలైన నాటినుంచి నీటిపారుదల సౌకర్యాలు నిర్లక్ష్యానికి గురైనాయి సుమారు 80 ఏళ్ళ పాటు సాగిన ఈ నిర్లక్ష్యం ఫలితంగా కోస్తా - ఆంధ్రా ప్రాంతంలో సేద్యం దెబ్బతింది. ఇదేకాలంలో భయంకరమైన కరువు-కాటకాలు చోటు చేసుకున్నాయి. సుమారుగా 1800 సంవత్సరం నాటికి ఈస్టిండియా కంపెనీ రాయలసీమ లోకి అడుగిడిననాటి నుంచి ఇక్కడి పరిస్థితుల్లో మార్పు వచ్చింది. సుభిక్ష పరిస్థితులు, సంక్షోభ పరిస్థితులుగా మారాయి. కరువు-కాటకాలు విస్తరించిన కారణంగా రాష్ట్రమంతటా ఆర్థిక సంక్షోభం మొదలైంది. వలసపాలకులు ఈ పరిస్థితులను తమకు లాభసాటిగా మార్చుకోవాలన్న యోచనకు వచ్చి ప్రత్యామ్నాయ మార్గాలను శోధించారు.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణానికి ఇచ్చిన ప్రాధాన్యత, చేసిన కేటాయింపులు-ఖర్చులు పైనే వివరించడం జరిగింది. ఈక్రమంలోనే ఇంజనీరింగు పరిపాలనా రంగాలూ విస్తరించబడ్డాయి.

### నీటిపారుదల మెరుగుదలకై నిర్దేశించిన ఉపాంగాలు :

1. రాష్ట్ర నీటిపారుదల అభివృద్ధి కార్పొరేషన్ : 1974లో ఎత్తిపోతల పథకాలు, గొట్టపుబావులు, ఇన్‌ఫిల్ట్రేషన్ బావుల నిర్మాణం, పథకాల దర్యాప్తు అమలు లక్ష్యాలతో ప్రారంభించారు. 80వేల కోట్ల మూలధనంతో ఏర్పాటుకు సంకల్పించినా మూలధన కేటాయింపులు సక్రమంగా జరగనేలేదు.

2. భూగర్భ జలాల శాఖ : నీటిపారుదల అభివృద్ధి కార్పొరేషన్, సమీకృత ఆదివాసి అభివృద్ధి ఏజెన్సీ (ఐటిడిఏ), షెడ్యూలు కులాలు, వెనుకబడిన తరగతుల కార్పొరేషన్‌లను పర్యవేక్షిస్తూ, చిన్న సన్న కారు రైతాంగానికి సహాయపడేందుకు, విస్తరణ సేవలను అందించేందుకు ఈ శాఖను ఏర్పాటు చేయడమైంది. సంస్థాగత ఆర్థిక సహకారంతో భూగర్భజలాల మదింపు, చిన్న తరహా సాగునీటి కార్యక్రమాల అమలుకు సాంకేతిక సహాయం అందించే లక్ష్యంతో ఈ శాఖ పని చేస్తుంది.

3. పంచాయతీరాజ్ శాఖ : సుమారు 70,074 సాగునీటి వనరులు ఈ శాఖ ఆధ్వర్యంలో వున్నాయి. వీటిద్వారా 6.03 లక్షల హెక్టార్ల ఆయకట్టు సాగవుతుంది. వరదతాకిడి సందర్భంగా చెరువుల గండ్లు పూడ్చివేత, ప్రత్యేక మరమ్మత్తులను చేపట్టే లక్ష్యంతో ఈ శాఖను ప్రారంభించారు. అయతే అరకొర నిధులతో నిర్దేశిత లక్ష్యాలను సాధించలేని పరిస్థితి.

4. తుఫాను అత్యవసర పునర్నిర్మాణ ప్రాజెక్టు : 1990 మేలో భారీ వర్షాల సందర్భంగా నష్టపోయిన నీటిపారుదల వనరుల పునరుద్ధరణకై ప్రపంచబ్యాంకు సహాయంతో ప్రారంభించారు. అత్యవసర పునర్నిర్మాణ పనులు చేపట్టేందుకు 42 కోట్ల రూపాయల నిధులు ప్రతిపాదించినా కేవలం పదికోట్లనే కేటాయించారు.

5 మురుగునీటి కాల్వల పథకం : కృష్ణా, గోదావరి, నెల్లూరు జిల్లాల్లో మురుగునీటి కాల్వల సక్రమ నిర్వహణకై ఈ పథకాన్ని నిర్దేశించారు. ఈ మూడు డెల్టా జిల్లాల్లో మొత్తం మురుగు కాల్వల పొడవు 10,123 కి.మీ. ప్రపంచ బ్యాంకు సహాయంతో ఈ పనులు చేపట్టాలని సంకల్పం. డ్రైనేజీ సెస్సు వసూళ్ళకై రెండు చట్టాలను (1985, 1986 సంవత్సరాల్లో) రూపొందించడమూ జరిగింది.

6. ఆయకట్టు అభివృద్ధి సంస్థ : సేద్యపు భూముల అభివృద్ధికి సంబంధించిన పనులను ఈ సంస్థకు అప్పగించారు. ప్రధానంగా ఆయకట్టు ప్రాంత సవివర సర్వే, ప్రణాళికా రచన, భూసారసర్వే నిర్వహణ, కాలువల నిర్వహణ, భూముల అభివృద్ధి పనుల పర్యవేక్షణ ఈ సంస్థ లక్ష్యాలు.

### కృష్ణా గోదావరి వివాదం - బచావత్ ట్రిబ్యునల్ :

కృష్ణాగోదావరి నదీజలాల పంపిణీ విషయమై 1960లో మహారాష్ట్ర, ఒరిస్సా, కర్నాటక ప్రభుత్వాలు ఈ వివాదాన్ని లేవదీశాయి. 1951 నాటి ఒప్పందం మేరకు 25 సం౹౹ల పాటు ఇది అమలులో వుండాల్సి వుంది. కానీ 1953-56 ల మధ్య రాష్ట్రాల పునర్విభజనతో ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్ ఉనికిలోకి రావడంతో నాటి ఒప్పందాన్ని సర్దుబాటు చేయాల్సి వచ్చింది. 1961లో ప్రతిపాదించిన సూచనలు తిరస్కరించబడ్డాయి. 1963 మార్చి 23న కేంద్రం ఓ తాత్కాలిక ఒప్పందాన్ని ప్రతిపాదించింది. ఈ అవార్డు మేరకు కృష్ణా జలాలలో ఆంధ్రప్రదేశ్‌కు 800 టిఎంసిలు, కర్నాటకకు 600 టిఎంసిలు, మహారాష్ట్రకు 400 టిఎంసిలు కేటాయించారు. అయినా వివాదాన్ని మిగతా రాష్ట్రాలు కొనసాగించడంతో 1969 ఏప్రిల్ 10న బచావత్ ట్రిబ్యునల్‌ను ఏర్పాటుచేయడం జరిగింది. దీని తుది తీర్పు ప్రకారం కర్నాటక 700 టిఎంసిలు, మహారాష్ట్ర 600 టిఎంసిలు, ఆంధ్రప్రదేశ్ 800 టిఎంసిలు వాడుకోవడానికి హక్కు ఉంది. ఈ వాటాలపైన అదనపు జలాలు ఉంటే వాడుకోవడానికి ఆంధ్రప్రదేశ్‌కు హక్కు ఉంది. ఈ ఉత్తర్వులను 2000 మే 31 తర్వాత ఎప్పుడైనా పున:పరిశీలించవచ్చునని ట్రిబ్యునల్ సూచించింది. తదుపరి కర్నాటక తమ ప్రాజెక్టు ఎత్తును పెంచి వేయడంతో ఆంధ్రప్రదేశ్, కర్నాటకల మధ్య నీటి వివాదం మళ్ళీ మొదటికి వచ్చింది.

### గోదావరీ నదీజలాలపై ట్రిబ్యునల్ అవార్డు :

ఈ వివాదం కూడా రాష్ట్రాల పునర్విభజనతోనే మొదలైంది. తే 19.12.1975, 7.8.1978 తేదీలలో అంతర్రాష్ట్ర ఒప్పందం ప్రకారం 'ఇచ్చంపల్లి ప్రాజెక్టు'ను ఉమ్మడి ప్రాజెక్టుగా చేపట్టాలని సంకల్పించడం జరిగింది. ఇందుకోసం ఓ సంయుక్త నియంత్రణా మండలిని ఏర్పాటు చేయాల్సి వున్నా, ఇంతవరకూ ఏర్పడనేలేదు. ఈ మండలి ప్రాజెక్టు సర్వేను చేపట్టి అమలు పరచాల్సి వుంది.

### గోదావరీ జలాల వివాదం :

ఇందుకు ఏర్పాటు చేసిన ట్రిబ్యునల్ 1980న తుది నివేదిక ఇచ్చింది. ఈ తీర్పు ప్రకారం ఆంధ్రప్రదేశ్ సుమారు 1495 టిఎంసిల నీటిని వినియోగించు కోవచ్చు. దిగువన వున్న పెనుగంగ, లెండి ప్రాజెక్టులు ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర ఉమ్మడి ప్రాజెక్టులుగానూ, ప్రాణహితను మాత్రం ఆంధ్రప్రదేశ్ ఒక్కటే చేపట్టాల్సి వుంది.

వనరుల విషయానికొస్తే నాగార్జునసాగర్ కొనసాగుతూనే వుంది. 1956లో తుంగభద్ర ప్రారంభమైంది. ఆంధ్రా, కర్నాటక రాష్ట్రాల సంయుక్త నిర్వహణలో ఈ ప్రాజెక్టు రెండో దశ ద్వారా

అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలలోని 86,617 హెక్టార్ల విస్తీర్ణానికి సాగునీటి సదుపాయం కలగనుంది. సోమశిల ప్రాజెక్టు నెల్లూరు జిల్లాలో 56295 వేల హెక్టార్లకు సాగునీటి వసతి కల్పించనుంది. ఇదీ నిర్మాణంలోనే వుంది.

ఏలేరు రిజర్వాయర్ ప్రాజెక్టు 335కోట్ల రూ.ల అంచనాతో మొదటి దశ పూర్తయింది. తద్వారా 44,200 హెక్టార్ల ఆయకట్టు స్థిరీకరించాల్సి వుంది. పోలవరం ప్రాజెక్టు 2.9 లక్ష హెక్టార్లకు నీటి వసతి లక్ష్యం సవరించిన వ్యయ అంచనా 3030 కోట్లు. ఇక శ్రీశైలం ప్రాజెక్టు , తెలుగుగంగ, సింగూరు ప్రాజెక్టు, ప్రియదర్శిని, జూరాల ప్రాజెక్టు, నిజాంసాగర్, గన్నవరం అక్విడక్ట్, సుంకేసుల బ్యారేజీ, పులిచింతల, అలగనూరు బ్యాలెన్సింగ్ రిజర్వాయరు, గాలేరు-నగరి కాలువ ప్రాజెక్టు, భీమా - ఎత్తిపోతల ప్రాజెక్టు, హంద్రీనీవా సుజల స్రవంతి పథకాలు వివిధ దశల్లో వున్నాయి.

అయితే ఇన్ని వనరులు అందుబాటులో వున్నా క్రమబద్ధమైన నిర్వహణా సామర్థ్యం కొరవడినందున ఎక్కడ వేసిన గొంగళి అక్కడనే అన్నట్టుంది వీటి పరిస్థితి. ఆర్థిక పురోభివృద్ధికి వ్యవసాయరంగం అత్యంత కీలకమైంది. ఇందుకు నీటిపారుదల వసతిని మెరుగుపర్చడం ద్వారా రెండింతల ద్రవ్య ఫలితాలను సాధించవచ్చు. నీటిపారుదల మెరుగుదలతో ఫలసాయాన్ని 50-60 శాతం అధికం చేయొచ్చన్నది పలు పరిశోధనల సారాంశం.

**నీటి యాజమాన్యంలో మెళకువలు :**

నీటి లభ్యత క్రమానుగతంగా తగ్గిపోతూ వున్నందున నీటిని వృధా చేయకుండా సద్వినియోగం చేసుకోవాల్సివుంది. వాషింగ్టన్‌లో వున్న ఓ స్వచ్ఛంద సంస్థ అధ్యయనం మేరకు దేశంలో తలసరి నీటిలభ్యత 1955లో 5277 క్యూమ్స్ వుండగా అది 1991 నాటికి 2554 క్యూమ్స్ మేరకు పడిపోయింది. ప్రాణాధారిత నీటి లభ్యత ఈ క్రమంగా తగ్గిపోతున్న దశలో నీటిని అతిభద్రంగా వినియోగించుకోవాల్సి వుంది. విస్తారంగా నీటివనరులు వున్న మన రాష్ట్రంలోనే సాగునీటి కొనవే కాదు, తాగునీటి కొనమూ అలముటించాల్సిన పరిస్థితులు నెలకొనడం అవాంఛనీయం. చెరువుల క్రింద సేద్యపు పరిస్థితులు భారీ ప్రాజెక్టుల దిశగా మళ్ళడం, నీటివసతి చిన్న సన్నకారు రైతుల స్థానే భూస్వామ్య వర్గాలకే పరిమితం కావడం వంటి పరిణామాలతో వ్యవసాయరంగం వెనుకబడిందనడం నిస్సందేహం. ఈ కారణంగానే స్వాతంత్ర్యానికి ముందు బ్రిటిష్ వారి పాలనాకాలంలోనే అధికశాతం నీటిపారుదల వసతిని పొందగలిగారన్నది ఓ చారిత్రక సత్యం. నీటివసతి కల్పించాలని బడుగు వర్గాలు ఆందోళనలను సైతం చేపట్టాల్సి వచ్చింది, వస్తుంది. సాగునీటి వసతికై కేటాయించిన బడ్జెట్ మొత్తాలు పారిశ్రామికరంగాల నీటి సరఫరాకు, విద్యుత్ ఉత్పాదనలకు మళ్ళించడంతో ప్రాధాన్యత కొరవడుతున్న వాస్తవం మన ముందుంది. అనూహ్యంగా పెరుగుతున్న ధరల కారణంగా, మొదటిపంచవర్ష ప్రణాళికా కాలంలో హెక్టారు భూవసతికి సాగునీరు అందించేందుకు 1,060 రూపాయలు వ్యయం కాగా, 1980-81 నాటికి 14,950 రూపాయలకు 1985-86 నాటికి 39,766 రూపాయలకు, 7వ ప్రణాళికా కాలంనాటికి 50వేల రూపాయలకు పెరిగింది. రైతుల నుంచి ప్రభుత్వం వసూలు చేస్తున్న నీటి తీరువా పన్ను ప్రాజెక్టుల నిర్వహణకే చాలడం లేదు. ఈ అనుభవ నేపథ్యంలో భారీ రుణాలతో ప్రాజెక్టులను చేపట్టిన పక్షంలో వాటిని తిరిగి వసూలు చేసుకొనేదెలా? నీటితీరువా పెంపు కూడదని మరో ఆత్మహత్యా ఆందోళన ప్రారంభమైతే అయినవారికి, కానివారికి ఈ ప్రాజెక్టుల భారం వరించనుందా? ప్రాజెక్టుల తప్పుడు రూపకల్పనలు, వాసి తగ్గిన యాజమాన్య ధోరణులు, నీటి దుర్వినియోగానికి ప్రధాన హేతువులవుతున్నాయి. మన దేశంలో విడుదలైన నీటిలో సుమారుగా 55శాతం మాత్రమే పొలాలకు చేరుతుంది. పైగా అవసరమైన పరిమాణం కన్నా అధికంగా నీటిని రైతులు వినియోగిస్తున్నారన్న వాదన సైతం వినబడుతుంది. పొలంలో ఎక్కువ నీరున్న మాత్రాన ఎక్కువ దిగుబడి సాధ్యమవుతుందన్న అమాయకపు ఆలోచన మన రైతులలో వుండి వుండవచ్చు. వీరిని నీటి వినిమయంలో చైతన్యవంతులను చేయాలి.

పిల్ల కాల్వలకు అనువుగా పిల్లకాలువల ఏర్పాటును చేపట్టాలి. వరద నివారణ, డ్రైనేజీ సమస్యలను పరిగణనలోకి తీసుకోవాలి. వర్షపు నీటి నిల్వలకై చెరువుల మరమ్మత్తులను చేపట్టి వినియోగంలోకి తీసుకురావాలి.

భారీ ప్రాజెక్టులతో పాటు చిన్న తరహా నీటి వసతి ఏర్పాటును చేపట్టాలి. లేకుంటే వాగులు, వంకలలోని నీరు వృధా అయ్యే ప్రమాదం వుంది. చెరువులను వినియోగంలోకి తీసుకువచ్చి, చెరువుల క్రింది ఆయకట్టుదారుల సంఘాలను ఏర్పాటు చేయాలి. కాలువల నిర్మాణంలో నాణ్యత లోపించినట్లయితే 15 - 20% నీరు వృధా అవుతుంది. పొలాలకు వెళ్ళే పిల్ల కాలువలు సక్రమంగా లేని కారణంగా 20-22 శాతం నీరు వృధా అయ్యే ప్రమాదముందని ఓ అంతర్జాతీయ అధ్యయన కేంద్ర వివరణ. ప్రాజెక్టుల అంచనా వ్యయాలు పరిపుష్టంగా లేకుంటే కేంద్ర ప్రభుత్వ గ్రాంటులు పలుచనయ్యే ప్రమాదముంది. ఇన్ని విషయాలను సమగ్రంగా అధ్యయనం చేసిన తర్వాత ప్రాజెక్టుల నిర్మాణంలో తలెత్తే తదుపరి సమస్య పునరావాస కల్పన. ప్రాజెక్టుల నిర్మాణం చేపట్టేకంటే ఇందుకోసం తమ సర్వస్వాన్ని ధారపోసే ఆయా ప్రాంత ప్రజల / నిర్వాసితులకు జీవన భద్రతను పాలకులు అందివ్వాలి.

గ్రామాలకు గ్రామాలు ఖాళీ చేసిన పక్షంలో ఆయా నిర్వాసితులందరకూ ఒకేచోట పునరావాసం కల్పించాలి. జీవనానికి అనువైన సకల ఏర్పాట్లనూ చేపట్టాల్సి వుంది. వారు కోల్పోయిన భూములకు వెల నిర్ణయించేకంటే అదే విస్తీర్ణంలో భూములను నిర్మిత ప్రాజెక్టు ఆయకట్టులోనే కేటాయించాలి. లేకుంటే ఇవ్వాళ నిర్వాసిత భూమి విలువ 7 లక్షలయింది.... రేపు పది లక్షలు కావచ్చు. ఆ దిశగా మరో నేత ఆందోళనకు ఉపక్రమించవచ్చు. ఈ పునరావాస కల్పనకై ఇదమిద్ధమైన ప్రణాళికను ప్రాజెక్టు నిర్మాణ ప్రణాళికతో పాటే రూపొందించుకోవాల్సి వుంటుంది. అప్పై ప్రాజెక్టు నిర్మాణ ప్రయోజనాలతో ప్రజలకు చేరువై వారి మద్దతును పొందే వెసులుబాటు వుంటుంది. లేకుంటే ఆందోళనలు కోర్టుల ప్రమేయంతో దినదినగండంగా మారే ప్రమాదం పొంచి వుంటుంది మరి! ❑

# ఆంధ్రప్రదేశ్ అర్ధ శతాబ్దం

ఎమ్. సి. స్వామినాథన్

భాషా ప్రాతిపదిక రాష్ట్రాల ఉద్యమం తెలుగు వారితో ప్రారంభమయింది. ఏక భాషా రాష్ట్రాలు భావైక్యత కు, సత్వరాభివృద్ధికి, ప్రజాస్వామ్యాన్ని బలపరచడానికి తోడ్పడతాయనే నమ్మకం ఈ ఉద్యమానికి ఊపిరి పోసింది. యాభై ఏళ్ళు నిండిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఈ నమ్మకాలను ఎంతవరకు నిజం చేసిందని లెక్కకట్టడానికి ఇదిమంచి సమయం. అర్థ శతాబ్దంలో సాధించదగిన ప్రగతిని సాధించిందా, ప్రగతి ఫలాలను పదిమందికి పంచ గలిగిందా, చిన్న చితక ఎంత వరకు తమ మాటను వినిపించ గలుగుతున్నారు, విభేదాలతో నిండిన అనేక రకాల దాయాది వర్గాలను (ఆడ-మగ, గ్రామీణులు-నగరవాసులు, కలవారు-లేనివారు, గొప్ప-నాసి కులాలు, ఇక్కడివారు-అక్కడివారు) ఈ భాషారాష్ట్రం ఎంతవరకు దగ్గిర తెచ్చింది, అన్న ప్రశ్నలను ఖచ్చితంగా, నికరంగా బేరీజు వేసుకొంటేనే ఇకపై దారి స్పష్టంగా కనిపిస్తుంది.

అర్థశతాబ్ద కాలంలో మన రాష్ట్రం బాగా అభివృద్ధి చెందింది. వ్యవసాయ ప్రధాన రాష్ట్రం గనుక నీటి పారుదలకు ఎక్కువ వనరులు అమర్చి పెక్కు పెద్ద చిన్న ప్రాజెక్టులను కట్టింది, ఇంకా కట్టిస్తున్నది. నీటి పారుదల సౌకర్యం గల నికరవిస్తీర్ణం ఇరవైఏడున్నర లక్షల హెక్టార్ల నుండి నలభైఐదుంబావు లక్షల హెక్టార్లకు (1956-57, 2000-01 సంవత్సరాల మధ్య) పెరిగింది. విద్యుదుత్పత్తి సామర్థ్యం కేవలం నలభైమూడు మెగావాట్ల నుండి పది వేల తొమ్మిది వందల మెగావాట్లకు చేరింది. గ్రామ, నగర విద్యుదీకరణ శాతం రెండు నుండి నూటికినూరైంది. తలసరి విద్యుత్‌వినియోగం రెండున్నర యూనిట్ల నుండి ఐదు వందల అరవైకి ఎదిగింది. మాగాణి మెట్టపంటల దిగుబడి (1957-58, 2003-04 సంవత్సరాలతో అంతమయ్యే త్రైవార్షికాల మధ్య) గణనీయంగా పెరిగింది - బియ్యం దిగుబడి (హెక్టారుకు కేజీలలో) 1160 నుండి 2862 కు పెరగగా జొన్న 461 నుండి 1037 కు పెరిగింది. పంటల దిగుబడి సాలీనా 2.5 శాతం చొప్పున పెరిగింది. ఆహార ధాన్యాల ఉత్పత్తి దాదాపు మూడింతలయింది - యాభైఎనిమిది లక్షల టన్నుల నుండి నూటనలభై తొమ్మిది లక్షల టన్నులకు చేరింది. ఈ కాలవ్యవధిలో రాష్ట్ర సాలుసరి ఉత్పత్తి రంగాల్లో (వ్యవసాయం తదనుబంధ రంగాలు, ఖనిజాలు, పరిశ్రమలు, విద్యుత్, నిర్మాణం) నాలుగింతలు పెరిగితే, సేవల రంగాల్లో పదకొండింతలకు పైగా పెరిగింది. మొత్తం రాష్ట్ర సాలుసరి స్థూలాదాయం ఆరు రెట్లు (పదహారు వేలకోట్ల నుండి తొంభైనాలుగు వేలకోట్లకు) ఎదిగింది. తలసరి ఆదాయం (స్థిర ధరలలో) నాలుగు వేలున్నది దాదాపు పదకొండు వేలయింది.

ఈ వ్యవధిలో మానవ జీవన ప్రమాణాలు బాగుపడినవి. రాష్ట్ర జనాభా మొదటి నాలుగు దశాబ్దాలలో వేగంగా వృద్ధి చెంది 2001 నాటికి రాష్ట్రావతరణ నాటి జనాభాకు రెట్టింపయింది. గత దశాబ్దంలో పెరుగుదల రేటు బాగా తగ్గింది. 2001 లెక్కల ప్రకారం వార్షిక జనాభా పెరుగుదల రేటు 1991 నాటి రెండున్నర శాతం నుండి దాదాపు సగానికి (ఒకటింబావు శాతానికి) వచ్చింది. మొత్తం కాన్పుల రేటు (ఒక స్త్రీ తన జీవితకాలంలో కనే పిల్లల సంఖ్య) 4.6 నుండి 2.5 కు తగ్గింది. ఈ పరివర్తన ఆరోగ్య ప్రమాణాలు ముఖ్యంగా స్త్రీ, శిశు స్వాస్థ్యం మెరుగు పడడానికి దోహదం చేసింది. జీవిత కాల ప్రమాణం దాదాపు 20 ఏళ్ళు పెరిగి 64 దగ్గిరయింది. మానవ మరణాల రేటు 16 నుండి 8 కొచ్చింది. శిశు మరణాల రేటు గత మూడు దశాబ్దాలలో 123 నుండి 60కి తగ్గింది.

రాష్ట్రంలో అక్షరాస్యత శాతం 21 నుండి 61 కి పెరిగింది. సాధారణ జీవన సరళి బాగుపడింది. ఒక లెక్క ప్రకారం తలసరి నెలసరి వ్యయం (1973-74 ధరలలో) రాష్ట్రావతరణమపుడుండిన రు.50 నుండి రు.90 కి దగ్గిర చేరింది. ఆరోజుల్లో రాష్ట్ర ప్రజలలో ఐదింట మూడొంతుల పేదలయితే శతాబ్దం అంతానికి దారిద్ర్య శాతం 16కు పడి పోయిందని ప్రణాళిక సంఘం అంచనా.

ఇంతకన్నా ఇంకా సాధించ వలసిందనే వారున్నారు. ఆర్థికాభివృద్ధి వేగంలో మన రాష్ట్రం ఎప్పుడూ పదహారు పెద్ద రాష్ట్రాలలో ఆరు లేక ఏడవ స్థానంలో ఉంటూండింది. మానవ జీవన ప్రమాణాల వృద్ధి విషయంలో మొదటి మూడు దశాబ్దాలలో ముందున్న దక్షణాది రాష్ట్రాల సరసనున్న మన రాష్ట్రం ఐదవ దశాబ్దానికల్లా వెనుక బడ్డ ఉత్తరాది రాష్ట్రాలతో కలిసింది. మొదటి నాలుగు దశాబ్దాలలో సాగునీరు, విద్యుత్తులకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వటమే ఈ పరిణామానికి దారితీసిందనవచ్చు. కడపటి దశాబ్దంలో మానవాభివృద్ధికి ఎక్కువ ప్రాధాన్యత నివ్వటం వలననే ఈనాటి సాగునీటి ఎద్దడికి కారణమైందన్నా తప్పు కాదు. ఆర్థిక విషయాల్లో ఇలా ప్రాధాన్యతలలో మార్పులు చేర్పులు అవసరమవటం, ఆ మార్పుల వలన కలిగే మంచి కొంత చెడును వెంటబెట్టుకు రావటం మామూలే.

సాధించిన ప్రగతిలో ఏ వర్గానికి ఎంత దక్కిందని తేల్చటం సులభం కాదు. ఈనాడు ఈ వర్గాలలో ఎవరు ముందున్నారు, ఎవరు వెనుకనున్నారని చూసుకొంటే ఈ విషయంలో కొంత అవగాహన ఏర్పడుతుంది. కానీ ఏ వర్గం ఇప్పుడు ఏస్థానంలో ఉందన్నది రాష్ట్రావతరణ నాడు ఆ వర్గం ఎక్కడుండినదన్న దానిమీద కూడ ఆధారపడి వుంటుందన్న విషయం మరవరాదు.

## స్త్రీ పురుషుల స్థానాలు

స్త్రీల జీవితకాలం సర్వత్రా పురుషుల కన్నా ఎక్కువ. మన రాష్ట్రంలోనూ ఇలాగే ఉంది. మిగతా అన్ని విషయాల్లోనూ ఆడవారు మగవారి తరువాతే. స్త్రీ, భ్రూణహత్యలు ఇత్యాదుల వలన స్త్రీ, పురుష నిష్పత్తి మనరాష్ట్రంలో కూడా తగ్గుముఖం పడుతున్నది. బాలికల నిష్పత్తి 1991లో ఉండిన 975 నుండి 2001 లో 964 కు దిగజారింది. ఆడపిల్లల్లో పోషకాహారం తక్కువైన పిల్లలశాతం మగ పిల్లల్లో కన్నా ఎక్కువ. అస్వస్థత చేస్తే మగ పిల్లలను వైద్యాలయానికి తీసుకెళ్ళే శాతంకన్నా ఆడపిల్లలను తీసుకువెళ్ళే శాతం తక్కువ. దేశమంతట్లో ఆంధ్రప్రదేశ్‌లో బాలకార్మికులెక్కువైతే అందులో ఆడపిల్లలు మరింతగా ఉన్నారు. బయటి పనులే కాక ఇంటి పనులు వీరి కెక్కువ. పురుషులలో అక్షరాస్యత 71 శాతం ఉంటే స్త్రీలలో 50 శాతమే. వారసత్వం, వివాహబంధం మొదలైన విషయాల శాసనాలు ఆడవారి పట్ల చిన్న చూపు చూస్తున్నాయన్న సంగతి అందరూ ఎరిగిందే. స్త్రీ భవితవ్యాన్ని మెరుగుపరచడానికి కార్యక్రమాలు 1990 ల దశకం నుండి చేపట్టబడ్డాయి. గత రెండు దశాబ్దాలలో పేదరికం నిర్మూలన పథకాల్లో స్త్రీలకు ప్రాధాన్యత నివ్వటం, స్వయంసహాయ సంఘాలనేర్పరచటం మొదలయిన వాటి వలన స్త్రీల స్థితిగతులు, కుటుంబంలో వారి మాటకు విలువ మెరుగైనాయని అంటున్నారు. గత దశాబ్ద ప్రారంభంలో పంచాయతీరాజ్ సంస్థల్లో స్త్రీలకు రక్షణ ఏర్పడినందున సమాజంలో స్త్రీ స్థానం మెరుగయ్యే అవకాశాలు ఎక్కువయ్యాయి. 2005లో స్త్రీ వారసత్వ హక్కుల గురించిన శాసనం చేయబడింది.

## గ్రామీణులు - నగరవాసులు

ఈ రోజుల్లో నగరవాసుల్లో ఉన్న ఇక్కట్లను మరవకున్నా గ్రామాలలో కన్న నగరాలలో ఎక్కువ వసతులున్నాయన్న సంగతి కాదనలేము. నగరవాసుల శాతం రాష్ట్రావతరణ నాడు 17 ఉంటే, ఈనాడది 27 కు పెరిగింది. గ్రామీణుల ఆయుర్దాయం నగరవాసుల కన్న నాలుగున్నర సంవత్సరాలు తక్కువుంది. నగరాలకన్న గ్రామాలలో జననాల రేటు దాదాపు రెండు శాతం ఎక్కువైతే, మరణాల రేటు మూడున్నర శాతం ఎక్కువ. ఈ తేడాలు మునుపటి కన్న తక్కువైనవి. మూడు దశాబ్దాల క్రితం గ్రామీణుల ఆయుర్దాయం నగరవాసుల కన్న పదేళ్ళు తక్కువుంది (47.3, 57.3). ఇప్పుడీ తేడా నాలుగున్నర సంవత్సరాలకు తగ్గింది (61.0, 65.5). దాదాపు 14 ఏళ్ళు పెరిగిన ఆయుర్దాయం బాగుపడుతున్న గ్రామీణుల ఆరోగ్యానికి అద్దంపడుతున్నది. గ్రామీణుల తలసరి నెలసరి వ్యయం (1973-74 ధరలలో) నగరవాసుల తలసరి నెలసరి వ్యయంకన్న అనాడూ ఈనాడూ తక్కువే వున్నది. పేదల శాతం గ్రామాలలో ఎక్కువా, నగరాలలో ఎక్కువా అన్నది వివాదాంశం. గ్రామీణ పేదరికపు లెక్కలను గురించి ఉన్న అనుమానమల్లా అది గ్రామీణ పేదలశాతం రాష్ట్రావతరణ నాటి 64 నుండి పాతికకు తగ్గిందా, పరకకు తగ్గిందా అనే. సేద్యపు నీరు, విద్యుత్తుల మీద చేసిన పెట్టుబడులు గ్రామీణుల ఆర్థికాభివృద్ధికి తోడ్పడిన సంగతి రైతుల ఆత్మహత్యల ఈనాటి నేపథ్యంలో గుర్తుకు తెచ్చుకోటం కష్టమే అయినా ఆమాటను కాదనలేము.

## కులాల కుమ్ములాట

కులాల మధ్య అంతరాలున్న సంగతి భారత రాజ్యాంగం గుర్తించింది. షెడ్యూల్డ్ కులాలకు, జాతులకు 1950 నుండే చదువుల లోను, ప్రభుత్వ సంస్థలందజేసే సేవలలోను, ప్రభుత్వ ఉద్యోగాలలోనూ రక్షణ కల్పించడమయినది. వీరి అభివృద్ధికై షెడ్యూల్డ్ కులాలకు ఏక్షన్ ప్రణాళిక, షెడ్యూల్డ్ తెగలకు ఉప ప్రణాళికలను బడ్జెట్లలో తప్పనిసరి భాగం చేయబడింది. ఈ నాటికీ ఈ వర్గాలకు మిగతా కులవర్గాలకు మధ్య అంతరాలున్నాయి. మొత్తం జనాభాలో నగరవాసుల శాతం 27 ఉంటే షెడ్యూల్డ్ కులాల్లో 17, షెడ్యూల్డ్ జాతులలో 7 శాతం మాత్రం నగరాల్లో ఉంటున్నారు. జనాభాలో అక్షరాస్యత శాతం 60 ఉంటే షెడ్యూల్డ్ కులాల్లో 31, షెడ్యూల్డ్ తెగల్లో 17 శాతం మాత్రమే ఉన్నాయి. ఉన్నత పాఠశాల వరకు చదువుకొన్న బాలుల శాతం మిగతా కులాల్లో 22, షెడ్యూల్డ్ కులాల్లో 15, షెడ్యూల్డ్ తెగల్లో 8 మాత్రం. రాష్ట్రంలో సగటు తలసరి నెలసరి వ్యయం కన్నా షెడ్యూల్డ్ కులాల, తెగల తలసరి నెలసరి వ్యయం 20 శాతం తక్కువుంది.

మిగతా వెనుకబడ్డ కులాల గురించి శాస్త్రీయ పద్ధతులలో సేకరించిన సమాచారం అసలు లేదనాలి. ఈ కారణంగా ఉన్నత న్యాయస్థానం ఈ కులాలకు విద్య, ఉద్యోగాలలో రాష్ట్ర ప్రభుత్వం చేసిన రక్షణలను కొట్టి వేసింది. దరిమిలా ప్రభుత్వం న్యాయమూర్తి పుట్టస్వామయ్య అధ్యక్షతన ఇతర వెనుకబడ్డ కులాలను గుర్తించడానికి ఉన్నత స్థాయి సంఘాన్ని నియమించింది. 1996 లో భారతీయ గణాంక సంస్థకు చెందిన ఆచార్య హను రావు గారి నేతృత్వంలో న్యాయమూర్తి పుట్టస్వామయ్య ఉన్నతస్థాయి సంఘం ఒక బృహత్తర సర్వేక్షణను నిర్వహించింది. రాష్ట్రంలోని అన్ని కులాలను సర్వేక్షణ చేస్తేనే ఎవరు ముందున్నారో ఎవరు వెనుకబడ్డారో తెలుసుకోగలమన్న సిద్ధాంతంతో ఈ సర్వేక్షణ ప్రారంభించింది. చిన్న చిన్న కులాలతో కలిపి రాష్ట్రంలో 202 కులాలను సర్వేక్షణ గుర్తించింది. వాటిలో ఒక్కోదాని జనాభాను, సామాజిక, ఆర్థిక, విద్యా రంగాలలో స్థానాలను, అన్ని రంగాలలో కలిపి, ఏకీకరించిన స్థానాలను ఈ సర్వేక్షణలో అంచనా వేశారు. ఈ సర్వేక్షణ నివేదికలో బ్రహ్మణులతో ప్రారంభించి అవరోహణ క్రమంలో 202 కులాలను, ఏ కులం కన్న వెనుకబడ్డ వారు జనాభాలో ఎంత శాతం ఉన్నారు అన్న కీలకమైన అంచనాలతో చూపించారు. రాష్ట్రంలో సగం జనాభా వెనుకబడ్డ వారనుకొంటే గొల్లలు మొదలుకొని 86 కులాలను వెనుకబడ్డవిగా పరిగణించాలి. వీటిలో షియా, సున్ని ముస్లిములున్నారన్నది గమనార్హం. సాంకేతిక పరాకాష్ఠనందుకొన్న ఈ సర్వేక్షణ నివేదికలోని సమాచారాన్ని న్యాయమూర్తి పుట్టస్వామయ్య ఉన్నతస్థాయి సంఘం అంతర్గత విభేదాల వల్ల వినియోగించుకోలేకపోయి, ఏ సూచనలు చేయకనే విరమించింది.

## ఇక్కడివారు-అక్కడివారు

రాష్ట్రావతరణ నాడే భిన్నస్వరాలు వినిపించాయి. ఏర్పడిన రెండవ దశాబ్దంలో వినిపించిన తెలంగాణ వెనుక బడిందన్న వాదన గత నాలుగేళ్ళలో మళ్ళీ ముందుకొచ్చింది. ఆర్థిక ప్రగతి గణాంకాలు ఈ వాదాన్ని బలపరచడం లేదు. సేద్యపు నీటి వసతి పొందిన పంటపొలాల శాతం కోస్తా ఆంధ్ర ప్రాంతంలో 47 నుండి 58 కి పెర్గగా తెలంగాణలో 16 నుండి 36 కు, రాయలసీమలో 12.6 నుండి 23.3 కు పెరిగింది. పంటల ఉత్పత్తి పెరుగుదల రేట్లు కోస్తా ఆంధ్రకన్నా తెలంగాణలో ఎక్కువగానూ, రాయలసీమలో తక్కువగానూ ఉన్నాయి. అక్షరాస్యత శాతంలో పెరుగుదల కోస్తాలో 17.4, రాయలసీమలో 15.6, హైదరాబాదేతర తెలంగాణలో 18.9 ఉన్నాయి. పేదరికంలో తరుగుదల కూడ మిగతా ప్రాంతాలకన్నా తెలంగాణలో ఎక్కువ వేగంతో జరిగింది. సెస్ అధ్యయన సంస్థ కట్టిన మానవాభివృద్ధి సూచికాంకాలు హైదరాబాదు నగరానికి ఎ, దక్షిణకోస్తాకు బి, ఉత్తర తెలంగాణాకు సి, రాయలసీమకు డి, దక్షణ తెలంగాణకు ఇ, ఉత్తరకోస్తాకు ఎఫ్ గా ఉన్నాయి. ఆర్థిక గణాంకాలు కాక భావోద్రేకాలే ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి ఊపిరైతే దానికి బాధ్యత రాష్ట్రాన్ని ఏలిన వారిదే అవుతుంది. ఇక్కడికి చెందిన ఉద్యోగాలు ఇక్కడి వారికివ్వకపోవటం, వలనవచ్చిన వారిని ఇక్కడి వారికి ప్రతినిధులను చేయటం వంటి చర్యలు భావోద్రేకానికి తావిచ్చాయి.

## కలవారు-లేనివారు

ఆర్థిక అసమానతలు ఈనాడు కొత్తకాదు. ఆర్థిక అసమానతలు ప్రధానంగా రెండు విధాలుగా అవగాహన చేసుకోగలం - గ్రామస్థులకు నగరవాసులకు వున్న అంతరాలు, గ్రామస్థులలోనూ నగరవాసులలోనూ వారిలోవారికున్న అసమానతలు. ఈ తారతమ్యాలను తలసరి నెలసరి వ్యయం అంచనాల విశ్లేషణతో చూడవచ్చు. 1999 -2000 సర్వేక్షణ అంచనాలిలా ఉన్నాయి: గ్రామీణుల తలసరి నెలసరి వ్యయం రు. 282, నగరవాసులకిది రు. 470. నగర గ్రామీణవాసుల మధ్యనున్న తారతమ్యాలకు ప్రధాన కారణం వారి జనాభాల శాతాలకు ఉన్న అంతరమే. రాష్ట్ర జనాభాలో గ్రామీణులు 73 శాతం ఉన్నారు, స్థూలాదాయంలో వారి ఉపాధి ఆధారమైన రంగాల వాటా 28 శాతం మాత్రమే. ఇక గ్రామస్థులలోను నగరవాసులలోను వారిలోవారికున్న అసమానతలు. పల్లె వాసుల్లో న్యూనతమ 30 శాతం జనం తలసరి నెల వ్యయం రు. 168, ఉన్నత 30 శాతం జనం తలసరి నెల వ్యయం రు. 435, అంటే కలవారు లేనివారికన్నా రెండున్నరంతలు ఖర్చు చేయగలుగుతున్నారు. అలాగే నగరవాసుల్లో న్యూనతమ 30 శాతం జనం తలసరి నెలసరి వ్యయం రు. 221 అయితే, ఉన్నత 30 శాతం జనం తలసరి నెలసరి వ్యయం రు. 819లు, అంటే న్యూనతమ 30 శాతం జనంకన్న దాదాపు నాలుగంతలు. మొదటి నాలుగు దశాబ్దాలలో ఈ అసమానతలు పెద్దగా పెరగలేదన్నది ఆర్థిక శాస్త్రవేత్తల అభిప్రాయం.

అయిదవ దశాబ్దంలో అసమానతలు గణనీయంగా పెరిగినాయని చాల మంది అంటున్నారు. గ్రామీణులలో అంతరాలు పెరగలేదు, నగరవాసులలో మాత్రమే పెరిగినవి. అయినా కలవారు లేనివారు అన్న భావాలు పల్లెవాసుల్లో కరుడుగట్టి కనిపిస్తున్నాయి. ఈనాటి "అధికారం పేదలనణచడానికి కలవారికి దొరికిన ఆయుధమని లేనివారి భావన'' అని ఒక న్యాయశాస్త్రాచార్యుడు ప్రస్తుత స్థితిని వర్ణించారు. పల్లెవాసుల్లో, అడవుల్లో నివసిస్తున్న వారిలో ఈ భావనకున్న ఆదరణే సమతా వాదులను సాయుధ పోరాటానికి ప్రోత్సహిస్తున్నది. ఈనాటి రాజకీయ, ఆర్థిక, సామాజిక వ్యవస్థ మొత్తం దోపిడిదారి వ్యవస్థ అనీ, అధికార యంత్రాంగమంతా దోపిడిదార్ల సమర్థనకే ఉన్నందున అణచి వేయబడుతున్న వారికి సాయుధ పోరాటం తప్ప వేరే దారే లేదన్నది నక్సలైట్ల నమ్మకం. ఈ వ్యవస్థలో నీతికి, న్యాయానికి ఆదరణ తక్కువయినా, ఇందులో విచారణ లేనిదే శిక్ష పడదని, విచారణ లేకనే శిక్షించే, వధించే ఉద్యమంకన్న ఈ వ్యవస్థే ఎక్కువ నీతివంతము, న్యాయమైనది, కాబట్టి నక్సలైట్లు హింసాత్మక, అప్రజాస్వామ్య విధానాలు వదలి ప్రజాస్వామ్య స్రవంతిలో కలసి ఈ వ్యవస్థ లొసుగులను సరి చేసే కృషిలో చేరమంటున్నారు రాష్ట్ర ముఖ్యమంత్రి రాజశేఖర రెడ్డి. ఇటీవల చేయబడ్డ వ్యవస్థాగత మార్పులు రాజశేఖర రెడ్డి గారి వాదనకు బలం చేకూరుస్తున్నాయి. రాజ్యాంగంలో పంచాయతి రాజ్యానికి వేసిన పెద్దపీట, గ్రామీణ ఉపాధి హక్కు, సమాచార హక్కు, కంప్యూటర్లు, టెలిఫోన్ల ద్వారా ఏర్పడిన కమ్యూనికేషన్ల సాంకేతిక నదుపాయం వీటిలో ప్రముఖమైనవి. అయినా ఈ రెండు వాదాల్లో ఏది సత్యం, ఏది అసత్యం, ఏది నీతివంతం, ఏది కాదు అన్నది ఇప్పుడిప్పుడే తేలే అవకాశాలు కనిపించడం లేదు.

వివిధ రంగాల్లో సాధించిన అభివృద్ధి, ఫలాల పంపకం, ఇంకెన్నెన్నో గొప్ప మార్పుల నేపథ్యంలో ఈ ఏకభాషా రాష్ట్రం వివిధ దాయాది వర్గాలను దగ్గిర చేర్చటంలో ఎంత సఫలీకృతం అయిందో భవిష్యత్తే నిర్ణయించాలి. ❑

# పారిశ్రామికరంగంలో వెలుగు, నీడ, వెలుగు

వి. హనుమంతరావు, ఎస్.సుబ్బారావు

వెనకబడిన దేశాలు, రాష్ట్రాలు, ప్రాంతాలు పారిశ్రామికీకరణ కోసం వెంపర్లాడుతుంటాయంటే దానికి రెండు ప్రధాన కారణాలుంటాయి: (1) పరిశ్రమలు ఉద్యోగావకాశాలను పెంచుతాయనే ఆశ, (2) పారిశ్రామికీకరణ వల్ల వెనుకబాటుతనాన్నుంచి బయటపడి అభివృద్ధి పథంలో పయనించడానికి అవకాశం ఏర్పడుతుంది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలు, ప్రాంతాలు ముమ్మందుకు పోవటం చూసిన తరువాత ఆ కోర్కె మరింత బలపడుతుంది. ఆర్థిక శాస్త్రవేత్తలు కూడా వ్యవసాయం, పరిశ్రమలు, సేవల రంగం, ఈ వరుస క్రమంలో దేశాలు అభివృద్ధి చెందుతాయని సూత్రీకరించారు.

1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాటికి ఆంధ్రప్రాంతం పారిశ్రామికంగా చాలా వెనుకబడి వుంది. ఇటు తెలంగాణాలో హైదరాబాద్ నగరం తప్ప జిల్లాల్లో పరిశ్రమలు లేవు. వ్యావసాయిక రాష్ట్రం కావటంతో, పాలకులు వ్యవసాయ కుటుంబీకులు కావడంతో వారి దృష్టి ప్రథమంగా ప్రధానంగా నీటిపారుదల సౌకర్యం మీద కేంద్రీకరించింది. కాస్త కాలూ, చెయ్యి కూడదీసుకున్న తరువాత కొత్త రాష్ట్రాన్ని దేశ పారిశ్రామిక పటం మీదకు తీసుకుని రావాలనే ఆలోచన వచ్చి, ఢిల్లీలోని నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఎకనమిక్ రీసెర్చ్ సంస్థను 1960లో ఆహ్వానించి పారిశ్రామీకరణ గురించి ఒక రిపోర్టు తయారుచేయమని కోరింది. రాష్ట్ర పారిశ్రామికీకరణకు అప్పుడే పునాదులు పడ్డాయి. అయితే ఆ నివేదిక చేసిన సిఫార్సులను అమలు జరిపిన ధోరణి పెద్దగా ఏమీ కనపడలేదు. అయినా పారిశ్రామికీకరణ అనే పురుగు తొలవడం ప్రారంభం అయింది కాబట్టి, రాష్ట్రం వెనుకబడింది కాబట్టి కేంద్ర ప్రభుత్వం కొన్ని ప్రభుత్వ రంగ పరిశ్రమలను రాష్ట్రంలో స్థాపించాలని కేంద్రం మీద ఒత్తిడి తీసుకుని వచ్చి బిహెచ్ఇఎల్, హెచ్ఎంటి, సింథటిక్ డ్రగ్స్ లాంటి ప్రభుత్వ రంగ పరిశ్రమలను హైదరాబాద్‌లో, బిహెచ్‌పివి, జింక్ స్మెల్టర్ పరిశ్రమలు విశాఖలో నెలకొల్పడంలో విజయం సాధించింది. ఈ భారీ పరిశ్రమలకు కావలసిన విడిభాగాలు, యంత్ర పరికరాలు సరఫరా చేసే చిన్న పరిశ్రమలు ఏర్పడటం, అదే సమయంలో పారిశ్రామిక వాడలు అనేక జిల్లాల్లో ఏర్పాటు చేయటంతో దేశ పారిశ్రామిక పటంలో రాష్ట్రం చిన్న చోటును సంపాదించుకుంది. 60-70 దశకాల్లో పరిశ్రమల ఏర్పాటుకు తోడ్పడే ఎ.పి.ఐ.డి.సి., ఎ.పి.ఎస్.ఎఫ్.సి., ఏ.పి.ఐ.ఐ.సి.లాంటి సంస్థలను ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఉమ్మడి రంగ పరిశ్రమల ఏర్పాటు విధానాన్ని ప్రవేశపెట్టి అప్పుడప్పుడే భూసంస్కరణలు ప్రవేశపెట్టడంతో తమ రోజులు దగ్గర పడ్డాయని గ్రహించిన సంపన్న రైతులు పరిశ్రమలలో పెట్టుబడులు పెట్టడానికి ఆకర్షించడంలో ప్రభుత్వం సఫలమయింది. అప్పుడప్పుడే ఈ సంపన్నుల బిడ్డలు, పై చదువులు చదివి, చుట్టూ రాష్ట్రాలలో పరిశ్రమల ఏర్పాటును చూసి, తల్లిదండ్రులు తోడ్పడగా పరిశ్రమల ఏర్పాటువైపు ఆకర్షించబడ్డారు. ప్రభుత్వం ప్రకటించిన ప్రోత్సాహకాలు కూడా అందుకు తోడ్పడ్డాయి.

అంతా ఆల్ రైట్‌గా ఉందనుకునేసరికి పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి ఏది? అనే మిలియన్ డాలర్ ప్రశ్న ఎదురైంది. 70వ దశకం ప్రారంభంలో విద్యుత్ కేంద్రాలకు పునాదులు పడ్డాయి. రెండవ దశకం వచ్చేసరికి రాష్ట్రం దశ తిరిగింది. ఓ పదేళ్ళపాటు ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల జెండాలు ఎగురవేసింది. అదో స్వర్ణయుగంగా చెప్పవచ్చు. కొత్తగా భారీ పరిశ్రమలు ఏమీ రాకపోయినా ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలు ముందుకు వచ్చారు. ఏపిఐడిసి సంస్థ వారానికి ఓ పరిశ్రమ మంజూరు చేసింది. గ్రామ సీమలలో గడ్డితో కాగితం తయారుచేసే పరిశ్రమలు ఏర్పాటయ్యాయి. ఐడిబిఐ, ఐఎఫ్‌సిఐ లాంటి పరిశ్రమల ఆర్థిక సహాయసంస్థలు ఇబ్బడిముబ్బడిగా రుణాలిచ్చాయి. దేశంలో పారిశ్రామికంగా ముందున్న మొదటి నాలుగైదు రాష్ట్రాల సరసన ఆంధ్రప్రదేశ్ చోటు చేసుకుంది. ఇంజనీరింగ్, వ్యవసాయాధార పరిశ్రమలు నెలకొల్పారు.

అంతవరకూ పరిశ్రమ రాష్ట్రంలో నెలకొల్పటమే మహాప్రసాదమని ప్రభుత్వం భావిస్తూ వచ్చింది. కానీ పారిశ్రామికీకరణ పుంజుకొనేసరికి పయనమెటు? ఏ పరిశ్రమలు నెలకొల్పాలి? ప్రాధాన్యత దేనికి? ఏ ప్రాంతంలో అనుమతించాలి? అనే ప్రశ్నలు ఎదురయ్యాయి. అప్పటివరకూ విధాన ప్రక్రియ అంటూ ఏదీ లేదు. మొట్టమొదటి పారిశ్రామిక విధాన పత్రం వెలువడింది. రాష్ట్రానికో విధాన ప్రకటన వుండాలి కాబట్టి అలాంటి ప్రకటన చేయడమేకానీ, రాష్ట్రాన్ని వెనుకబడిన వ్యవసాయాధార పరిస్థితినుంచి ఆధునిక అభివృద్ధికరమైన, రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధి చేసి సమగ్రాభివృద్ధి చెందే రాష్ట్రంగా మార్చాలనే ఆలోచన ఆ ప్రకటనలో గానీ, తరువాత వచ్చిన రెండు మూడు విధాన ప్రకటనలలో గానీ చోటు చేసుకోలేదు. ఇటీవల వెలువడిన ప్రకటనలలో ఫలానా రకం పరిశ్రమలు నెలకొల్పాలని, వాటికే ప్రాధాన్యత ఇస్తామంటూ లాంఛనంగా అనటమే కానీ అసలు పరిశ్రమలు వస్తేగా దేనికైనా ప్రాధాన్యత ఇవ్వడానికి? అన్ని విధాన ప్రకటనలలో పూసలలో దారంలా కనపడేది

మినహాయింపులు, ప్రోత్సాహకాలు, తగ్గింపులు, చెల్లింపుల వాయిదాలు, భూమి కేటాయింపు లాంటివి తప్ప రాష్ట్రంలో వున్న సహజ వనరులని ఎలా వినియోగించుకుని రాష్ట్రాన్ని పారిశ్రామికంగా ఎలా ముందుకు తీసుకుపోవాలో, ఆ విధాన ప్రకటనలో కనిపించలేదు. అటు వ్యవసాయం, ఇటు పరిశ్రమలు సమతూకంగా పెరగాలి అనే ఆలోచనా విధానానికి పునాదులు పడలేదు.

1983లో అధికారంలోకి వచ్చిన తెలుగుదేశం పార్టీ నీటిపారుదల పథకాలనే గాక విద్యుదుత్పాదనను ప్రణాళికా కేటాయింపులో వెనుక బెంచీలో కూర్చోపెట్టడంతో పారిశ్రామికాభివృద్ధికి ఆటంకం ఏర్పడడంతో పరిశ్రమ అప్పటికీ ఇప్పటికీ వెనుకనే చతికిలపడి పోయింది. అయితే ఆ సమయంలో ప్రభుత్వ రంగ పరిశ్రమలను ప్రయివేటీరించే ఆలోచన రాకపోవడం గుడ్డిలో మెల్లగా భావించాలి. 1991లో ఆర్థిక సంస్కరణలను ప్రవేశపెట్టిన తర్వాత ముఖ్యంగా ఆ దశకం మధ్యంతర సమయంలో అప్పటి ప్రభుత్వం ప్రపంచ బ్యాంకు షరతులకు తలొగ్గడంతో రాష్ట్రంలో పారిశ్రామికీకరణకు మరణశాసనం రాసేశారు. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ విస్తరణే పారిశ్రామికీకరణగా భావించారు. దీనితో ప్రభుత్వ రంగ పరిశ్రమలొక్కొక్కటి ప్రయివేట్ రంగానికి ధారాదత్తం చేయడం ప్రారంభమయింది. ఈ పని చేయటంలో ప్రభుత్వ విధానం ప్రభుత్వ రంగ పరిశ్రమను కావాలనే ఖాయిలా పెట్టడం, నష్టాలలోకి నెట్టడం, తర్వాత ప్రైవేటీకరించడం చూస్తే కుక్కను చంపాలంటే దాన్ని పిచ్చికుక్క అనాలనే సామెత గుర్తొస్తుంది. ఒక వ్యాఖ్యాత అన్నట్లు ప్రభుత్వం కూడా ఖాయిలా పడి, అసమర్థంగా నడుస్తూ రుణ భారంతో కృంగిపోతుంది కాబట్టి దాన్ని కూడా ప్రయివేటీకరించేద్దామా ?

ప్రైవేటీకరణ అనే ఆలోచన ప్రపంచబాంకు మన పాలకుల తలకాయల్లో ప్రవేశపెట్టింది. జనవరి 16, 1997 లో 'ఇండియా, ఆంధ్రప్రదేశ్, ఆర్థిక సంస్కరణల ఎజెండా అనే ప్రపంచబాంకు పత్రంలో ప్రభుత్వ రంగ సంస్థలన్నీ అసమర్థంగా తయారయ్యాయి. అవసరాన్ని మించి ఉద్యోగులున్నారు కాబట్టి ఒక స్వతంత్ర ప్రభుత్వరంగ సంస్కరణ, ప్రైవేటీకరణ కమిషన్‌ను ఏర్పాటు చేసి, మందీ మార్బలం సమకూర్చి, దానికి చట్ట బద్ధత కల్పించి, సంస్కరణలు అమలు పరచాలని రాష్ట్ర ప్రభుత్వానికి సలహా అనే పేరుతో ఆదేశం జారీ చేసింది.

1) ప్రభుత్వరంగ పరిశ్రమల విషయంలో సంస్కరణ కార్యక్రమాన్ని చేపట్టి ఒక నిర్ణీత కాలపరిమితిలో ఆ పని పూర్తి చేయాలి.

2) ప్రైవేటీకరణ విజయవంతం చేయటానికి జారీ చేసే మార్గదర్శక సూత్రాలు మార్గదర్శకంగా వుండేలా ఈ కమిషన్ రూపొందించాలి. ప్రైవేటీకరణ చేసే విధానం, పరిశ్రమను కొనుక్కోవడానికి ముందుకు వచ్చే వారి బిడ్స్‌ను ఎలా అంచనా వేయాలి, ఎంతకు అమ్మివేయాలి ఎవరికి చెల్లింపులు అన్నీ పారదర్శకంగా వుండాలి. (3) తలెత్తే కార్మిక సమస్యలను పరిష్కరించే క్రమంలో స్వచ్ఛంద పదవీ విరమణ పథకాన్ని, తొలగించిన కార్మికులకు కొత్తగా శిక్షణ ఇచ్చే పథకాన్ని తయారుచేయాలి.

(4) ప్రైవేటీకరణ చేయగా వచ్చిన డబ్బును, ఎక్కువ వడ్డీకి తీసుకొని వచ్చిన రుణాలను తిరిగి చెల్లించడానికి వినియోగించాలి. ఈ ఆదేశాన్ని రాష్ట్ర ప్రభుత్వాలు తు.చ. తప్పకుండా అమలు పరచే ప్రయత్నాన్ని ఒక ఇంప్లిమెంటేషన్ సెక్రటేరియట్‌ను ఏర్పాటు చేయడంతో ప్రారంభించారు. ఒక విడత ప్రయివేటీకరణ పూర్తి అయి, రెండో విడత నడుస్తుంది. అయితే ఎంతకు, ఎవరికి అమ్మారు? చెల్లింపులకు షరతులేమిటి? అని బ్యాంకు చేసిన సూచనను ప్రభుత్వం తుంగలో తొక్కింది. పారదర్శకత పూర్తిగా లోపించడంతో డబ్బుల మూటలు చేతులు మారాయని, కారుచవగ్గా అమ్మేశారనే ఆరోపణలు సర్వసాధారణమయ్యాయి. అమ్మగా వచ్చిన ధనాన్ని రుణాలు తిరిగి చెల్లించాలనే షరతుతో ప్రపంచబ్యాంకు తానిచ్చిన రుణం తిరిగి రావడానికి ప్రాతిపదికను ఏర్పాటు చేసుకొన్న విషయాన్ని గమనించాలి.

అసలీ ప్రైవేటురంగ సంస్థలు ఎంత ప్రైవేటువైనవో ఎకనమిక్ టైమ్స్ (23 అక్టోబర్ 2002) పత్రిక బయటపెట్టింది. పరిశ్రమను ప్రారంభించినవారు పరిశ్రమను పెట్టడానికి అవసరమైన నిధులలో 10% నిధులను కూడా సమకూర్చని కంపెనీల లిస్టును ప్రకటించింది. ఆ పారిశ్రామికవేత్తలు ప్రాజెక్టు ఖరీదులో 44% ను రుణంగా వివిధ ఆర్థిక సహాయ సంస్థల నుంచి, 37% షేర్ల రూపంలో ప్రజల నుంచి సేకరించి పరిశ్రమలు పెట్టారని వివరాలు ఇచ్చింది. అంటే ప్రయివేట్ సంస్థలనేవి ఎంత ప్రైవేట్‌వో అర్థమవుతోంది. నిజానికి ప్రైవేట్ రంగ సంస్థలనే ప్రభుత్వీకరించాలి. వాస్తవానికి ఆ 10% డబ్బు కూడా ప్రాజెక్టు నిర్మాణానికయ్యే అంచనాలను పెంచి, వారి జేబుల్లోనుంచి ఒక్క నయాపైసా ఖర్చు పెట్టకుండా పరిశ్రమలు స్థాపించారు. నష్టం వస్తే ఆర్థిక సహాయ సంస్థలు, షేర్ల హోల్డర్లు నష్టపోతారు. పారిశ్రామికవేత్తలు క్షేమంగానే వుంటారు.

కాగా ప్రభుత్వరంగ సంస్థల ప్రైవేటీకరణతో ప్రభుత్వం రాష్ట్ర పారిశ్రామికీకరణ మీద గొడ్డలి పెట్టు పెట్టింది. ఉన్న పరిశ్రమలు చేతిలో నుంచి జారిపోయాయి. కొత్త పరిశ్రమలు రావు. దీంతో పారిశ్రామికీకరణ స్థంభించిపోయింది. సంస్కరణలు ప్రవేశపెట్టి తెలుగుదేశం ప్రభుత్వం చేసిన నిర్వాకం ఇది. దీనిని కప్పిపుచ్చుకోవడానికే భాగస్వామ్య సదస్సు ఏర్పాటు, ఎన్నో పరిశ్రమలు వస్తున్నాయనే భ్రమలు ప్రచారం చేయడం జరిగింది.

ఏ ప్రభుత్వ రంగ పరిశ్రమలైతే పారిశ్రామికీకరణకు పునాదులు వేశాయో ఆ పరిశ్రమల పీకలు తెగిపడ్డాయి. పారిశ్రామిక సహాయ సంస్థలను ఒకదాని తర్వాత మరొకటి మూసేశారు.

విదేశాల నుంచి పెట్టుబడులు పెడతామనే ప్రతిపాదనలు వచ్చాయి గాని, పరిశ్రమలు ఏర్పాటు చేసిన జాడ లేదు. వచ్చిన

విదేశీ పెట్టుబడులు అప్పటికే రాష్ట్రంలో ఉన్న పరిశ్రమల్లో తమకున్న ఈక్విటీని పెంచుకొని, వాటిని కైవశం చేసుకోవడానికే వచ్చాయి. సి.ఐ.ఐ.తో కలసి ఏర్పాటు చేసిన భాగస్వామ్య సదస్సులు గాలిబుడగల్లా పేలిపోయాయి. దురదృష్టం ఏమిటంటే చీకట్లోకి జారిపోతున్న ప్రభుత్వ రంగ పరిశ్రమలు మళ్ళీ వెలుగు చూడడం ప్రారంభించిన సమయంలోనే ప్రైవేటీకరణ ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. విశాఖ ఉక్కు దేశంలో వున్న అన్ని ఉక్కు కర్మాగారాల కంటే అద్భుతమైన ప్రగతి సాధించిన రికార్డు తానే బద్దలు కొట్టింది. యుటిఐ నుంచి తెచ్చిన రూ. 675 కోట్ల రుణాన్ని తీర్చివేసింది. హైదరాబాద్‌లో ఇసిఐఎల్ సంస్థ వరుసగా మూడో సంవత్సరంలో రూ. 1005 కోట్లు అమ్మకాలు చేసి రూ. 150 కోట్లు లాభం గడించింది. మొత్తం అమ్మకాల్లో 48%, లాభంలో 90% అభివృద్ధి సాధించింది. కొత్తగూడెంలో ఆసియాలోనే రెండవ అతిపెద్ద స్పాంజి ఐరన్ కర్మాగారంగా పేరొందిన సంస్థ 2001-02లో 64507 టన్నుల ఉత్పత్తి సాధించి ఆల్-టైమ్ రికార్డు సృష్టించింది. ఇవి రెండు మూడేళ్ళ నాటి లెక్కలు. ఆ తర్వాత లాభాల బాట నుంచి తొలగిన వార్తలు రాలేదు.

## భారీ పరిశ్రమలే పరిష్కారమా ?

భారీపరిశ్రమల స్థాపనే పారిశ్రామికీకరణ అనేది పొరపాటు ఆలోచన. ఇలాంటి ఆలోచన వల్లే ఉన్న కొన్ని పరిశ్రమలు హైదరాబాద్ పరిసరాలకు, విశాఖ లాంటి నగరానికే పరిమితమైపోయాయి. పారిశ్రామిక వాడల విధానం దారుణ వైఫల్యానికి కూడా ఇదే కారణం. ఈ వైఫ్యలం ఔత్సాహిక పారిశ్రామిక వేత్తల ఉత్సాహాన్ని చంపివేసింది. జిల్లాల్లో పారిశ్రామిక వాటికలు పరిశ్రమల స్మశాన వాటికలుగా తయారయ్యాయి. మౌలిక సౌకర్యాల కల్పనలో వైఫల్యం వల్ల దేశంలో ప్రముఖ పారిశ్రామిక వేత్తల గ్రూపులు రాష్ట్రంలో పరిశ్రమలు పెట్టడానికి అయిష్టత చూపడానికి ప్రభుత్వ విధానాలే కారణమని గ్రహించటం పోయి విదేశీపెట్టుబడులు రాష్ట్రంలోకి ప్రవహించడమే పరిష్కారమనే నిర్ణయానికి వచ్చి, ఆ పెట్టుబడుల కోసం వెంపర్లాట ప్రారంభమయింది. రుణం తెచ్చుకోనిదే అభివృద్ధి సాధ్యం కాదనే ఆలోచనలో భాగమే ఇది. రాష్ట్రంలో పారిశ్రామిక కల్చర్‌ను పెంపొందించగలిగితే పారిశ్రామికీకరణకు హద్దే వుండదు.

అయితే ఇటీవల కాలంలో మౌలిక సౌకర్యాల కల్పన కోసం కొంత ప్రయత్నం జరిగింది. గ్రామాలకు రహదారులు, ఐ.టి. సౌకర్య విస్తరణ, టెలిఫోన్, ఫాక్స్, సెల్స్, ఉన్నత విద్యావకాశాల పెరుగుదల, బిజినెస్ స్కూల్ ప్రారంభం, ప్రైవేట్‌గా అనేక యాజమాన్య శిక్షణా సంస్థలు, హోటల్ పరిశ్రమ విస్తరణ, అంతర్జాతీయ విమానాశ్రయం లాంటి సౌకర్యాలు పెరిగాయి. సహజవనరులు వుండనే వున్నాయి. రాష్ట్ర ఖనిజ సంపదను పారిశ్రామికీకరణకు ఉపయోగిస్తున్న దాఖలాలు తక్కువ. హైటెక్ సిటీలోవి పరిశ్రమలు కావు. అవి సేవాసంస్థలు మాత్రమే. ఈ సిటీని చూపించి పారిశ్రామికీకరణ జరిగి పోతుందని ప్రజలను తప్పు దారి పట్టిస్తున్నారు. ఈ రంగంలో ఉద్యోగావకాశాలు పెరుగుతున్న విషయం కాదనలేని వాస్తవం. అయితే అది మధ్యతరగతిలోని ఉన్నత వర్గాలకే పరిమితం. ఉద్యోగాలు లభిస్తాయనే పారిశ్రామికీకరణ రెండవ లక్ష్యం నెరవేరే సూచన కనుచూపుమేరలో లేదు. విదేశీ పరిశ్రమలు వస్తే గిస్తే అత్యాధునిక యంత్రాలతో వస్తాయి కాబట్టి, అవి కల్పించే ఉపాధి అత్యల్పం. దేశీయ పరిశ్రమలు కూడా దేశంలోకి వచ్చే విదేశీ పరిశ్రమల నుంచి, అలాగే మనం ఎగుమతి చేసే దేశాల్లో పోటీ నుంచి తట్టుకోవాలంటే వారు కూడా ఆధునిక టెక్నాలజీని ఉపయోగించాలి. కాగా ఇక్కడ కూడా ఉద్యోగావకాశాలు పరిమితం. విద్యాధికుల్లో నిరుద్యోగం పెరగడం చూస్తే పారిశ్రామికీకరణ ఉద్యోగావకాశాలను కల్పిస్తుందనే భ్రమకు ఆస్కారం లేదు. పరిశ్రమలు నెలకొంటే అసంఘటిత కార్మికులకు ఉపాధి అవకాశాలు కలగవచ్చు (ఉదా: రవాణా, శారీరక శ్రమ చేసే శ్రామికులు). కానీ అవి ఆ పరిశ్రమలు ఉన్న ప్రాంతాలకే పరిమితం. వ్యవసాయంలో పెట్టుబడులు పెట్టకపోవడం వల్ల గ్రామీణ వ్యవసాయ కార్మికులు , పేదరైతులు పట్టణాలకు తరలి వస్తున్నారు. కొత్తగా శ్రమజీవుల వర్గంలో చేరే సంఖ్య పెరుగుతూనే వుంది. నైపుణ్యత కల కార్మికులకు ఉద్యోగావకాశాలు ఏర్పడవచ్చు. అయితే ఈ ఉద్యోగాలు కూడా పాలిటెక్నిక్‌లో - ఐటిఐలో శిక్షణ పొందినవారికే పరిమితం. ఈ ఉద్యోగాలన్నీ కలిపి చూసినా నిరుద్యోగం అనే సముద్రంలో ఈ ఉద్యోగావకాశాలు కాకి రెట్టంత. సదుద్దేశ్యంతోనే స్వయం ఉపాధి పథకం ప్రవేశపెట్టినా దానివల్ల బాగుపడింది కొద్దిమందే. మిగతాది పాలక పార్టీ శ్రేణులు నంజుకున్నాయి.

## బ్యూరాక్రసీ :

పారిశ్రామిక దీపం ఇలా కొడిగట్టడానికి బ్యూరాక్రసీ మరో కారణం. తమ రాజ్యం, అధికారం కొనసాగడం బ్యూరాక్రాట్ల లక్ష్యం. ప్రభుత్వ రంగంలో ఏర్పడే పరిశ్రమల యాజమాన్యాన్ని ఆ పరిశ్రమకు సంబంధించిన టెక్నాలజీలోని నిపుణులకు అందకుండా ఐఎఎస్ అధికారులే కబ్జా చేయడం, ఈ రెండు వర్గాల మధ్య నిప్పు రాజుకోవడం కొంత కాలం సాగింది. ఆఖరుకు ఐఏఎస్‌లే పైచేయి సంపాదించినట్లు తోస్తుంది. ఫైళ్ళలో కిందనుంచి పైకి, పై నుంచి కిందకి ప్రయాణిస్తుండాలి. కొర్రీలు వేస్తుండాలి. ఈ పద్ధతికి బానిసలైన ఉద్యోగులు, అధికారులున్నంత కాలం సింగిల్ విండో విధానం అమలు జరపడం అసాధ్యం. ఇదివరకు కాంగ్రెస్ హయాంలోనే సింగిల్ విండో పథకాన్ని ప్రారంభించారు. ముఖ్యమంత్రే నేరుగా ఈ విధానం అమలును పర్యవేక్షిస్తారని పారిశ్రామికవేత్తలకు హామీ ఇవ్వడం జరిగింది. కానీ ఎప్పటిలాగే సింగిల్ విండో అనేక విండోలు, డోర్‌లుగా తయారయ్యి పరిశ్రమల స్థాపనకు ముందుకు వచ్చినవారికి నిరుత్సాహం కలిగిస్తున్నారు. తాను సి.ఇ.వో.నని ఈ రాష్ట్రం హేపెనింగ్ స్టేట్ అని ప్రచారం జరిగింది. ఔత్సాహికులు వచ్చి చూస్తే అదంతా వట్టి ప్రచారమేనని, వాస్తవ పరిస్థితులకు సంబంధం లేదని గ్రహించారు. ఆ తప్పుడు ప్రచారం బెడిసికొట్టింది. 1991లో అనుకుంటా - ఏపిఐడిసి విలేకర్ల

సమావేశం జరిపి కొన్ని వివరాలిచ్చింది. 721 భారీ మధ్య తరహా పరిశ్రమల ఏర్పాటుకు ఐడిసి తోడ్పడింది, అందులో 173 మాత్రమే లాభాల బాటలో నడుస్తున్నాయని, 96 పూర్తిగా మూతపడ్డాయని, 105 పరిశ్రమలు బిఐఎఫ్ఆర్ తీర్పుకు ఎదురుచూస్తున్నాయని తేలింది. రాష్ట్ర పరిశ్రమల శాఖ 437 ఖాయిలా పడ్డ పరిశ్రమలను అధ్యయనం చేయగా, అందులో 196 పరిశ్రమలు కేవలం విద్యుత్ సమస్యల వల్ల మూసివేతకు గురయ్యాయని తేలింది. మొత్తం మీద తెలుగుదేశం పాలనలో ఉన్న పరిశ్రమలు మూతపడ్డాయి. కొత్త పరిశ్రమలు రాలేదు. భారీ పరిశ్రమలకే దిక్కు లేకుండా వుంటే చిన్న పరిశ్రమల గురించి ఏం జరుగుతుందో వేరే చెప్పాల్సిన అవసరం లేదు. ఇటీవల కొన్ని వెసులుబాటులు కలిగించినప్పటికీ వాటిని చిన్న పరిశ్రమల ముసుగులో వున్న భారీ పరిశ్రమలే భోంచేస్తున్నాయి. ఇన్ని వేలు, లక్షల చిన్న పరిశ్రమలు వున్నాయనే చెప్పే లెక్కలు కాగితాలకే పరిమితం.

ఈ జయాపజయాల నేపథ్యంలో కాంగ్రెస్ ప్రభుత్వం మళ్ళీ ఇప్పుడు అధికారంలోకి వచ్చింది. కొత్త పారిశ్రామిక విధానం ప్రకటించింది. కానీ అది కొత్త సీసాలో పాత సారాయే. ప్రోత్సాహకాలు, మినహాయింపులు, పన్నుల తగ్గింపులు, అంతా షరా మామూలే. పారిశ్రామిక వర్గాల్లో కొత్త ఉత్సాహాలు నింపిన దాఖలాలు లేవు. కార్ల పరిశ్రమ కోసం విశ్వ ప్రయత్నం జరిగింది, జరుగుతోంది. కార్ల పరిశ్రమ వస్తే దానికి ఉపాంగాలుగా అనేక చిన్న పరిశ్రమలు ఏర్పడతాయనేది వాస్తవం. కానీ ఆ ప్రాజెక్టు ఇంకా త్రిశంకుస్వర్గంలోనే వుంది. ప్రాగా టూల్స్‌కు కొత్త రక్తం ఎక్కిస్తున్నట్లు ఢిల్లీ వార్త. సింథటిక్ డ్రగ్స్ గురించి అలాంటి మాటలేవో వినపడుతున్నాయి. విశాఖకు రెండవ పరిశ్రమల కేంద్రంగా రూపొందించడానికి కావలసిన మౌలిక సౌకర్యాల కల్పన, పరిశ్రమలకు భూముల కేటాయింపులు జరుగుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. విద్యుచ్ఛక్తి మెరుగుపడింది. ఐటి రంగంలో కొన్ని చర్యలు తీసుకున్నారు. వేచి చూద్దాం.

వ్యవసాయరంగంలో పంటల మార్పిడి, వ్యాపార పంటలు, పళ్ళు, పూలపెంపకం గురించిన వార్తలు వింటున్నాము. ఇది ఆగ్రో ప్రాసెసింగ్ పరిశ్రమలు నెలకొల్పడానికి దారితీయాలి. కేంద్ర ప్రభుత్వం ఇందుకు అనేక రాయితీలిస్తుంది. ఇలాంటి పరిశ్రమలు సహజంగా పంటలు పండే ప్రాంతాలలోనే ఏర్పాటు చేయాలి కాబట్టి స్థానికంగా ఉపాధి అవకాశాలు పెరిగి పట్టణాలకు వలసలు తగ్గుతాయి. గ్రామీణ ప్రజల చేతుల్లో నాలుగు డబ్బులు పడితే అది పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడుతుంది.

డ్రగ్స్, ఫార్మాస్యూటికల్స్ రంగంలో ముఖ్యంగా బల్క్ డ్రగ్స్ రంగంలో దేశంలోనే రాష్ట్రం ప్రథమ స్థానంలో వుంది. కొన్ని సంస్థలు ప్రపంచంలోనే గుర్తింపు సాధించడం ఆంధ్ర ప్రజలకు గర్వకారణం. బహుళజాతి సంస్థల పాపిష్టి కళ్ళు పడకుండా జాగ్రత్త వహించాలి. బయోటెక్ పరిశ్రమ ఇప్పుడిప్పుడే తప్పటడుగులు వేయటం ప్రారంభించింది. విస్తృతంగా విస్తరించిన పరిశ్రమల్లో సిమెంట్ ఒకటి. అయితే ప్రయివేట్ రంగం పెద్ద ఎత్తున ప్రవేశించటంతో ధరలు పైపైకి దూసుకుపోయాయి. లక్షలు ఖర్చు పెట్టి విజన్ 2020 పత్రం తయారు చేయించారు. కానీ ఆ విజన్ అమలు విషయంలో ఆ పత్రాన్ని తయారుచేయించిన వారికే దానిని అమలు పరిచే విజన్ లేకుండా పోయింది. ప్రస్తుత ప్రభుత్వం ఆ విజన్ పత్రాన్ని రాష్ట్రాభివృద్ధిని కాంక్షించే ఆర్థిక శాస్త్రజ్ఞులు, యాజమాన్య నిపుణులు, ప్రజా ప్రతినిధులతో కూడిన ఒక కమిటీకి అందజేసి వాస్తవిక పరిస్థితులను దృష్టిలో వుంచుకొని మార్పులు చేసి అమలు పరచాలి. రాష్ట్రంలో అలాంటివారికి కొదవలేదు. మాజీ ముఖ్యమంత్రి సిఐఐతో కలిసి భాగస్వామ్య సదస్సులో పాల్గొని రాష్ట్రంలో పరిశ్రమలు పెట్టడానికి ఒప్పందాల మీద సంతకాలు చేసినా విదేశీ, స్వదేశీ పారిశ్రామికవేత్తలు ఏ కారణాల వల్లనయితేనేమి ఒప్పందాలను అమలుపరచలేదు. ప్రస్తుత ప్రభుత్వం వారందరితో, సిఐఐతో సంబంధం లేకుండా, నేరుగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, విద్యుచ్ఛక్తి సరఫరా, మౌలిక సౌకర్యాలు మెరుగుపడిన దృష్ట్యా, ప్రభుత్వం ప్రకటించిన సరికొత్త ప్రోత్సాహకాల దృష్ట్యా, సంతకాలు చేసిన ఒప్పందాలను అమలు పరచమని కోరాలి. రాష్ట్ర పారిశ్రామికీకరణను సాధించాలి. ❑

# ఆంధ్రప్రదేశ్‌లో విద్యుత్ రంగం అభివృద్ధి

ఎం.వేణుగోపాలరావు

ఆర్థికాభివృద్ధికి, ప్రజల జీవన ప్రమాణాల మెరుగుదలకు కీలక రంగాలలో ఒకటైన విద్యుత్ రంగం గత అర్ధశతాబ్ద కాలంలో రాష్ట్రంలో అంచెలంచెలుగా అభివృద్ధి చెందుతూ విస్తరించింది. అనేక ఒడిదుడుకులను ఎదుర్కొంటూ వచ్చింది. ప్రణాళికలలో ప్రభుత్వం విద్యుత్ రంగానికి ఇచ్చిన ప్రాధాన్యత, నిధుల కేటాయింపులలో కూడా హెచ్చుతగ్గులు ఉన్నాయి. విద్యుత్ ఉత్పత్తికి, ప్రసార, పంపిణీ వ్యవస్థల మధ్య సమతూకం పాటించటంలో కూడా ఒడిదుడుకులు ఏర్పడ్డాయి. 1990 దశకం నుండి ఉదారవాద సంస్కరణలలో భాగంగా విద్యుత్ రంగంలో ప్రారంభమైన ప్రపంచ బ్యాంకు ప్రేరేపిత సంస్కరణల అమలు, ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టులను అనుమతించి, వాటితో చేసుకున్న లోపభూయిష్ట, నష్టదాయక విద్యుత్ కొనుగోలు ఒప్పందాలు (పిపిఎ), విద్యుత్ చట్టం 2003, ఇతర సంబంధిత విధాన ప్రకటనలతో కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాలపై బలవంతంగా రుద్దుతున్న మార్పులు, విద్యుత్ ఉత్పత్తికి అవసరమైన ఇంధనాలకు సంబంధించి కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు కొత్త సమస్యలను తెచ్చిపెడుతున్నాయి. వినియోగదారులపై ఛార్జీల భారాన్ని, రాష్ట్ర ప్రభుత్వంపై సబ్సిడీ భారాన్ని పెంచుతున్నాయి. ఈ సమస్యలను, గతంలో చంద్రబాబునాయుడు ప్రభుత్వ కాలంలో జరిగిన తీవ్ర తప్పిదాలను సరిదిద్దేందుకు చేస్తున్న న్యాయపరమైన ప్రయత్నాలలో కాలహరణం, అనిశ్చితిని ఎదుర్కొంటూ, ప్రభుత్వ విద్యుత్ సంస్థల నిర్వహణ సామర్థ్యాన్ని, వినియోగదారులకు సేవలను మెరుగు పరిచేందుకు నిలకడైన ప్రయత్నాలు జరుగుతున్నాయి. భవిష్యత్‌లో పెరిగే విద్యుత్ డిమాండును తీర్చేందుకు అవసరమైన విధంగా మొత్తం విద్యుత్ వ్యవస్థ అభివృద్ధికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.



రాష్ట్ర ప్రణాళికా పెట్టుబడిలో విద్యుత్ రంగానికి మొదటి నుంచి ప్రాధాన్యత లభిస్తూ వచ్చింది. మొదటి ప్రణాళికలో (1951-56) మొత్తం వ్యయంలో విద్యుత్ రంగంలో జరిగిన వ్యయం 39.10 శాతం కాగా, నాల్గవ ప్రణాళికలో అది 42.46 శాతానికి పెరిగింది. ఈరంగానికి ప్రణాళికా కేటాయింపులు హెచ్చుతగ్గులకు లోనవుతూ, 7వ ప్రణాళిక (1985-90) నుండి (17.64 శాతం) తగ్గుముఖం పడుతూ వచ్చాయి. గత పదేళ్ళుగా ప్రభుత్వ విద్యుత్ సంస్థలు ప్రధానంగా అప్పులపై, తమ స్వంత వనరులపై ఆధారపడుతూ వస్తున్నాయి. వాటికి ప్రభుత్వం చేస్తున్న ప్రణాళికా కేటాయింపులు నామమాత్రంగా తయారైనాయి. విద్యుత్ వినియోగదారులకు భారీ సబ్సిడీకి ప్రభుత్వ కేటాయింపులు పరిమితం అవుతున్నాయి. 1959 ఏప్రిల్ మొదటి తేదీన ఏర్పడిన రాష్ట్ర విద్యున్మండలిని సంస్కరణలలో భాగంగా 1999 ఫిబ్రవరి 1న ఎపిట్రాన్స్‌కో, ఎపిజెన్‌కోలుగా విడగొట్టారు. ఆంధ్రప్రదేశ్ విద్యుత్ నియంత్రణ కమిషన్ 1999 ఏప్రిల్ 3న ఉనికిలోకి వచ్చింది. ఎపిట్రాన్స్‌కోను విడగొట్టి ఏర్పాటు చేసిన నాలుగు విద్యుత్ పంపిణీ కంపెనీలు ఇపిడిసిఎల్, సిపిడిసిఎల్, ఎన్‌పిడిసిఎల్, ఎస్‌పిడిసిఎల్ 2000 ఏప్రిల్ మొదటి తేదీ నుండి ఉనికిలోకి వచ్చాయి.

రాష్ట్రంలో విద్యుత్ స్థాపక సామర్థ్యం 1951లో 43.1 మె.వా. నుండి ప్రస్తుతం 11136.3 మె.వా.లకు పెరిగింది. ఇందులో ఎపిజెన్‌కో స్థాపక సామర్థ్యం 6550.9 మె.వా. (58.8 శాతం). జెన్‌కో స్థాపక సామర్థ్యంలో 3586.4 మె.వా.(55 శాతం) జల విద్యుత్ కాగా, మిగిలినది థర్మల్ విద్యుత్. జెన్‌కో జల విద్యుత్ స్థాపక సామర్థ్యంలో దేశంలో మొదటి స్థానంలోను, మొత్తం స్థాపక సామర్థ్యంలో మూడవ స్థానంలోను ఉంది. రాష్ట్ర విద్యుత్ స్థాపక సామర్థ్యంలో కేంద్ర విద్యుత్ స్టేషన్ల నుండి లభిస్తున్న వాటా 2649 మె.వా.(23.79 శాతం), ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టుల సామర్థ్యం 999 మె.వా.(8.97 శాతం), సంయుక్త రంగ ఎపిజిపిసిఎల్ 272 మె.వా.(2.44 శాతం), సంప్రదాయేతర ఇంధన వనరుల(ఎన్‌సిఇ) ప్రాజెక్టులు 562 మె.వా.(5.05 శాతం) కాగా, ఇతర ప్రాజెక్టుల సామర్థ్యం 101 మె.వా.(0.92 శాతం). ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో 720 మె.వా.(జివికె విస్తరణ 220 మె.వా., వేమగిరి మొదటి దశ 370 మె.వా., ఎన్‌సిఇ ప్రాజెక్టులు 130 మె.వా.) స్థాపక సామర్థ్యం అదనంగా చేరనున్నది. 2006-07లో 1525 మె.వా.(ఆర్‌టిపిపి రెండవ దశ 420 మె.వా., జూరాల 77.4 మె.వా., గౌతమి మొదటి దశ 464 మె.వా., కోనసీమ 445 మె.వా., ఎన్‌సిఇ ప్రాజెక్టులు 119 మె.వా.) అదనంగా చేరుతుందని అంచనా. పదవ ప్రణాళిక (2002-07) కాలం మొదటి మూడేళ్ళలో 2050 మె.వా. మేరకు స్థాపక సామర్థ్యాన్ని అదనంగా చేర్చగా, చివరి రెండేళ్ళలో 2245 మె.వా. సామర్థ్యం అదనంగా చేరనుంది. ఎన్‌టిపిసికి చెందిన

సింహాద్రి ప్రాజెక్టు (1000 మె.వా.) మొత్తం సామర్థ్యాన్ని రాష్ట్రానికే కేటాయింప చేయటం చంద్రబాబునాయుడు ప్రభుత్వం సాధించిన విజయం.

చంద్రబాబునాయుడు ప్రభుత్వం ఎపిజెన్‌కో కొత్త ప్రాజెక్టులను చేపట్టలేని పరిస్థితిని విధానపరంగా సృష్టించి, ప్రైవేటు ప్రాజెక్టులకు అనుచిత ప్రాధాన్యత ఇవ్వడం తీవ్ర సమస్యలకు దారితీసింది. ఆ తప్పుడు విధానంలో భాగంగా జెన్‌కోను నష్టాలపాలు చేయాలని విద్యుత్ బిజినెస్ ప్లాన్‌లో చంద్రబాబునాయుడు ప్రభుత్వం నిర్ణయించి, ఆ సంస్థకు విద్యుత్ విక్రయాలపై లాభం, ప్రోత్సాహకం, పూర్తి అరుగుదల ఛార్జీల రూపంలో మూడేళ్ళ కాలంలో రావాల్సిన దాదాపు రూ.1800 కోట్ల మొత్తం రాకుండా చేసింది. శ్రీశైలం ఎడమ గట్టు జల విద్యుత్ ప్రాజెక్టు (900 మె.వా.) నిర్మాణంలో తీసుకున్న తప్పుడు నిర్ణయాల వల్ల నివారించదగిన భారీ అదనపు వ్యయం జరిగి తీవ్ర నష్టం వాటిల్లింది. రాష్ట్రంలో కొనుగోలు చేస్తున్న మొత్తం విద్యుచ్ఛక్తిలో ఎన్‌సిఇ ప్రాజెక్టులతో సహా ప్రైవేటు ప్రాజెక్టుల నుండి కొనుగోలు చేస్తున్నది 13.48 శాతం కాగా, మొత్తం విద్యుత్ కొనుగోలు వ్యయంలో వాటికి చెల్లిస్తున్నది 23.05 శాతం. డిమాండు పెరుగుదలతో నిమిత్తం లేకుండా, గ్యాస్ లభ్యతపై అనిశ్చితి ఉన్నా 1499 మె.వా. సామర్థ్యంతో నెలకొల్పేందుకు చంద్రబాబునాయుడు ప్రభుత్వం అనుమతించిన నాలుగు గ్యాస్ ఆధారిత ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టులు పూర్తికానున్నాయి. ఇంధన సరఫరా ఒప్పందాల ప్రకారం గ్యాస్‌ను సరఫరా చేయలేమని కేంద్రప్రభుత్వం, ఒఎన్‌జిసి, గెయిల్ మొండికేయటంతో ఈ నాలుగు ప్రాజెక్టులకు విద్యుత్ ఉత్పత్తి చేయకుండానే ఏడాదికి రూ.1020 కోట్ల మేరకు పూర్తి స్థిర ఛార్జీలను చెల్లించాల్సిన ముప్పు పొంచి ఉన్నది.

గతంలో జరిగిన ఇలాంటి తీవ్ర తప్పిదాలన్నిటినీ సరిదిద్దేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ ప్రయత్నాలను అడ్డుకొనేందుకు గతంలో సచివాలయంలోని కొందరు బ్యూరోక్రాట్లు, ఇతరులు చేసిన ప్రయత్నాలు విఫలం కాగా ప్రజా ప్రయోజనాన్ని కాపాడే ప్రయత్నాలకు సామరస్య పూర్వక సమన్వయం లభిస్తున్నది. చంద్రబాబునాయుడు ప్రభుత్వ కాలంలో ప్రైవేటు విద్యుత్ ప్రాజెక్టులతో చేసుకున్న లోపభూయిష్ట, నష్టదాయక ఒప్పందాలు, వాటి అమలులో అవకతవకలు, ఇతర లోపాలను సంబంధిత అధికారులు తన దృష్టికి తేకపోయినా, మూడున్నర సంవత్సరాలుగా ఒకొక అంశాన్ని సమీక్షించి, అధ్యయనం చేసి, లోటుపాట్లను సరిదిద్దేందుకు రేచల్ ఛటర్జీ తీసుకొన్న చర్యలన్నిటిని సవాలు చేస్తూ ప్రైవేటు ప్రాజెక్టుల డెవలపర్లు న్యాయస్థానాలలో వివాదాలను నడుపుతూ స్టే ఉత్తర్వులను, మధ్యంతర ఉత్తర్వులను పొందుతున్నారు. 30కి పైగా అలాంటి కేసులు వివిధ న్యాయస్థానాలలో పెండింగులో ఉన్నాయి. ఈకేసులలో ట్రాన్స్‌కో విజయం సాధిస్తే విద్యుత్ కొనుగోలు వ్యయంలో వందల కోట్ల రూపాయలు ఆదా అయి వినియోగదారులకు ప్రయోజనం చేకూరుతుంది. పాత పిపిఎలను సవరించాలని కోరుతూ విద్యుత్ నియంత్రణ కమిషన్‌లో పిటిషన్లు దాఖలు చేస్తామని ట్రాన్స్‌కో చేసిన ప్రతిపాదనను ఆనాటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు తోసిపుచ్చారు. శాసనసభ ఎన్నికల ముందు ట్రాన్స్‌కో తనంత తాను చొరవ తీసుకుని కమిషన్‌లో పిపిఎల సవరణకు రివ్యూ పిటిషన్లను దాఖలు చేసింది. ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డి సచివాలయంలోని కొందరు అధికారులు తప్పుదోవ పట్టించటంతో గతంలో ఒకటి రెండు పొరపాటు నిర్ణయాలు తీసుకొన్నప్పటికీ, తరువాత ఆ పొరపాట్లను గ్రహించి ట్రాన్స్‌కో సరైన చర్యలతో ముందుకు సాగటానికి అనుమతించారు.

ఎపిజెన్‌కో ప్రస్తుతం మొత్తం 3196 మె.వా. సామర్థ్యంతో, రూ.14971 కోట్ల అంచనా వ్యయంతో 7 ప్రాజెక్టులను చేపడుతున్నది. వీటిలో ఆర్‌టిపిపి 2వ దశ, జూరాల (రాష్ట్ర వాటా117 మె.వా.), విటిపిఎస్ 4వ దశ (500 మె.వా.), భూపాలపల్లి థర్మల్ ప్రాజెక్టు (500 మె.వా.), నాగార్జునసాగర్ టెయిల్ పాండ్ డామ్ (2 × 25మె.వా.), కృష్ణపట్నం థర్మల్ ప్రాజెక్టు ( 2 × 800 మె.వా.), పోచంపాడు 2వ దశ (9మె.వా.) ఉన్నాయి. ఇవిగాక, 3728 మె.వా. సామర్థ్యంతో మరో అయిదు ప్రాజెక్టులను నెలకొల్పాలని జెన్‌కో ప్రతిపాదించింది. కొత్తగూడెం థర్మల్ ప్రాజెక్టు 6వ దశ (500 మె.వా.), గ్యాస్ ఆధారిత వేమగిరి (1400 మె.వా.), హైదరాబాద్ మెట్రో ప్రాజెక్టు(1400 మె.వా), దిగువ జూరాల జల విద్యుత్ ప్రాజెక్టు (6 × 40 మె.వా.), ప్రాణహిత (4 × 47 మె.వా.) వాటిలో ఉన్నాయి. విద్యుత్ ఉత్పత్తిలో అత్యధిక ప్లాంట్ లోడ్ ఫాక్టర్ (పిఎల్‌ఎఫ్)ను సాధించటంలో ఎపిజెన్‌కో దేశంలోనే ఉన్నత స్థానంలో ఉంటున్నది. జెన్‌కో ప్రాజెక్టులు రెండున్నర దశాబ్దాలకు పైగా జాతీయ స్థాయిలో అవార్డులను పొందుతున్నాయి. పాత థర్మల్ ప్రాజెక్టులను నవీకరించి, ఆధునికీకరించే (ఆర్‌అండ్‌ఎం) పథకాలను అమలు చేస్తున్నది. కెటిపిఎస్, విటిపిఎస్, ఆర్‌టిఎస్-బి ప్రాజెక్టులలో మొత్తం 9 యూనిట్లలో ఆర్‌అండ్‌ఎం పథకాలను రూ.387.32 కోట్ల వ్యయంతో అమలు చేయాలని జెన్‌కో ప్రతిపాదించింది. జెన్‌కో కొత్త ప్రాజెక్టులు చేపట్టేందుకు ప్రాధాన్యత ఇస్తామని రాజశేఖరరెడ్డి ప్రకటించారు. జెన్‌కో ప్రతిపాదించిన ప్రాజెక్టులను చేపట్టి, నిర్ణీత గడువులో పూర్తి చేయగలిగితే కొత్త ప్రైవేటు ప్రాజెక్టుల అవసరమే ఉండదు. ముఖ్యమంత్రి అదే అభిప్రాయంతో ఉన్నారు.

1951లో విద్యుత్ ఉత్పత్తి 104 మి.యూ. నుండి 2004-05లో 50959 మి.యూ.కి, విక్రయాలు 98 మి.యూ. నుండి 50558 మి.యూ.కి పెరిగాయి. మొత్తం వినియోగదారుల సంఖ్య 30 వేల నుండి గత జూన్ చివరి నాటికి 167.35 లక్షలకు, వాటిలో వ్యవసాయ సర్వీసుల సంఖ్య 620 నుండి 23.80 లక్షలకు పెరిగింది. డాక్టర్ రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయగానే వ్యవసాయానికి ఉచిత విద్యుత్ నిర్ణయం అమలుకు తొలి ఫైలుపై సంతకం చేశారు. తరువాత సవరించిన నిర్ణయం ప్రకారం దాదాపు 95 శాతం పంపుసెట్ల కింద వ్యవసాయానికి

50వ పడిలో ప్రవేశిస్తున్న ఆంధ్రప్రదేశ్

ఉచిత విద్యుత్ లభిస్తున్నది. వ్యవసాయ విద్యుత్ కనెక్షన్లలో రాష్ట్రం ఇప్పుడు దేశంలోనే ప్రథమ స్థానానికి చేరింది. తాను ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసేనాటికి రైతాంగం చెల్లించాల్సిన వ్యవసాయ విద్యుత్ ఛార్జీల బకాయిలను రూ.1200 కోట్ల మేరకు మాఫీ చేశారు. వ్యవసాయానికి రోజుకు కనీసం ఏడు గంటల పాటు విద్యుత్ సరఫరా చేస్తున్నట్లు, పంట పరిస్థితిని బట్టి పైర్లను కాపాడేందుకు అవసరమైనపుడు అదనంగా విద్యుత్ సరఫరా చేస్తున్నట్లు అధికార వర్గాలు చెప్పాయి. ప్రసార, పంపిణీ వ్యవస్థ రాష్ట్రమంతటా విస్తరించింది. సబ్‌స్టేషన్ల సంఖ్య గత జూన్ చివరి నాటికి 2831కు, పంపిణీ ట్రాన్స్‌ఫార్మర్ల సంఖ్య 421364కు చేరింది. 2004-05లో ప్రసార, పంపిణీ లైన్లు 738189.68 సర్క్యూట్ కిలోమీటర్లకు పెరిగాయి. అన్ని పట్టణాలు, గ్రామాల విద్యుదీకరణ పూర్తి కాగా, కుగ్రామాలు, గిరిజన కుగ్రామాలు, దళితవాడలు, బలహీన వర్గాల కాలనీలు కొంత మేరకు విద్యుదీకరించబడాల్సి ఉంది. గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ, వ్యవసాయేతర ఫీడర్లను వేరుచేసే కార్యక్రమం కొనసాగుతున్నది. అలా 5179 గ్రామీణ ఫీడర్లను వేరుచేసిన చోట గృహాలకు రోజంతా విద్యుత్ సరఫరా చేస్తున్నట్లు అధికార వర్గాలు తెలిపాయి. ఇందుకోసం 114 పట్టణ, 1121 మండల కేంద్రాల ఫీడర్లను గ్రామీణ ఫీడర్ల నుండి వేరుచేశారు. పరిశ్రమలకు నమ్మకమైన, నాణ్యమైన విద్యుత్ సరఫరా జరిగేటట్లు చూసేందుకు 933 పారిశ్రామిక ఫీడర్లను వేరుచేశారు.



2000-01లో దాదాపు 15 శాతం మేరకు భారీగా విద్యుత్ ఛార్జీలను పెంచటాన్ని వ్యతిరేకిస్తూ వామపక్షాలు, కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో మూడు మాసాలపాటు రాష్ట్ర వ్యాప్తంగా ప్రజలు చరిత్రాత్మక ఆందోళన చేశారు. 25,000 మందికి పైగా ప్రజలను ఆందోళన సందర్భంగా పోలీసులు అరెస్టు చేశారు. 2000 ఆగస్టు 28న బషీర్‌బాగ్‌లో పోలీసు కాల్పులలో, లాఠీఛార్జిలో ముగ్గురు యువకులు మరణించగా, వందలాది మంది గాయపడ్డారు. ప్రజాందోళన ఫలితంగా ఆ తరువాత సంవత్సరాలలో విద్యుత్ ఛార్జీలు భారీగా పెరగకుండా ప్రభుత్వం సబ్సిడీని సమకూరుస్తూ వచ్చింది. ఇంధన సర్‌ఛార్జి సర్దుబాటు (ఎఫ్ఎస్ఎ) కింద వ్యవసాయేతర వినియోగదారులపై అదనపు భారం పడుతూ వస్తున్నది. గత మూడేళ్లుగా విద్యుత్ ఛార్జీలను పెంచలేదు. హెచ్‌టి-1 కేటగిరి పారిశ్రామిక వినియోగదారులకు ఛార్జీలను గత ఆర్థిక సంవత్సరంలో 5 శాతం, ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో 4 శాతం మేరకు తగ్గించారు. ఈ కేటగిరి వినియోగదారులకు నిర్ణీత పరిమితికి మించి వాడే విద్యుత్‌పై ప్రోత్సాహకాన్ని ఇచ్చే పథకాన్ని ప్రస్తుత ఆర్థిక సంవత్సరం నుండి హేతుబద్ధం చేశారు.

ఈ విధానాల ఫలితంగా కాప్టివ్ విద్యుత్ బదులు పంపిణీ కంపెనీల నుండి పరిశ్రమలు విద్యుత్‌ను వినియోగించుకొనటం పెరిగింది. ఆమేరకు క్రాస్ సబ్సిడీ మొత్తం కూడా పెరిగింది. ఎపిట్రాన్స్‌కో, పంపిణీ కంపెనీలు అంతర్గత సామర్థ్యాన్ని పెంచుకొనటం, ప్రసార, పంపిణీ నష్టాలను తగ్గించుకొనటం, మీటరుతో కొలిచిన విద్యుత్ విక్రయాల శాతాన్ని పెంచుకొనటం, వసూళ్ళ శాతాన్ని పెంచుకొనటం, ప్రపంచ బ్యాంకు రుణంతో సహా అధిక వడ్డీ ఉన్న పాత అప్పులను తక్కువ వడ్డీకి పొందిన కొత్త అప్పులతో తీర్చివేయటం వంటి చర్యలతో భారీగా పొదుపు చేయగలిగాయి. మిగులు విద్యుత్‌ను వివేకవంతంగా ఇతర రాష్ట్రాలకు అమ్మటం ద్వారా ట్రాన్స్‌కో అదనపు ఆదాయాన్ని సాధించగలుగుతున్నది. ఇలా సాధించిన అదనపు ఆదాయాలను వినియోగదారులపై ఎఫ్ఎస్ఎ భారాన్ని, ప్రభుత్వంపై సబ్సిడీ భారాన్ని, అదనపు సబ్సిడీ భారాన్ని తగ్గించటానికి వినియోగించారు. ఏపి ట్రాన్స్‌కోతో పాటు నాలుగు విద్యుత్ పంపిణీ కంపెనీలు 2004-05లో లాభాన్ని ఆర్జించాయి. 2004-05లో క్రిసిల్ సంస్థ రేటింగ్‌లో దేశంలోనే విద్యుత్ రంగంలో రాష్ట్రం ప్రథమ స్థానంలో నిలిచింది. ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో భారీ వర్షాల వల్ల రిజర్వాయర్లు పూర్తిగా నిండి, సముద్రంలోకి నీరు వృధాగా పోతున్న పరిస్థితిలో తొలుత అంచనా వేసిన దానికన్నా మించి ఎపిజెన్‌కో అధికంగా జల విద్యుత్‌ను ఉత్పత్తి చేయడంతో గత ఏప్రిల్ నుండి సెప్టెంబరు వరకు జరిగిన విద్యుత్ వినియోగ ఛార్జీలలో రూ.220 కోట్ల మేరకు ఎఫ్ఎస్ఎ కింద వ్యవసాయేతర వినియోగదారులకు రాయితీ ఇవ్వాలని ఎపిట్రాన్స్‌కో మొదటిసారిగా ప్రతిపాదించింది. వచ్చే మూడేళ్ళలో విద్యుత్ ఛార్జీలను పెంచరాదని ముఖ్యమంత్రి నిర్ణయించినట్లు అనధికారికంగా ఆయన సన్నిహిత అధికారవర్గాలు ప్రచారం చేశాయి. ఈ నిర్ణయాన్ని అమలు చేసేందుకు ఉన్న అవకాశాలను వినియోగించుకొనేందుకు న్యాయస్థానాలలో వివాదాలు, కేంద్ర ప్రభుత్వ విధానాలు ఆటంకాలుగా ఉన్నాయి. వీటిని అధిగమిస్తూ, అవసరమైన సబ్సిడీని ప్రభుత్వం సమకూర్చాల్సి ఉంటుంది. అలాకాకుండా హేతువిరుద్ధమైన పద్ధతిలో ప్రభుత్వం తానివ్వాల్సిన సబ్సిడీని తగ్గించుకొనే రీతిలో వ్యవహరిస్తే విద్యుత్ సంస్థలు చిక్కుల్లో పడే పరిస్థితి తలెత్తుతుంది. వచ్చే ఆర్థిక సంవత్సరంలో ప్రభుత్వానికి ఇదొక సవాలుగా నిలవనున్నది. ❑

# వినియోగదారులకు విద్యుత్ సేవల మెరుగుదల

**రేచల్ ఛటర్జీ**

రాష్ట్రంలో విద్యుత్ వినియోగదారులకు సేవలను మెరుగు పరిచేందుకు అనేక చర్యలు తీసుకొంటున్నాము. రాష్ట్రంలో అన్ని మున్సిపాలిటీలలో, కార్పొరేషన్లలో గ్రామీణ ప్రాంతాలలో అన్ని సబ్ డివిజనల్ కార్యాలయాలలో 324 వినియోగదారుల సేవా కేంద్రాలను ఏర్పాటు చేశాము. విద్యుత్ సంస్థలు అందించే సేవల ప్రమాణాలకు సంబంధించి సిటిజన్స్ ఛార్టర్‌ను ప్రకటించాము. వాటిని అమలు చేయటం 97 శాతానికి పైగా చేరుకుంది. పట్టణ ప్రాంతాలలో 24 గంటలలో కొత్త సర్వీసు కనెక్షన్లను ఇస్తున్నాము. విద్యుత్ వినియోగదారుల బిల్లింగ్‌కు సంబంధించి వస్తున్న ఫిర్యాదులను 1104 మండలాలో నెలకొకసారి విద్యుత్ అదాలత్‌లను నిర్వహించి అక్కడికక్కడే పరిష్కరిస్తున్నాము. చెడిపోయిన పంపిణీ ట్రాన్స్‌ఫార్మర్లను సకాలంలో మార్చేందుకు వాటి మరమ్మతు కేంద్రాలను 85 నుండి 272కు పెంచాము. చెడిపోయిన ఈ ట్రాన్స్‌ఫార్మర్లను పట్టణ ప్రాంతాలలో ఆరు గంటలలో (నిర్వహణ ప్రమాణాల ప్రకారం 24 గంటలలో మార్చాలి) మారుస్తున్నాము. గ్రామీణ ప్రాంతాలలో ఈ ప్రమాణాల ప్రకారం 48 గంటలలో మారుస్తున్నాము. పరిశ్రమలకు అంతరాయం లేకుండా విద్యుత్ సరఫరాకు ప్రత్యేక పారిశ్రామిక ఫీడర్లను 933కు పెంచాము. గ్రిడ్ ఓల్టేజ్ 10 శాతం, గ్రిడ్ ఫ్రీక్వెన్సీ 49.93 హెర్ట్జ్‌కు మెరుగైనాయి. గట్టి పర్యవేక్షణ, మెరుగైన నిర్వహణ పద్ధతుల ద్వారా విద్యుత్ సరఫరాలో అంతరాయాలను, వైఫల్యాలను 9 శాతం మేరకు తగ్గించాము. ఇ-సేవా కేంద్రాల ద్వారా బిల్లు చెల్లింపులు పట్టణ వినియోగదారులకు ఎంతగానో సదుపాయంగా ఉన్నాయి. రాష్ట్ర వ్యాప్తంగా లోటెన్షన్ కేటగిరీ వినియోగదారులకు అక్కడికక్కడే బిల్లింగు జరుగుతున్నది. కీలక నిర్వహణ సూచికలను నియతకాలికంగా పర్యవేక్షిస్తూ, నిరంతర ప్రక్రియగా పనితీరును మెరుగు పరుస్తున్నాము.

2004-05లో మొత్తం పెట్టుబడి రూ.1717 కోట్లలో రూ.1040 కోట్ల మొత్తాన్ని గ్రామీణ ప్రాంతాలలో నమ్మకమైన, నాణ్యమైన విద్యుత్ సరఫరాను మెరుగుపరిచేందుకు, అదనపు లోడ్‌లను తీర్చేందుకు వాడాము. దేశంలోనే ఏ రాష్ట్రంలోనైనా గ్రామీణ ప్రాంతాలలో పెట్టిన అత్యధిక పెట్టుబడి ఇది. 2005-06లో ఎపిట్రాన్స్‌కో, నాలుగు విద్యుత్ పంపిణీ కంపెనీలు రూ.1295 కోట్ల పెట్టుబడి పెడుతున్నాయి. రాజీవ్ గాంధీ గ్రామీణ విద్యుత్ యోజన కార్యక్రమం కింద వచ్చే మూడేళ్ళలో మిగిలిన 43,36,635 గ్రామీణ గృహాలను, 13,013 నివాస ప్రాంతాలను, బలహీనవర్గాల కాలనీలను విద్యుదీకరించాలని, ఇందుకు అవసరమైన వ్యవస్థను పెంపొందించాలని ప్రతిపాదించాము. రాజీవ్‌గాంధీ గ్రామీణవిద్యుత్ యోజన కింద ఇందుకు రూ.802.57 కోట్ల పెట్టుబడి అవసరం.

హై ఓల్టేజ్ పంపిణీ విధానాన్ని (హెచ్‌విడిఎస్) రాష్ట్రంలోని వ్యవసాయ సర్వీసులన్నిటికి అమలు చేయాలని నిర్ణయించాము. లోఓల్టేజ్ పంపిణీ విధానం కింద ఉన్న 140749 వ్యవసాయ పంపుసెట్లను రూ.379.27 కోట్ల వ్యయంతో హెచ్‌విడిఎస్‌కు గత ఆర్థిక సంవత్సరాంతానికి మార్చాము. రాష్ట్రంలో మిగిలిన 18.74 లక్షల వ్యవసాయ పంపుసెట్లకు హెచ్‌విడిఎస్‌ను అమలు చేసేందుకు రూ.5651.48 కోట్ల వ్యయం కాగలదని అంచనా. 2005-06లో 3,50,183 వ్యవసాయ పంపుసెట్లను హెచ్.వి.డి.ఎస్.కు మార్చటానికి రు.797 కోట్ల పెట్టుబడి అవసరం. జపాన్ అంతర్జాతీయ సహకార బ్యాంకు (జెబిఐసి) నుండి ఈ పథకానికి రుణాలను పొందాలని ప్రతిపాదించాము. జెబిఐసితో ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి స్థాయిలో ఒకసారి చర్చలు జరిగాయి. ఈ ప్రాజెక్టుకు సంబంధించిన వివరమైన నివేదికను జెబిఐసికి పంపాల్సి ఉంది. మొదటి దశలో పశ్చిమ గోదావరి, చిత్తూరు, కడప, అనంతపూర్, మహబూబ్‌నగర్, నిజామాబాద్, నల్గొండ, కరీంనగర్ జిల్లాలలో 8.49 లక్షల వ్యవసాయ పంపుసెట్లకు రూ.2539 కోట్ల అంచనా వ్యయంతో 2007-08 కి మూడేళ్ళలో అమలు చేయాలని ప్రతిపాదించాము. ఆతరువాత మూడేళ్ళ కాలంలో శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, కరీంనగర్, మెదక్, రంగారెడ్డి, వరంగల్, ఖమ్మం, ఆదిలాబాద్ జిల్లాలలో 10.24 లక్షల వ్యవసాయ పంపుసెట్లకు రూ.3112.66 కోట్ల అంచనా వ్యయంతో అమలు చేయాలని ప్రతిపాదించాము.

హెచ్‌విడిఎస్ అమలు లక్ష్యం లో ఓల్టేజ్ వ్యవస్థను తొలగించి దాని స్థానంలో పెద్ద సంఖ్యలో వ్యవసాయ విద్యుత్ వినియోగదారులకు సరఫరా నిమిత్తం 25 కెవిఎ, 16 కెవిఎ ట్రాన్స్‌ఫార్మర్లను ఏర్పాటు చేసి నష్టాలను తగ్గించటం. ఈ ప్రాజెక్టు అమలు వల్ల ఏడాదికి వ్యవసాయానికి విద్యుత్ సరఫరాలో నష్టాల తగ్గింపు వల్ల రూ.294.81 కోట్లు, అనుమతి లేని వ్యవసాయ సర్వీసులను నిరోధించటం వల్ల రూ.294.81 కోట్లు, పంపుసెట్ల సామర్థ్యాన్ని మెరుగుపరచటం వల్ల రూ.77.29 కోట్లు, ట్రాన్స్‌ఫార్మర్ల వైఫల్యం తగ్గింపు వల్ల రూ.13.90 కోట్ల మేరకు మొత్తం రూ.1030.69 కోట్ల మేరకు ప్రయోజనం చేకూరుతుందని అంచనా.

హైదరాబాద్, సికిందరాబాద్ జంటనగరాలకు ప్రధానంగా రామగుండం లోని ఎన్‌టిపిసి ప్రాజెక్టు, కెటిపిఎస్, శ్రీశైలం, సింహాద్రి ప్రాజెక్టుల నుండి విద్యుత్ సరఫరా జరుగుతున్నది. జంటనగరాలలో పెరుగుతున్న విద్యుత్ లోడ్‌ను తట్టుకొనేందుకు, నాణ్యమైన విద్యుత్ సరఫరా చేసేందుకు ప్రసార, పంపిణీ వ్యవస్థను అభివృద్ధి చేసేందుకు ఒక పథకాన్ని రూపొందించాము.

( మిగతా 31 వ పేజీలో)

# ఆంధ్రప్రదేశ్‌లో ఐదు దశాబ్దాల బ్యాంకింగ్ ప్రగతి

బి. ఎర్రం రాజు

బ్యాంకుల ప్రగతి దేశ ఆర్థిక ప్రగతికి ప్రతీక. ఏభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్‌లో గరిష్ట అభివృద్ధి ఆదాయం రు. 799 కోట్ల నుంచి రు. 1,77,883 కోట్లకి పెరిగింది. తలసరి ఆదాయం రు. 250 నుంచి రు. 11,261 లకి పెరిగింది. వ్యవసాయ కూలీల దినసరి వేతనాలు పెరిగాయి. వ్యవసాయ పెట్టుబడులు పెరిగాయి. అయినా రైతుల ఆత్మహత్యలు రాష్ట్రాన్ని, నాలుగు సంవత్సరాల కరువు నేపథ్యంలో, వరసగా రెండేళ్ళు కుదిపేశాయి. ముప్పై శాతం చిన్న పరిశ్రమలు మూతబడే ఉన్నాయి. బయట తాపీ చేయించి గోడలకి సున్నం వేయించి చూపరులకి ఇల్లు అందంగానే కనిపించినా లోపల గోడలకి పెల్లలూడి పోతున్న రీతిలో రాష్ట్రం వుందా అనిపించవచ్చును. ఆర్థిక ప్రగతికి వూపిరి పోస్తున్న బ్యాంకుల పాత్ర ఏరకంగా వుంది అన్నది సమీక్షించడమే ఈ వ్యాసం లక్ష్యం.

1956-57 సంవత్సరంలో 258 బ్యాంకుశాఖలున్న మన రాష్ట్రంలో ఈ రోజు 5819 శాఖలున్నాయి. ఆ రోజు గ్రామీణ ప్రాంతాల్లో కేవలం 22 శాఖలుంటే ఈ రోజు గ్రామీణ ప్రాంతాల్లో 2829 శాఖలున్నాయి. సుమారు 73 శాతం గ్రామప్రాంతాల్లో నివసిస్తున్న మన రాష్ట్ర జనాభాకి ప్రతీ 19900 మందికి ఒక బ్యాంకు వుంటే పట్టణ ప్రాంతాల్లో ప్రతీ ఏడు వేల మందికి ఒక శాఖ వుంది. 1993 - 94 నాటికి నష్టాల వూబిలో వున్న బ్యాంకులన్నీ ముఖ్యంగా పబ్లిక్ రంగంలోనివి ఈ రోజు లాభాల్లోకి వచ్చాయి. సాంకేతికంగా ప్రైవేటు రంగ బ్యాంకుల కేమాత్రం తీసిపోమని పబ్లిక్ రంగ బ్యాంకులు కూడా టెలి బ్యాంకింగు, ఫోను బ్యాంకింగు, అన్ని వేళలా నగదు తీసుకునే ఎటిఎమ్ లూ పట్టణాలలో ఏర్పరిచారు. ఎన్నో రకాల పరపతి సౌకర్యాలను పట్టణ వాసులకి అందిస్తున్నా గ్రామీణులకి వ్యవసాయదారులకి ఇంకా సుదూరంగానే వున్నాయి.

దేశంలో బ్యాంకింగు రంగం ప్రస్తుత స్థాయికి మార్పు చెందక మునుపే 1983-84 సంవత్సరంలోనే 'క్రెడిట్ కార్డు' 'వీసా' కంపెనీతో విడుదల చేసిన తొలి బ్యాంకు ఆంధ్రాబ్యాంకు మన రాష్ట్రంలోనిదే. అలాగే బ్యాంకింగు సంస్కరణలు ప్రారంభించిన తొలి సంవత్సరం లో మొట్ట మొదటిగా ఏర్పడిన ప్రైవేట్ బ్యాంకు - రెండేళ్ళక్రితం మూసుకుపోయిందనుకోండి- దాన్ని కూడా మన రాష్ట్రంలోనే స్థాపించారు. అదే గ్లోబల్ ట్రస్ట్ బ్యాంకు. అలాగే మిగతా రాష్ట్రాల కన్నా మన రాష్ట్రంలోనే ఎక్కువ మంది వ్యవసాయదారులకి అప్పులిచ్చామని బ్యాంకులు చెబుతున్నాయి. ప్రపంచంలోని మొదటి వెయ్యి బ్యాంకుల జాబితాలో మన రాష్ట్రానికి చెందిన ఆంధ్రబ్యాంకు కూడా ఈ సంవత్సరం చేరడం గర్వించదగిన విషయం. మరి ఈ ఆంధ్రాబ్యాంకు నేతృత్వంలో రాష్ట్రంలో గల బ్యాంకులు వ్యవసాయక రాష్ట్రంగా పేర్కొనబడే మన రాష్ట్రంలో ఏ రకంగా సేవలందించారో చూద్దాం.

వ్యవసాయ రుణాల మొత్తం రాష్ట్ర గరిష్ట నికరాదాయంలో కేవలం 11 శాతం మాత్రమే ఇచ్చాయి. ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, అనంతపురం, కరీంనగర్, వెరసి ఏడు జిల్లాలలో (జిల్లాకు రు. 500 కోట్ల పైబడి) 52 శాతం వ్యవసాయ రుణాలు బట్వాడా అయ్యాయి. జిల్లాకి రు. 400 కోట్ల పై బడిన ప్రమాణంలో మరో ఆరు జిల్లాలు - నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, నిజామాబాద్, వరంగల్ కలిపితే బ్యాంకులు 80 శాతం వ్యవసాయ రుణాలు ఇక్కడ బట్వాడా చేశాయి. రిజర్వు బ్యాంకు నిబంధనల మేరకి అందించవలసిన ప్రాధాన్య రంగాల రుణాలలో 45 శాతం వ్యవసాయరంగాల కిచ్చినట్లుగా బ్యాంకుల లెక్కలు తెలుపుతున్నాయి. అయినా, శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, మహబూబ్‌నగర్, మెదక్, ఆదిలాబాద్, రంగారెడ్డి, ఖమ్మం జిల్లాలలో వ్యవసాయ రుణాలు పెంచ వలసిన అవసరం చాలా వుంది. ఈ జిల్లాలలో ప్రత్యామ్నాయ పంటలు వేస్తున్న రైతులు సకాలంలో సరియైన మేరకి రుణాలందట్లేదని వాపోతు న్నారు. బ్యాంకుల పరంగా చూస్తే వాణిజ్య పంటలవంటి ప్రత్తి, పొగాకు, మిర్చిలకు ఇచ్చిన రుణాలు రాని బాకీలవు తున్నాయని వాపోతున్నాయి. కారణం వాటికి మార్కెట్లో సరియైన ధర పలకక పోవడం, గిడ్డంగి సౌకర్యాలు లేక పోవడం, ఉన్న గిడ్డంగులలో పంటలు నిల్వ చేసుకోవడానికి బ్యాంకులు తగినంతగా రుణాలివ్వకపోవడం అటువంటి పరిస్థితికి దారితీయడం గమనించాలి.

ఏ బ్యాంకులయితే ప్రాధాన్య రంగాలకు నిర్దేశించిన రుణ పరిమితులని బట్వాడా స్థాయికి తీసుకెళ్లలేదో అవి 'నాబార్డు' (జాతీయ వ్యవసాయ గ్రామీణాభివృద్ధి బ్యాంకు) గ్రామీణ మౌలికాభివృద్ధి నిధులకు ఆ లోటు మేరకు తరలించ వచ్చునని రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా తీర్మానం చేసింది. అటువంటి గ్రామీణాభివృద్ధికి వెచ్చించే నిధులు వ్యవసాయాభివృద్ధికి, గ్రామీణాభివృద్ధికి తగిన మౌలిక సదుపాయాలేర్పరిచి వ్యవసాయ రుణాలు పటిష్టమయేటట్లు దోహదం చేస్తాయని అంచనా. గత ఎనిమిది సంవత్సరాలుగా 13700 ప్రాజెక్టులు ఆ కోవలో మంజూరయితే కేవలం 3627 ప్రాజెక్టులు మాత్రమే పూర్తయ్యాయి. మంజూరయిన సొమ్ము ఏ సంవత్సరమూ పూర్తిగా బట్వాడా అయిన పాపాన పోలేదు. ముఖ్యంగా గత రెండు సంవత్సరాలలో కేవలం 30 శాతం, 13వ శాతం మాత్రమే 'నాబార్డు' విడుదల చేయగలిగింది. ఇటువంటి ప్రాజెక్టుల ద్వారా సుమారు 13 లక్షల ఎకరాలు అదనంగా సాగులోకి వచ్చాయని నాబార్డు లెక్కలు చెబుతున్నా, ఈ అదనపు సాగుభూమికి, రుణాలందిన దాఖలాలు లేవు. అలాగే ఇటువంటి మౌలిక సదుపాయ అభివృద్ధి ప్రాజెక్టుల

50వ పడిలో ప్రవేశిస్తున్న ఆంధ్రప్రదేశ్

ద్వారా పెరిగిన జలవనరులను కూడా పూర్తిగా వినియోగించుకున్న దాఖలాలు లేవు. ఈ ప్రాజెక్టులకి నిధులు 'నాబార్డు' బట్వాడా చేసి 'నాబార్డే' ఈ నిధుల వినియోగాన్ని పర్యవేక్షించడం వలన అందులో లోటుపాట్లేమీ సామాజిక ఆడిట్‌కి అందవు.

ఈ సంవత్సరం నుంచి విధాన పూర్వక మార్పుల వలన, కౌలుదారులకు కూడా రుణాలందివ్వాలి. రైతు మిత్ర సంఘాల ద్వారా అందిస్తామని చెబుతున్నారు. అయితే ఈ రకమైన రుణాలకి వాణిజ్య బ్యాంకులు ముందుకు రావడం లేదు. పోతే రైతు గుర్తింపు చేసే కంప్యూటర్ గుర్తింపు కార్డులు ప్రభుత్వం ఇస్తే బ్యాంకులు ఇతోధికంగా వ్యవసాయరుణాలు అట్టి గుర్తింపువున్న రైతులకివ్వడానికి, గణాంక లెక్కలు సవ్యంగా అందించడానికీ వీలవుతుంది. ఈ గుర్తింపు కార్డులు మాగ్నెటిక్ టేప్‌లో ఆ రైతు పొలం విస్తీర్ణం, అది మెరక సాగులో వుందా, నీటి సాగులో వుందా, ఎటువంటి సేద్యపు నీరు వాడుతున్నారు, ఎటువంటి భూమిలో సాగుచేస్తున్నారు, ఎంతమంది కుటుంబ సభ్యులున్నారు వంటి విషయాలు పొందుపరిస్తే ఆ కార్డులోని వివరాలకనుగుణంగా అటు రుణాలందించవచ్చును, ఇటు రైతు తన సరుకుని మార్కెట్లో నగదుకి అమ్మకం చేయవచ్చును. కంప్యూటరీకరణలో ముందంజ వేశామని జబ్బలు చరుచుకుంటున్న మన రాష్ట్రంలో రైతులకి గుర్తింపు కార్డులిచ్చి ఆ రైతులకి సంస్థాగత రుణాలు ఇతోధికంగా ఇవ్వడానికి ఎందుకు ముందంజ వేయడం లేదో? ఏమో! లోగుట్టు పెరుమాళ్ళకెరుక.

రానున్న సంవత్సర కాలంలో బాసెల్-2 నిబంధనలు బ్యాంకింగ్ రంగంలో పెను మార్పులు తేనున్నాయి. హామీలు, పూచికత్తులు లేని రుణాలకు బ్యాంకులు మొగ్గు చూపితే అవి వాటి నియమిత వాటా ధనాన్ని లేదా కనీస క్యాపిటల్‌ని ఆ రిస్క్ మేరకు పెంచుకోవాలి. అట్టి రుణాలెక్కువ వ్యవసాయ లఘు పరిశ్రమ రంగాలలోనే వుండడంతో ఆ రంగాలలో రుణాలకి బ్యాంకులు బట్వాడాలు తగ్గించే ప్రమాదం పొంచి వుంది. ఈ రంగంలో నిరర్థక ఆస్తులు తగ్గించుకోవడం, తక్కువ క్యాపిటల్ వున్న చిన్న బ్యాంకులు సాంకేతిక వున్నతికి కావలిసినంత పెట్టుబడి పెట్టలేక పెద్దవాటితో విలీనమయ్యే అవకాశం వుంది. ఈ రకమైన సంస్థాగత మార్పుల ప్రభావం వ్యవసాయ లఘు పరిశ్రమ రంగాల అభివృద్ధిపై వక్రీకరించకుండా వుండాలంటే అటు రాష్ట్ర ప్రభుత్వం, ఇటు వ్యవసాయ దారులు వ్యూహాత్మకంగా ముందుకు సాగాలి.

(రచయిత శాండిల్య కన్సల్టెంట్స్ ప్రైవేట్ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టర్‌గా వ్యవహరిస్తున్నారు. బ్యాంకింగ్ రంగంలోనూ, ఆర్థిక రంగంలోనూ విశ్లేషకులు). ❑

---

*( 29 వ పేజీ తరువాయి)*

ఈ పథకం కింద ప్రతిపాదించిన సబ్ స్టేషన్లన్నీ జనసాంద్రత చాలా ఎక్కువగా ఉండి, తగినంత భూమి, ప్రసార లైన్లు వేయడానికి హక్కు పొందటానికి, అవసరమైన అనుమతులు పొందటానికి చాలా ఇబ్బందికరమైన ప్రాంతాలలో ఉన్నాయి. అందువల్ల, ఎస్ఎఫ్6 గ్యాస్ ఇన్సులేటెడ్ స్విచ్‌గేర్ (జిఐఎస్) 220 కెవి, 132 కెవి సబ్ స్టేషన్లను అండర్‌గ్రౌండ్ ఎక్స్ఎల్‌పిఇ కేబుళ్ళతో నిర్మించాలని ప్రతిపాదించాము. 220 కెవి సబ్ స్టేషన్లను ఎర్రగడ్డ, చిలకలగూడలలో, 132 కెవి సబ్ స్టేషన్లను బాల్కంపేట, పాటిగడ్డ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, మీర్ ఆలం ఫిల్టర్ బెడ్, మూసారాంబాగ్‌లలో నెలకొల్పాలని ప్రతిపాదించాము. వీటి అమలు వల్ల అదనపు విద్యుత్ విక్రయాలు, నష్టాల తగ్గింపు రూపంలో గణనీయంగా ప్రయోజనాలు చేకూరతాయి.

జంట నగరాలు, రంగారెడ్డి జిల్లాలలో ప్రసార వ్యవస్థ స్థాయిని పెంచేందుకు 400 కెవి రింగ్‌ను ఏర్పాటు చేయాలని ప్రతిపాదించాము. ప్రసార నష్టాలను తగ్గించేందుకు, ఓల్టేజ్‌ను మెరుగుపరచేందుకు, ఈ ప్రాంతంలో ప్రసార వ్యవస్థ భద్రత, విశ్వసనీయత కోసం ఈ పథకాన్ని చేపట్టాలని ప్రతిపాదించాము. ఆ పథకం కింద ఎద్దుమైలారం, మల్కారంలలో 400-220 కెవి సబ్‌స్టేషన్లు రెండింటిని ఏర్పాటు చేస్తాము. గజ్వేల్, మామిడిపల్లి లలో 400 కెవి సబ్ స్టేషన్ల వద్ద రెండు చొప్పున 400 కెవి బే ఎక్స్‌టెన్షన్లను ఏర్పాటు చేస్తాము. గజ్వేల్ నుండి ఎద్దుమైలారం వరకు (115 కిలో మీటర్లు), ఎద్దుమైలారం నుండి మామిడిపల్లి వరకు(74 కి.మీ.), రామగుండం నుండి ఘనాపూర్ వరకు, ప్రతిపాదిత మల్కాపూర్ సబ్ స్టేషన్‌కు (32 కి.మీ.) 400 కెవి లైన్లను వేయాలని ప్రతిపాదించాము. వీటికి రూ.437.73 కోట్ల వ్యయం కాగలదని అంచనా.

కొత్తగా వస్తున్న నాలుగు గ్యాస్ ఆధారిత విద్యుత్ ప్రాజెక్టులు కోనసీమ (445 మె.వా.), గౌతమి (464 మె.వా.), వేమగిరి (370 మె.వా.), జివికె 2వ దశ (220 మె.వా.)ల నుండి విద్యుత్‌ను తీసుకొనేందుకు షార్ట్ జెస్టేషన్ విద్యుత్ ప్రసార పథకం-2 ను చేపడతాము. ఈ పథకానికి రూ.324.37 కోట్ల వ్యయం కాగలదని అంచనా. విద్యుత్ ప్రసారం కింద, 15.99 మె.వా.మేరకు ప్రసార నష్టాల తగ్గింపు వల్ల ఏడాదికి ఈ పథకం వల్ల రూ.118.19 కోట్ల మేరకు ఆదాయం లభిస్తుందని అంచనా. ఈ పథకం కింద నున్న-శ్రీశైలం నుండి నరసాపురం 400 కెవి సబ్ స్టేషన్ వరకు 400 కెవి లైను, వేమగిరి-నరసారావుపేట 400 కెవి లైను (85 కి.మీ.), నరసారావుపేటలో 400-220 సబ్ స్టేషన్, వేమగిరి 400-220 కెవి సబ్ స్టేషన్ నుండి పవర్ గ్రిడ్ కార్పొరేషన్‌కు చెందిన గాజువాక-నున్న ఎల్ఐఎల్ఓ నిమిత్తం 400 కెవి లైను వేస్తాము. 220 కెవి వ్యవస్థ కింద నరసారావుపేట 400 కెవి నుండి 220 కెవి వరకు 8 కి.మీ. లైను, నరసారావుపేట 400 కెవి నుండి పర్చూరు 220 కెవి వరకు 55 కి.మీ. లైను, పర్చూరు నుండి పొదిలి వరకు 220 కెవి లైను (60 కి.మీ.), నరసారావుపేటలో, పర్చూరులో 220-132 కెవి సబ్ స్టేషన్లు రెండు, పొదిలి 220 కెవి సబ్ స్టేషన్ వద్ద 220 కెవి బే ఎక్స్‌టెన్షన్లు రెండు ఏర్పాటు చేస్తాము.వచ్చే మూడేళ్ళలో ఆ పథకాన్ని పూర్తి చేయాలని ప్రతిపాదించాము. పై మూడు పథకాలకు జెబిఐసి నుండి రుణాలను పొందాలని ప్రతిపాదించాము. ❑

# యాభై ఏళ్ళ సినిమా : కొంచెం సంతృప్తి, ఇంకొంచెం ఆందోళన

తమ్మారెడ్డి కృష్ణమూర్తి

వినోదం, విజ్ఞానం అందించాల్సిన సినిమా పరిశ్రమ, అలా సంవత్సరాలపాటు అందించి సమాజంలో తనవంతు పాత్ర నిర్వహించిన చిత్రపరిశ్రమ, నేడు అశ్లీలతకు, హింసకు నిలయమై పోతుంటే, దానిపై వేటు వేయాల్సిన సెన్సార్‌బోర్డు కత్తెర వేయకుండా కళ్లప్పచెప్పి చూస్తుంటే సినీపరిశ్రమలో షష్టిపూర్తి చేసుకొన్న నాలాంటి వారిని తీవ్ర మనస్తాపానికి గురిచేస్తుంది. ఇదివరకు అలాంటి చిత్రాలకు సినిమాహాలుకు కుటుంబ సభ్యులతో సహా వెళ్లినపుడే ఇబ్బంది పడాల్సివచ్చేది. కాని ఇపుడు ఇంట్లోనే టి.వి.ల్లో ఒక ఛానెల్ తర్వాత మరో ఛానెల్ అలాంటి సినిమాలు చూపిస్తుంటే పిల్లలు గుడ్లప్పచెప్పి చూస్తూంటే మనసు విలవిలలాడిపోతుంది. కొంతమంది బాధ్యతగల తల్లితండ్రులు ప్రయివేటు ఛానెల్స్‌ను నిలుపుదలచేసి, కేవలం ప్రభుత్వ ఆధ్వర్యంలోని దూరదర్శన్ ఛానల్ మాత్రమే వుంచుకొన్నా, ఆ ఛానెల్‌లోనూ అవే చిత్రాలను ప్రదర్శిస్తుంటే ఎవరిని నిందించాలి? ఈ విషయాన్ని తర్వాత చర్చించుకొందాం.

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ఏర్పడి 50 వ సంవత్సరంలో ప్రవేశిస్తున్న సందర్భంలో, వేడుకలు జరుపుకొంటున్న తరుణంలో కాసిన్ని మంచిమాటలు చెప్పుకొందాం.

1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడి హైదరాబాద్ రాజధాని అయింది కాని, సినిమా పరిశ్రమకు రాజధాని మద్రాసే. ఉమ్మడి మద్రాను రాష్ట్రానికి మద్రాసే రాజధాని కాబట్టి, సినిమా తీయడానికి కావాల్సిన హంగులు అక్కడే వుండడంతో తెలుగు పరిశ్రమ అక్కడే కాపురం ప్రారంభించింది. నిజానికి మొట్టమొదటి తెలుగు మూకీ చిత్రం 'భీష్మప్రతిజ్ఞ' 1922లో మద్రాసులోనే నిర్మించారు. ఈ పరిశ్రమకు ఆదిపురుషుడు రఘుపతి వెంకయ్యానాయుడు ఆ చిత్రాన్ని నిర్మించారు. అంటే తెలుగు రాష్ట్రం వయస్సు 50 ఏళ్లయితే తెలుగు సినిమా పరిశ్రమ వయస్సు 83 ఏళ్లు.

తెలుగు గడ్డమీద మొదటి మూకీ చిత్రం కాకినాడలో 'భక్తమార్కండేయ' నిర్మితమైంది. మొదటి టాకీ చిత్రం 'భక్తప్రహ్లాద'. ఇవన్నీ సినీ పరిశ్రమలో మొదటి మైలురాళ్లు అయితే, ఆ పునాదులు వేసిన సి.పుల్లయ్య, హెచ్.ఎం.రెడ్డి లను ఈ సందర్భంలో స్మరించుకోవాలి. ఆ తర్వాత ఆనాటి సాంఘిక దురాచారాలను ప్రతిబింబించే గృహలక్ష్మి, మాలపిల్ల, రైతుబిడ్డ లాంటి చిత్రాలను తదుపరి మైలురాళ్లుగా చెప్పుకోవచ్చు. ప్రజానురంజక చిత్రాలు జానపదచిత్రం పాతాళభైరవి, పౌరాణిక చిత్రం మాయాబజార్, సమస్యాత్మక చిత్రం రోజులుమారాయి, ప్రేమప్రధాన చిత్రాలు మల్లీశ్వరి, దేవదాసు లాంటి చిత్రాలను ఈ రోజున కూడా ప్రజలు చూస్తున్నారంటే, ఆదరిస్తున్నారంటే ప్రజల అభిరుచులు పవిత్రంగానే వున్నాయనుకోవాలి. ఇటీవలి కాలంలో నిర్మించిన శంకరాభరణం సినిమాకు కాసులవర్షం కురిసిందంటే, సంగీతమే ప్రధానంగా ఆ తర్వాత మరికొన్ని చిత్రాలు నిర్మించారంటే ప్రజల రసజ్ఞతకు చిహ్నంగా భావించాలి. సినీపరిశ్రమ రంగంలో అదొక స్వర్ణయుగం.

భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుతో కన్నడ, మలయాళ చిత్రాలు తమ రాష్ట్రాల్లోనే నిర్మించాలని అనుకొన్నట్లే కొంతమంది సినీరంగ ప్రముఖుల్లో తెలుగు సినీపరిశ్రమ కూడా హైదరాబాద్‌కు తరలి వెళ్లాలనే అభిప్రాయం మొగ్గతొడిగింది. కాని హైదరాబాద్‌లో స్టూడియోలు లేవే? ఈ లోటును సారథి ఫిలిమ్స్ అధినేత రామకృష్ణ ప్రసాద్ సారథి స్టూడియో నిర్మాణానికి నడుంకట్టి భర్తీ చేశారు. 1958లో అన్ని హంగులతో తయారైన సారథి స్టూడియోలో మొదటి చిత్రం తీసిన ఘనత నవశక్తి అధినేత పర్వతనేని గంగాధరరావుకు దక్కింది. తర్వాత సారథి బ్యానర్ కింద వరుసగా ఏడు చిత్రాలు, కొన్ని తెలుగు, తమిళ చిత్రాలు తీసారు. హైదారాబాద్ లో చిత్రాల నిర్మాణం ప్రారంభమైంది. కాని తారలు మద్రాసులోనే వుండిపోయి, షూటింగులకు వచ్చి వెళుతూండేవారు. ఈ రాకపోకలకు ఫుల్‌స్టాప్ పెట్టిన ఖ్యాతి ప్రముఖ నటుడు అక్కినేని నాగేశ్వరరావుకు దక్కింది. ఈ నిర్ణయం ప్రముఖ నిర్మాతలకు స్ఫూర్తినిచ్చింది. ప్రొడ్యూసర్ వై. రామకృష్ణ మొదటి స్టూడియోను నిర్మిస్తే, హైదరాబాద్‌కు నటులలో మకాం తరలించిన మొదటి నటుడు అక్కినేని నాగేశ్వరరావు. ఆయన తరలిరావడం ఫిలిం పరిశ్రమ హైదరాబాద్‌లో వేళ్లూనుకోవడానికి ప్రాతిపదిక అయింది. తనతో సినిమాలు తీసే నిర్మాతలంతా హైదరాబాద్‌లో సినిమాలు నిర్మిస్తేనే తాను నటించుతాననే షరతు విధించడంతో ఒకరి తర్వాత ఒకరు వచ్చి హైదరాబాద్‌లోనే తమ చిత్ర నిర్మాణాన్ని ప్రారంభించారు. ఆ తర్వాత ఎన్.టి.రామారావు ఎన్‌టిఆర్ ఎస్టేట్ సినిమా కాంప్లెక్స్, నాగేశ్వరరావు అన్నపూర్ణ స్టూడియోలు నిర్మించారు.

మెగాస్టార్ చిరంజీవి హైదరాబాద్‌కు రావడంతో మద్రాసు నుంచి సినిమా పరిశ్రమ తరలిరావటం పూర్తి అయింది.

సినీ పరిశ్రమ నగరంలో స్థిరపడడానికి ప్రభుత్వం తీసుకొన్న కొన్ని నిర్ణయాలు కూడా ఊతమిచ్చాయి. ఈ నిర్ణయాలకు ముఖ్యమంత్రి చెన్నారెడ్డి శ్రీకారం చుట్టారు. ఇక్కడ తీసిన నిర్మాతలకు సబ్సిడీలను ప్రకటించడంతో అనేక మంది ఇతర నిర్మాతలు కూడా నగరంలో స్థిరపడ్డారు. అలాగే ఈ పరిశ్రమలో పనిచేసేవారి నివాసం కోసం భూమిని తక్కువ ధరకు అమ్మటంతో ఫిలింనగర్ ఏర్పాటైంది. అలాగే స్టూడియోల నిర్మాణానికి కూడా భూమిని తక్కువ ధరకు ఇవ్వటం జరిగింది. మంచి చిత్రాలకు అవార్డులు ప్రతీ సంవత్సరం ఇస్తున్నారు. ఫిలిం డెవలప్‌మెంట్ కార్పోరేషన్ ద్వారా నిర్మాతలకు రుణాలు ఇవ్వటం జరిగింది. అనేక పరిశ్రమల్లో తండ్రుల తర్వాత కొడుకులే పరిశ్రమలకు చైర్మన్‌లుగా, మేనేజింగ్ డైరక్టర్లుగా బాధ్యతలు చేపట్టినట్లు సినిమా హీరోలుగా మారిన కొడుకులు రెండాకులు ఎక్కువే చదివినట్లుంది. వారి తండ్రులు పరిశ్రమలో ఇంకా నటిస్తుండగానే, తామూ నటించటం ప్రారంభించడమే కాదు, హీరోలైపోయారు. అయితే చాలామందిలో ఆనాటి హీరోలు, హీరోయిన్ల నటనాకౌశలం, హావభావాల ప్రకటన కనిపించదు. ఎంతసేపూ గ్రూప్ డాన్సులు, కౌగిలింతలు, ముద్దులు, అర్ధనగ్న ప్రదర్శనలు, హింస - ఇవే వారి ప్లస్ పాయింట్లు. ఇవి యువత మీద ఎటువంటి దుష్ప్రభావం కలిస్తాయో, నేటి సమాజంలో మనం చూస్తున్నాం. విద్యార్థినుల వెంటపడడం, అల్లరి పెట్టడం, మానభంగాలు, హత్యలు - వారి ప్రవర్తన హద్దులు మీరుతుంది. మేమేమైనా తక్కువా అన్నట్లు అక్కడక్కడ యువతులు, విద్యార్థినులు కూడా తమ వస్త్రధారణతో యువకులను రెచ్చగొడుతున్న సందర్భాలూ ఉన్నాయి.

## సినీమా ప్రొడక్షన్సుకు ఆర్థిక వనరులు :

ఆంధ్రప్రదేశ్‌లో డిస్ట్రిబ్యూషన్ కంపెనీలు సినిమా తీయడానికి ఆర్థిక వనరులు సమకూర్చేవి. పూర్ణా పిక్చర్స్, నవయుగ పిక్చర్స్, విజయా పిక్చర్స్, లక్ష్మీ ఫిల్మ్స్ - వాటి శాఖలను నైజాం, రాయలసీమ, ఆంధ్ర కేంద్రాలలో ఏర్పాటుచేసి తెలుగు సినిమాలను పర్సంటేజి పద్ధతిలో సినిమాహాల్సకు పిక్చర్స్ అందచేసేవి. అప్పటిలో అంటే, 1950 కి పూర్వం డిస్ట్రిబ్యూటరు 60 శాతం ఖర్చు భరించేవాడు, మిగతా 40 శాతం ప్రొడ్యూసర్ భరించేవాడు. పిక్చర్స్‌పై హక్కులన్నీ పెట్టుబడి తీరేవరకు డిస్ట్రిబ్యూటర్స్‌కే ఉండేవి. రానురాను సినిమా నిర్మాణపు ఖర్చు పెరిగిపోవడంతో ఆంధ్ర, సీడెడ్, నైజాములు విడివిడిగా డిస్ట్రిబ్యూటర్స్ తమ ఆధీనంలో ఉన్న సినిమా హాలు ద్వారా పంపిణీ చేసేవారు. 1950 కీ నేటికీ సినిమా నిర్మాణపు ఖర్చు దాదాపు 50 రెట్లు పెరిగింది. 1950 లో బ్లాక్ అండ్ వైట్ సినిమా 10 లక్షలతో తయారయ్యేది. ఈ రోజుల్లో బ్లాక్ అండ్ వైట్ పిక్చర్లు చలామణి కాక పోవడంతో అన్ని సినిమాలు కలర్‌లోనే నిర్మించబడుతున్నాయి. పెద్ద హీరోల పారితోషికాలు, పెద్ద దర్శకుల పారితోషికాలు, పెద్ద రచయితల పారితోషికాలు షుమారు 25 రెట్లు పెరిగినాయి. దానితోపాటు రాఫిల్మ్ రేటు, కాస్ట్యూమ్స్, సెట్స్ తదితర సాంకేతిక నిపుణుల రేట్లు విపరీతంగా పెరగడంతో ఒక పెద్ద హీరోతో తీసే పిక్చరు ఖరీదు ఆ రోజుల్లో సుమారు 25 లక్షలైతే ఈ రోజు 15 కోట్ల నుండి 20 కోట్ల వరకూ అవుతుంది.

అందువల్ల ఏ ఒక్క పంపిణీదారుడూ మొత్తం ఆంధ్రప్రదేశ్‌లో గాని, రాయలసీమలో గాని, తెలంగాణాలో గాని పంపిణీ చేయగల ఆర్థిక స్తోమత లేక జిల్లాలవారీగా కొనుగోలుదారులు, పంపిణీదారులు ఎంతోమంది పరిశ్రమలోనికి వచ్చారు. ఈ కొనుగోలుదార్లకు నిర్మాతలు తమచిత్రాలను తాకట్టు పెట్టి ఫైనాన్షియరు వద్ద అధిక వడ్డీకి అప్పులు సేకరించవలసి వస్తూంది. ఏ పిక్చరైనా రిలీజు కావాలంటే అధిక వడ్డీకి తెచ్చిన అప్పు తీర్చందే రిలీజు కాదు. దీనివల్ల ఇప్పుడు 150 నుండి 200 చిత్రాలు రిలీజు కాకుండా లేబరేటరీలలో పడిఉంటున్నాయి. సినిమా పరిశ్రమలో చిత్రాల విజయం శాతం ఎప్పుడూ 10 శాతం మాత్రమే. 10 శాతం పిక్చర్ల నిర్మాణపు ఖర్చులు వసూలు చేయగలుగుతున్నాయి. మిగతా 80 శాతం చిత్రాలు బాక్సాఫీసు వద్ద విఫలం కావడంతో కొన్ని వందలకోట్లు సినిమా పరిశ్రమ నష్టపడుతూంది. దీనితో చాలామంది నిర్మాతలు, కొనుగోలుదార్లు, పంపిణీదార్లు నష్టాల్లో కూరుకుపోవడం, వరుసగా చిత్రాలు నిర్మించే కంపెనీలు లేకుండా పోతున్నాయి. ఎప్పటికప్పుడు కొత్త నిర్మాతలు రావడం ఈ సాలెగూడులో పడడం జరుగుతూంది.

దీనికితోడు కొత్తగా వచ్చే నిర్మాతలకు నిర్మాణ అవగాహన లేకపోవడంతో, మాయాబజార్, మల్లీశ్వరి, మూగమనసులు, దేవదాసు, విప్రనారాయణ, శంకరాభరణం లాంటి కళాఖండాలు మళ్లీ మనం చూడలేని పరిస్థితులు వచ్చినాయి. ఇంగ్లీషు, హిందీ చిత్రాల ప్రభావం పడడంతో మన కర్నాటక సంగీతం గాని, హిందూస్థానీ సంగీతం గాని, పాటలలో మన సాంప్రదాయ బాణీలు గాని వినలేకపోతున్నాం. సాంకేతికపరంగా చూస్తే గ్రాఫిక్స్ కథలను డామినేట్ చేస్తున్నాయి. ఇది ఇంగ్లీషు పిక్చర్స్ ప్రభావమే.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడి 50 వ సంవత్సరంలో అడుగిడుతున్న సమయంలో సినిమా పరిశ్రమ మద్రాసు నుంచి హైదరాబాద్‌కు పూర్తిగా తరలిరావటం ఎంత సంతృప్తి కలిగిస్తుందో, గుణాత్మకంగా పడిపోతున్న విలువలు చూచి అంత ఆందోళన కలుగుతుంది. యువత కోరుతున్నారనే ముసుగులో అశ్లీల చిత్రాలు, ద్వంద్వార్థాలు, ఫైట్లు, డాన్సులు సందర్భశుద్ధి లేకుండా చిత్రీకరిస్తున్నారు. కాని నేడు వస్తున్న సినిమాలలో కేవలం పది శాతమే ఆర్థికంగా విజయవంతమవుతున్నాయన్న వాస్తవ నేపథ్యంలో చూస్తే, చిత్ర నిర్మాతలు చెపుతున్నది అవాస్తవమని స్పష్టమవుతుంది. అలాంటపుడుకాసులు కురిపించకపోతేమానె, కనీసం పెట్టుబడినైనా సంపాదించుకోలేని చిత్రాలు తీయడ మెందుకు? నిర్మాతలు పునరాలోచించుకొని, సమాజాన్ని, యువతను, సక్రమమార్గంలో నడిపించే చిత్రాలు, కుటుంబంతో సహా చూడగలిగే చిత్రాలు తీస్తారని ఆశిద్దాం. □

# మనకు తెలుగులో న్యాయం దొరకదు

మాడభూషి శ్రీధర్

తెలుగు భాష మాట్లాడే వారన్న పేరుతో సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించి యాభై సంవత్సరాలు పూర్తవుతున్నా, తెలుగు భాషకు నూరేళ్లు నిండే పరిస్థితి తెచ్చుకోవడం విచారకరమయిన పరిణామం. ఇన్నాళ్లూ సంస్కృతం అంతరిస్తున్న భాష అని చాలా మంది బాధపడ్డారు. ఇప్పుడు తెలుగుకూడా ఆ కోవకు చెందినందుకు ఇంకా బాధపడాల్సి ఉంటుంది. బడులలో వాడుకలలో కూడా నానాటికి తగ్గిపోతున్న తెలుగుభాషా ప్రాచుర్యాన్ని ప్రభువులు ఏమాత్రం పోషిస్తున్నారో, ప్రజలను ఏమాత్రం తెలుగులో ఆదుకుంటున్నారో తెలుసుకునే ప్రయత్నం ఈ వ్యాసం. భాషా దారిద్ర్యం దారుణంగా పెరిగిపోతున్నది. పాలకులు, శాసనసభలు, న్యాయస్థానాల్లో ఏ మాత్రం అర్థమయ్యే భాషలో చెప్తున్నారో మనం అంతా పరిశీలించుకోవలసిన అవసరం ఉంది.

## కార్యవర్గ ప్రభుత్వ పరిభాష

రాజభాష ఏదయినా, అధికార భాష ఏదయినా, ప్రజలకు వారి మాతృ భాషలో విషయాలు చెప్పడం ఒక కనీస అవసరం అన్న విషయం చదువుకున్న పెద్దలకు, చదువు వచ్చి రాజకీయాల్లో రాణించే నేతలకు తెలియకపోవడం ఒక వింత. మనకు ఆంగ్ల బానిసత్వం పోయినా ఆంగ్ల భాషా బానిసత్వం పోలేదు. ఆంగ్ల భాషనుంచి ఈ దేశానికి ఇంకా స్వాతంత్ర్యం రాలేదు. వస్తుందో లేదో తెలియదు. సొంతభాషా ఉద్యమాలను నడిపే వారు లేరు. చివరకు భాషను రక్షించుకోవడానికి ఏం చేయాలో వేరే భాషలో చెప్పే రోజులు దగ్గరలో ఉన్నాయనిపిస్తున్నది. ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగులో ప్రశ్నలు అడిగి లేదా తెలుగులో అర్జీపెట్టి తెలుగులో ఉత్తర్వులు సాధించే అవకాశం ఇంతవరకూ లేదని కేవలం ఒకే ఒక్కరు అడుగుతూ ఉంటారు. వారు అధికార భాషా సంఘం అధ్యక్షుల వారు మాత్రమే. మిగతా వారు అడగరు. వినని వారికి ఎవరడిగినా ఒకటే. కార్యాలయ భాష అయితే ఇంగ్లీషు లేదా ఉర్దూ అవుతుందేమో కాని అరుదుగా తెలుగు అనుకోవాలి.

## ఇక శాసనభాష

శాసన సభలో తెలుగులో చర్చలు జరుగుతున్నందుకు ప్రశ్నోత్తరాలు వస్తున్నందుకు మనమంతా సంతోషించాలి. కాని కొన్ని బిల్లులు, ప్రకటనలు, రిపోర్టులు,ఇతరత్రా అంశాలు తెలుగులో, ఇంగ్లీషులో ఇస్తుంటారు. చాలా మంది ఇంగ్లీషు కాపీలనే వాడుతుంటారు. రెండు భాషల్లో ప్రశ్నోత్తరాలు ఉన్నప్పటికీ మంత్రిగారు ఇంగ్లీషు ప్రతిని తీసుకుని, అనుబంధ ప్రశ్నలకు కూడా ఆంగ్లంలోనే సమాధానం ఇస్తున్నారు. ఆ మధ్య సి పి ఎం శాసనసభ్యుడు నర్రా రాఘవరెడ్డి మాత్రం తెలుగులో సమాధానాలకోసం పట్టువదలని విక్రమార్కుడిలా పోరాడుతూ ఉండేవాడు. నిజానికి నర్రా వారి పోరు పడలేకనే మంత్రిగా ఉన్న ఒకవూజీ రాజావారు తెలుగు నేర్చుకున్నారు. ఆయన్ను మెచ్చుకోవలసిందే. ఆయన తెలుగులో ఇచ్చే సమాధానం మెప్పించేట్టుగా ఉండేది. అనేకానేక రిపోర్టులు ఇప్పటికీ ఇంగ్లీషులోనే ఉంటాయి. అన్నింటిని తెలుగులోకి తర్జుమా చేయడం అసలు ఎవరితరమూ కాదు. చేయదలచిన వారు కూడా ఎవరూ లేరు. శాసనసభల్లో కనీసం తిట్టుకున్నాకొట్టుకున్నా తెలుగులో సాగిస్తున్నందుకు మనం సంతోషించాలి. కార్యవర్గ ప్రభుత్వ భాష, శాసనిక భాష ఇట్లా కొట్టుమిట్టాడుతుంటే న్యాయభాష ఎట్లా ఉందో చూడాలి.

తప్పు జరిగితే న్యాయం కోరుకునే ప్రజలు తమకు తెలిసిన భాషలో కోరుకునే అవకాశమే లేదు. అక్షరాస్యత అంతంతమాత్రంగా ఉండే మన ప్రజాస్వామ్యదేశంలో ఇంతకన్న అన్యాయమేమిటి? ఇక్కడ కోర్టుల భాష ఇంగ్లీషు. వాదోపవాదాలన్నీ ఇంగ్లీషులో జరుగుతూ ఉంటాయి. తీర్పులు చక్కగా వచ్చీరాని ఇంగ్లీషులోనే ఇస్తూ ఉంటారు. దాన్ని మనం లాయర్అని పిలుచుకునే న్యాయవాద మహానుభావులు తమకు తోచిన లేదా తెలిసిన రీతిలో క్లయింట్ అని ఇంగ్లీషులో పిలవబడే అమాయక న్యాయార్థి కి ఈ తీర్పుల సారం చెప్తూ ఉంటారు.

ఒకాయన కిందికోర్టులో ఓ పదేళ్లు గిరగిరా తిరిగిన తరువాత ఒక తీర్పు వచ్చింది. అదేమిటో లాయర్ గారు ఈ విధంగా చెప్తున్నారు. "అబ్బో మన కేసు చాలా గొప్పది యాదగిరీ... అందుకు జడ్జిగారన్నారు...అమ్మో ఈ కేసును నేను చేయలేను బాబోయ్...నా వల్లకాదు. ఇదేదో ఆ పెద్ద జడ్జిగారు రాజధాని నగరంలో చెప్పాల్సిందేనని వదిలేసాడు. మరింకేం చేస్తాం జడ్జిగారే అంతమాటన్న తరువాత మనం పెద్దకోర్టుకు పోకతప్పదు". సారాంశమేమంటే అతనికి వ్యతిరేకంగా తీర్పు వచ్చింది. అందుకు తనను అనుమానిస్తాడని లాయర్ గారు ఈ లౌక్యభాష వాడాడన్న మాట. న్యాయార్థి ఈ కోర్టులో ఓడిపోయాడు. న్యాయం కావాలనుకుంటే అప్పీలు చేసుకోక తప్పదు అన్న చిన్న విషయం చెప్పడానికి ఈ ప్రయత్నంచేసాడు. చదువు రాని వాడు. చదువు వచ్చినా తెలుగుమాత్రమే వచ్చి, ఇంగ్లీషు రాని వాడు ఆ లాయరుగారి మాట నమ్మి హైకోర్టు కు ఖర్చులకోసం మిగిలిన ఆస్తి కూడా అమ్ముకోవలసిందే.

చదువు వచ్చినా లా రాని వారిని ఏడిపించుకు తినే లాయర్లకు, చదువురాని న్యాయార్థి దొరికితే వాడి గతేమిటి? ఈ

గతి ఎవరివల్ల వచ్చింది. ఎందువల్ల వచ్చింది అని ఆలోచించుకోవాలి.

సుప్రీంకోర్టులో అధికార న్యాయభాష ఇంగ్లీషు. కనుక అన్ని పిటిషన్లు, వ్యవహారాలు ఇంగ్లీషులో జరగాల్సిందే. అంటే దీని అర్థం ఏమంటే వేరే భాషలో రాసిన అభ్యర్థనలకు దిక్కుమొక్కు ఉండదన్నమాట. తన మాతృభాషలో న్యాయం కోరే స్వాతంత్ర్యం ఈ స్వతంత్ర భారతీయుడికి లేదన్నమాట. ఇక మన రాజ్యాంగంలో గ్యారంటీ ఇచ్చుకున్న స్వాతంత్ర్యాల మాట ఎవరికి ఏ భాషలో చెప్పుకోవాలి?

**తెలుగులో మనకు రాజ్యాంగం లేదా?**

రాజ్యాంగం అంటే గుర్తుకు వచ్చే ముఖ్యమయిన అంశం తెలుగులో సమగ్రమయిన రాజ్యాంగం లేకపోవడం మరో అన్యాయ తార్కాణం. అధికారిక తెలుగు రాజ్యాంగం పుస్తకాన్ని మొదట్లో వేసారు. కాని అది దేవనాగరి లిపిలో ఉంది. అంటే ఇంగ్లీషులో ఒరిజినల్‌గా రాసిన రాజ్యాంగాన్ని తెలుగులోకి అనువదించినందుకు సంతోషించే అవకాశం చేజారిపోయిందన్న మాట. దాన్ని దేవనాగరి లేదా హిందీ లిపిలో చదువుకోవాల్సిందే నన్నమాట. అసలు మనరాజ్యాంగం గురించి మనం తెలుసుకోకపోతే మనం బాధ్యత కలిగిన పౌరుడిగా ఉండలేం. ఆ విధంగా ఉండలేకపోతే రాజ్యాంగానికే అర్థం ఉండదు.

చట్టాలకే చట్టమయిన రాజ్యాంగానికే మాతృభాషలో లేని భాగ్యం ఉంటే ఇతర చట్టాల గురించి ఆలోచించుకోవచ్చు. జనం గతి అంచనా వేసుకోవచ్చు. వినియోగదారుల చట్టం కూడా ఇంగ్లీషులోనే అన్వయిస్తారు. ఉత్తర ప్రత్యుత్తరాలు చాలా వరకు ఇంగ్లీషులోనే ఉంటాయి. బిల్లులు రసీదులు కూడా ఇంగ్లీషులోనే ఉంటాయి. ఇంగ్లీషు రాని వాడు వినియోగదారుడిగా ఉండే అర్హత కోల్పోతాడన్నమాట. ఎన్ని హక్కులు ఎలా భంగపడుతున్నాయో చూడండి. కనీసం ఆ విషయం కూడా తెలియదు.

కోస్తాలో కొన్ని జిల్లాల్లో లేదా కొన్ని తాలూకాల్లో కోర్టులు తెలుగులో తీర్పులు ఇచ్చేవి. తెలుగులోనే దావాలు పిటిషన్లు పడిన సందర్భాలు కూడా ఉన్నాయి. దస్తావేజులు, ఆస్తిపత్రాలు, తెలుగులోకొన్ని ఉన్నాయి. కాని ఆ పరిస్థితి అంతటా లేదు. తెలంగాణా కోర్టుల్లో ఆంగ్లమే రాజ్యం చేస్తూ ఉంటుంది. సాక్షుల విచారణ తెలుగులో జరుగుతుంది. అదీ విధిలేక. కాని వారు తెలుగులో చెప్పే వాంగ్మూలాలన్ని వెంట వెంట న్యాయమూర్తి గారో లేక న్యాయవాది గారో ఆంగ్లంలోకి అనువదిస్తుంటే టైపిస్టులు టకా టకా ఇంగ్లీషులో టైపు చేస్తుంటారు. అంతా టైపయిన తరువాత, ఇంగ్లీషులో ఉన్న దీన్ని నాకు అనువదించి చదివి వినిపించారు. నాకు అర్థంచేసారు. ఆ విధంగా అర్థమయిన తరువాత నేను చెప్పినదీ వారు రాసినదీ సరయిన విధంగా ఉందని నమ్మి ఈ సంతకం చేస్తున్నాను అని రాసిన వాక్యం కింద సంతకం చేస్తాడు. ఆ వాక్యం కూడా ఇంగ్లీషులో ఉంటుంది. కనీసం దాని అనువాద అర్థంకూడా ఆ సాక్షికి చెప్పరు. ఏ కోర్టులోనూ అతను చెప్పిన అంశాలను సరిగ్గా అనువదించామని ధృవీకరించే పరిస్థితే లేదు. అదేమిటో తెలియకుండానే సాక్షి సంతకం చేస్తాడు. దీనికి కారణం కోర్టుల్లో అంత సమయం లేకపోవడమే. కాని ఒకవేళ సాక్షి " ఆ హత్య నిందితుడు చేసాడు" అని చెప్తే, న్యాయవాది తనకు అనుకూలంగా "చేయలేదు" అని రాయించుకోగలిగితే ఎవరు ఆపగలరు? తను చెప్పిన సాక్ష్యం ఏ విధంగా రాసుకున్నారో తెలుసుకునే అవకాశమే లేకపోతే ఇక జనానికి జరిగే న్యాయం ఏమిటి?

తీర్పులన్నీ కూడా 90 శాతం ఇంగ్లీషులోనే ఉంటాయి. అందులో ఏముందో తెలుసుకోవాలంటే న్యాయార్థులు ఎవరి అనువాదం మీదో అన్వయం మీదో ఆధారపడాలి. దీనికి జవాబు ఏమంటే తెలుగు భాషకు మార్కెట్లో డిమాండ్ లేదు. కనుక వాడుకలో ఉండదు. దాన్ని గురించి అంతగా బాధపడి ప్రయోజనం ఏమిటి ప్రాక్టికల్ గా ఉండాలి అంటారు. అదీ ఇంగ్లీషులో చెప్తారు.

రాష్ట్ర జనాభాలో 60 శాతం మంది గ్రామాల్లో ఉంటున్నారు. వారి తగాదాలు, వివాదాలు, నేరాలు, వాటికి వారిచ్చే జవాబులు అన్నీ తెలుగులోనే ఉంటాయి. కాని కోర్టుల వ్యవస్థ వచ్చిన తరువాత అవన్నీ కోర్టు సరుకులుగా మారిపోయి, ఆంగ్లంలోనే జరిగి తీరాలనే ఆచారం నిలబడిపోయింది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఈ పరిస్థితిని మార్చాలని కేంద్ర స్థాయిలోగానీ, ఆయా రాష్ట్రాలలో గాని ప్రయత్నం జరగలేదు.

నిజానికి ఇంగ్లీషు వచ్చినా, లాయర్ల భాష 'లా' భాష రావడం కష్టం. ఇంగ్లీషులోనే ఉన్న 'లా' రహస్యాలు తెలియాలంటే పెద్ద లాయర్లను పట్టుకోవాల్సిందే. 'లా'ను మామూలు సీదా సాదా ఆంగ్లంలోకి మార్చాలనే వ్యవహార ఆంగ్ల భాషా ఉద్యమం కూడా ప్రస్తుతం 'లా' రంగంలో నడుస్తున్నది. ఇంగ్లీషులో న్యాయం అర్థంకాని అయోమయం. న్యాయశాస్త్రం ఒక అర్థం కాని గందరగోళం. న్యాయం ఏనాటికీ సామాన్యుడికి చేరువలోకి రాకుండా ఉండడానికి ఈ గందరగోళం ఒక సాధనం. ఆవిధంగానే భాషా పరమయిన అడ్డుగోడలు కూడా నిర్మితం కావడాన్ని ఎవరూ ఆపడం లేదు. భాష రాకపోవడం అనే ఒకే ఒక కారణం వల్ల తెలుగు వాడు ఏ ప్రజాస్వామ్యదేశంలోనూ ఏ పౌరుడూ గురికాని అయోమయానికి తద్వారా అన్యాయానికి గురవుతున్నాడు.

ఇంగ్లీషును పూర్తిగా తొలగించడం సాధ్యం కాదు. ఆ పని అనవసరం కూడా. కాని ఇంగ్లీషు రాని సామాన్యుడికి న్యాయం ఏవిధంగా అందిస్తారన్నది ప్రశ్న. సామాన్యుడు అన్యాయాల గురించి లేవనెత్తిన ప్రశ్నలను మీరు ఆ భాషలో వినకపోవడం వల్లనే అన్యాయాలను కోర్టుల ముందుకు తేవడానికి సామాన్యుడు వెనుకాడుతున్నాడు. కేవలం భాష కారణంగా కోర్టుల ముందుకు హక్కుల భంగంకేసులు, అన్యాయాల కేసులు, అధికారులు పౌరులమీద చేసే అత్యాచారాల ఫిర్యాదులు కోర్టుల ముందుకు రావడం లేదు. రావుకూడా. ఒకవేళ ఎవరయినా ఫిర్యాదు చేసినా ఆ తరువాత జరిగే పరిణామాలన్నీ అతనికి తెలియని భాషలో జరుగుతూ ఉంటాయి. రేప్‌కేసులో బాధితురాలి బాధలు న్యాయస్థానాల అధికార రాజ భాష తెలియనందున ఎంతగా సంక్లిష్టమవుతాయో వివరించడం కష్టం.

*(మిగతా 45 వ పేజీలో)*

# వావిలాల శతజయంతి: 'నా జీవితమే సందేశం'

వకుళాభరణం రామకృష్ణ

ఇది వావిలాల గోపాలకృష్ణయ్య శతజయంతి సంవత్సరం. అక్కడా ఇక్కడా ఒకటి రెండు సభలు జరిగాయి. అంతకుమించి ఎవరూ పెద్దగా పట్టించుకున్నట్టు లేదు. నిన్న మొన్నటిదాకా మనలో ఒకరుగా వుండి, అన్ని సామాజిక ఉద్యమాల్లో చురుగ్గా పాల్గొని, ప్రజాజీవనానికి దగ్గరగా, అందులో మమేకమై, తన వ్యక్తిగత జీవితాన్ని ఆదర్శంగా మలచుకొన్న వావిలాల గురించి జ్ఞాపకాలు ఇంకా పూర్తిగా మసకబారలేదు. సన్నగా, పీలగా, పొడుగూ, పొట్టీ గాకుండా, విశాల ఫాలభాగంతో, ముతక ఖద్దరు పంచ, ముడతలు పడ్డ ఖద్దరు చొక్కా, నీరుకావి పైపంచ, ఆకుచెప్పులు, చేతికి తగిలించుకున్న ఒక ఖద్దరు సంచితో, అతి సామాన్యంగా, నిరాడంబరంగా, సాదా సీదాగా వున్న వావిలాలను ఎవరైనా చూస్తే, ఆయనకొక 80 సంవత్సరాల నిండైన, సార్ధక రాజకీయ, సామాజిక జీవితం వుందని అనుకోరు. దేశంలో నగటు మనిషి ప్రతి రూపం వావిలాలది. ఆయన భావజాలానికి, కార్యరంగానికి కేంద్రబిందువైన దరిద్రనారాయణుడి ప్రతిబింబం వావిలాల రూపం. ఆ చిన్న సంచిలో ఒక జత బట్టలు. అవి వేసుకొని, ముందు కట్టుకొన్న బట్టలను తానే ఉతికి ఆరేసుకొని, మర్నాడు వాడుకొనేవాడు. జబ్బుతో మంచం పట్టి, చనిపోయేదాకా. నిరాడంబరత అభిలషణీయమే! ఎందరో నిరాడంబరులున్నారు సమాజంలో, అవసరం రీత్యా లేదా ఆదర్శపరంగా! కానీ, నిరాడంబరతకు తోడుగా సామాజిక బాధ్యత, పోరాటపటిమ, నాయకత్వం వహించగల శక్తి, సామర్థ్యాలున్నపుడే, ఆ నిరాడంబరతకు సార్థకత, ప్రత్యేకత, గుర్తింపు వుంటాయి. జీవితంలో ఎంత ఎదిగినా, సాంఘిక స్తోమత పెరిగినా, ఒదిగి వుండడంలోనే ఆదర్శాల పాటింపుకు రాణింపు లభిస్తుంది.



వావిలాల సుదీర్ఘ ప్రజా జీవితంలో 30 ఏండ్లు కాంగ్రెస్‌లో (జాతీయోద్యమంలో, అందులో భాగంగా కాంగ్రెస్ - సోషలిస్టు పార్టీలో 1942 దాకా), 6 సంవత్సరాలు కమ్యూనిస్టు ఉద్యమంలో (1948 దాకా), ఆ తర్వాత దాదాపు 40 సంవత్సరాలకు పైగా స్వతంత్రుడిగా వుండిపోయాడు. సహాయ నిరాకరణోద్యమంతో రాజకీయ జీవితం ఆరంభం. చిన్నతనం లోనే, 20 ఏండ్లు నిండకముందే, రెండుసార్లు జైలుకు వెళ్ళడం, గాంధేయ జీవన సరళిని అనుసరించడం జరిగిపోగా, పెళ్ళి ప్రస్తావన వచ్చినపుడు, తాననుసరించదల్చుకొన్న రాజకీయ జీవిత విధానం వల్ల, కాబోయే సహధర్మచారిణికి రాబోయే యిడుములను దృష్టిలో వుంచుకొని, పెండ్లికి నిరాకరించి, జీవితాంతం బ్రహ్మచారిగా వుండిపోయాడు వావిలాల. వివాహబంధం క్రియాశీల ప్రజా జీవితానికి ప్రతిబంధకం అవుతుందా కాదా అనే చర్చ అటుంచి, ఇది కచ్చితంగా గొప్ప వ్యక్తిపరమైన త్యాగమే! వావిలాల, అటు రాజకీయ పార్టీల్లో, లేదా ప్రభుత్వపరంగా పెద్ద పదవులెప్పుడూ ఆశించలేదు. సాధారణ చురుకైన కార్యకర్తగా వుండి పోయాడు. శాసనసభ్యుడుగా తప్ప. అయితే అధికార భాషా సంఘానికి మొదటి అధ్యక్షుడుగా నియమించబడినప్పుడు, తాను ఏవిధమైన జీతభత్యాలు తీసుకోననీ, కాబినెట్ మంత్రి హోదాలు అక్కర్లేదని చెప్పి, రైల్లో జనరల్ బోగీల్లోనే ప్రయాణించి, తాను విధించుకున్న కఠోర నియమ ఉల్లంఘన చేయలేదు. 14 మాసాల్లో 21 జిల్లాలు అవిశ్రాంతంగా పర్యటించి, తయారుచేసి, ప్రభుత్వానికి సమర్పించిన సుదీర్ఘ నివేదికలోని కొన్ని సిఫారసులు మాత్రం అమలు చేయగా, ఎక్కువ భాగం నేటికీ ఆచరణకు నోచుకోలేదు. ఆ రిపోర్టును తవ్వితీసి, మట్టి దులిపి, నేటికవసరమైన రీతిలో ఆ నివేదికలోని అంశాలపై చర్చ తీసుకోవాల్సిన అవసరం వుంది.

వావిలాల, 1952లో మొదటిసారి శాసనసభ్యుడిగా ఎన్నికయ్యాక (1978 దాకా శాసనసభ్యుడిగా కొనసాగాడు), తన ముందు కొన్ని లక్ష్యాలనుంచుకున్నాడు. నందికొండ ప్రాజెక్టు (నాగార్జునసాగర్) నిర్మాణం, తెలుగు అధికార భాష కావడం, విశాలాంధ్ర ఏర్పడడం, ప్రభుత్వం కల్పించే సౌకర్యాలు తీసుకోకపోవడం, తెలుగులోనే మాట్లాడడం మొదలైనవి. ఇందులో అన్నీ ఆయన జీవితకాలంలో సాఫల్యం చెందినవే అయినా, నాగార్జునసాగర్ ప్రాజెక్టు వచ్చినా, కృష్ణా నదీజలాల పంపకంలో, ఇవ్వాల్టికీ సిగపట్లు పడుతూనే వున్నారు. విశాలాంధ్ర ఏర్పడ్డా, అందులో ఆశించిన ప్రజారాజ్యం ఏర్పడనేలేదు. పైగా, ప్రాంతీయ అసమానతలతో, సమైక్యత బీటలువారే పరిస్థితులు, రాష్ట్రాన్ని ఇన్నేళ్ళూ ఏలిన పాలకులు కల్పించారు. ఇక అధికారభాష అమలు తీరు ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వుంది. ప్రభుత్వానికి దానిపై శ్రద్ధ వుండాల్సిన అవసరమేమీ లేదు, ప్రజల వద్దకు పాలన అనే శుష్క నినాదాలతో కాలం గడపడం తప్ప.

స్వాతంత్ర్యానంతర కాలంలో, వావిలాల రాజకీయ పక్షాలకు దూరంగా వున్నాడే కానీ, రాజకీయ, సాంఘిక ఉద్యమాలకు, ప్రజా సమస్యలకు ఏనాడూ దూరం కాలేదు. సారా ఉద్యమంలో ప్రముఖంగా పాల్గొన్నాడు. సారా నిషేధంలో ప్రభుత్వ ద్వంద్వ, కపట వైఖరులకు నిరసనగా, ప్రభుత్వాన్ని నిశితంగా విమర్శించి, ప్రభుత్వపరమైన కార్యక్రమాలకు, బాధ్యతలకు స్వస్తి చెప్పాడు. ప్రభుత్వ చిత్తశుద్ధిపై ఏమాత్రం నమ్మకం మిగిలి వుంటే, దాన్ని పోగొట్టుకొని, ప్రభుత్వ వైఖరుల పట్ల తీవ్ర వ్యతిరేకత చూపబూనుకున్నాడు.

వావిలాల జరిపిన కృషి, సాధించిన కార్యాలు, ప్రజాసేవ సరే! ఆయన మనకు మిగిల్చిపోయిన వారసత్వం యేమిటి ? వావిలాల స్మృతుల ఔచిత్యం ఏమిటి ? దీనికి సమాధానం, వావిలాల ఏ విలువల కోసం తన జీవితమంతా శ్రమించాడో తెలుసుకోవాలి. ఏ ఆదర్శాల కోసం తపించాడు ? అవి నెరవేరాయా? ఆర్థిక, సామాజిక అసమానతలు లేని సామ్యవాద సమాజం కోసం కలలు కన్నాడు. ఆ దిశలోనే తన భావజాలాన్ని మలచుకున్నాడు. జాతీయోద్యమంలో వుండి, గాంధేయ సిద్ధాంతాలకనుగుణంగా నడుచుకుంటూ, హరిజనుల దేవాలయ ప్రవేశ ఉద్యమంలో చురుగ్గా పాల్గొంటున్నప్పుడు, పేద ప్రజలు, 'దేవుడి సంగతి సరే, మా పొట్ట గురించి ఆలోచించారా' అని అమాయకంగా, సూటిగా ప్రశ్నించినపుడే, గాంధీ ఆర్థిక భావజాలం నుండి వావిలాల దూరం కాజొచ్చాడు. గాంధీ ధర్మకర్తృత్వ సిద్ధాంతం ధనికుల ప్రయోజనాలకే ఉపకరిస్తుందని నిర్ధారించుకొని, సామ్యవాద సిద్ధాంతాలవైపు ఆకర్షింపబడి, కాంగ్రెస్ - సోషలిస్టు ఉద్యమం లోకి వచ్చాడు. 1948 తర్వాత కమ్యూనిస్టు ఉద్యమం నుండి వేరుపడ్డా, ఎందరో మాజీ కమ్యూనిస్టులు అవలంబించిన కమ్యూనిస్టు వ్యతిరేకతకు భిన్నంగా, కమ్యూనిస్టు ఉద్యమానికి ఎల్లప్పుడూ సన్నిహితంగానే వుంటూ వచ్చాడు. ముందే చెప్పుకొన్నట్లు, విశాలాంధ్ర, నాగార్జునసాగర్ లాంటి అనేకానేక ప్రజా ఉద్యమాల్లో కమ్యూనిస్టు ఉద్యమంతో కలిసే పనిచేశాడు. శాసనసభలో, అన్ని ముఖ్య ప్రజా సమస్యల్లో వావిలాల ప్రజల పక్షానే నిలిచాడు. సోవియట్ యూనియన్ పతనమయ్యాక, సోషలిజానికి కాలం చెల్లిందన్న దుష్ప్రచారాన్ని తిప్పికొట్టాడు. సోషలిజం వైఫల్యం వస్తుతహ, సిద్ధాంతలోపం వల్ల కాదనీ, దాన్ని అమలుపరచిన తీరు, నాయకత్వం అవలంబించిన తప్పుడు విధానాల వల్లనేనని అభిప్రాయపడ్డాడు. మానవాళికి, ఎప్పటికైనా విముక్తి సోషలిజం లోనే వుందని విశ్వసించాడు. భారతదేశానికి సంబంధించినంతవరకూ, సోషలిస్టు సిద్ధాంతాలు ఇక్కడి పరిస్థితులకు తగ్గట్టుగా అన్వయించుకుని, ఆచరిస్తే విజయవంతమవుతాయని నమ్మాడు. "మార్క్స్ సూత్రాలు శాస్త్రీయమైనవి. సమస్త కళ్యాణానికి తోడ్పడతాయి. అందుకే అవి నన్ను ఆకర్షించాయని" చెప్పుకున్నాడు. నియమాలకు, క్రమశిక్షణకు, సమయపాలనకు కట్టుబడి జీవనం సాగించాడు వావిలాల. జీవనసరళిలో గాంధీతత్వం, రాజకీయ, ఆర్థిక అంశాల్లో సామ్యవాదం అని ప్రకటించిన వావిలాల, ఈ రెంటిమధ్య వైరుధ్యాన్ని చూడ నిరాకరించాడు. అందుకే రాజాజీ వావిలాలను 'ఖద్దరు కమ్యూనిస్టు' గా పిలిచేవారు. భగవంతుడి విషయంలో, ఆస్తి-నాస్తి విచికిత్సలో తనకు ఆసక్తి లేదని చెబుతూ, ఆధ్యాత్మిక విషయాలకంటే, తాత్వికచింతనపై శ్రద్ధ వహించేవాడు వావిలాల.

వావిలాల మనకు మిగిల్చిపోయిన వారసత్వంలో ముఖ్యంగా చెప్పుకోదగిన మరొక అంశం, ప్రజా సామాన్యంపై ఆయనకున్న చెక్కుచెదరని విశ్వాసం. ప్రజల్ని నిరంతరం చైతన్యపరిచే ప్రక్రియ ద్వారానే ఉద్యమాలను నిర్వహించ గలమనీ, ఆ క్రమంలోనే ఆశయసిద్ధికి చేరువవుతామనీ చెప్పారు. ఇందులో భాగంగానే యువతను ఉత్తేజపర్చాలనీ, వారిలో సామాజిక స్పృహ కలిగించి, సంఘటిత పరిస్తేనే కార్యసిద్ధి కలుగుతుందనీ భావించాడు. సమాజంలో రోజు రోజుకు పెరిగిపోతున్న నిరుద్యోగం, దారిద్ర్యం, వీటికితోడు అవినీతి, రాజకీయాల్లో ప్రవేశించిన అధికార వ్యామోహం, బంధుప్రీతి, అవకాశవాదం, ప్రజా వ్యతిరేకత చూసి యువత, నిరాశకూ, నిస్సహాయతకూ లోనవుతున్నారని గ్రహించి వావిలాల ఇలా అన్నాడు. "యువకులు నిరాశ చెందకూడదు. యువతరం ఎప్పుడూ ఆశావాదాన్ని వదిలెయ్యకూడదు. యువతరానికి ఎప్పుడూ నిర్మాణ దక్షత వుంటుంది. ..స్వార్థరహిత, త్యాగబుద్ధిని అలవరచుకొని, తమ ఆదర్శ జీవనం ద్వారా, ప్రజల సమస్యలను పరిష్కరించుకోవడం ఏమీ కష్టం కాదు". సామాజిక సమస్యల పరిష్కారంలో పడక కుర్చీ మేధావుల వైఖరిని నిశితంగా విమర్శించాడు వావిలాల. కేవలం ఆలోచిస్తూ, విశ్లేషిస్తూ కూచుంటే సరిపోదనీ, మేధావులు నిర్మాణాత్మక కృషిలో పాలుపంచుకోవాలనీ, అవకాశవాదాన్ని విడనాడాలనీ, సమాజాన్ని మార్చే దిశలో, విలువలు లుప్తమవుతున్న నేటి నేపథ్యంలో, వాటిని సంరక్షించే రీతిలో ఉద్యమాల్లో భాగస్వాములు కావాలని ఆశించాడు.

వావిలాల అనుసరించదగ్గ ఆదర్శంగా మాత్రమే మిగిలిపోయాడా? లేదు. సిద్ధాంతానికి, ఆచరణకూ వున్న తార్కిక సంబంధాన్ని పాటించి చూపాడు. తాననుసరించిన జీవన విధానం ద్వారా పొందిన మహత్తర నైతిక శక్తితో తన ఆశయాలకు పుష్టి చేకూర్చుకుని, వాటి అమలుకు నిరంతరం కృషి చేశాడు. ఆయన భావాలతో ప్రభుత్వాలు ఏకీభవించకపోయినా గౌరవించాయి. పూజ్యభావంతో చూశాయి. కొన్ని విషయాల్లో ఆయన సలహాలను పాటించాయి. ఒక్కో సందర్భంలో జంకాయి కూడా. మానవ పరిపూర్ణతకు వ్యక్తి స్వేచ్ఛ ముఖ్యమని నమ్మిన వావిలాల చివరకు వ్యక్తిమాత్రుడుగానే మిగిలిపోయాడనుకోవడానికి వీల్లేదు. వర్తమానంలో జరుగుతున్న రాజకీయార్థిక ఉద్యమాలతో మమేకం ఎందుకు కాలేకపోయాడన్న ప్రశ్నకు సమాధానం నేటి సంక్లిష్ట సామాజిక పరిస్థితుల్లోనే అన్వేషించుకోవాల్సి వుంటుంది. ❑

# పేదరిక నిర్మూలన : సామాజిక మార్పు

డా. ముదునూరి భారతి

ఆంధ్రప్రదేశ్‌లో అమలవుతున్న నూతన ఆర్థిక విధానాల మూలాన ప్రగతిపథంలో ముందుకు సాగిపోతోందని చెప్పటానికి ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, బయోటెక్నాలజీ, కంప్యూటర్‌రంగంలో పెరిగిపోతున్న ఉద్యోగ అవకాశాలు, ఆరోగ్యానికి కార్పోరేట్ హాస్పిటల్స్, ఎన్నో కొత్త కొత్త రంగాలలో దొరికే ఉద్యోగాలు ఉదాహరణగా ఉపయోగపడతాయి. మరొక ప్రక్క పెరుగుతున్న ధరలు, దారిద్ర్యరేఖకు దిగువ కుటుంబాలలో తగ్గని పేదరికం, ఆకలి చావులు, ఆత్మహత్యలు, నిరుద్యోగం మొదలైనవి కూడా ఎక్కువగానే ఉన్నాయనే అభిప్రాయం కూడా వుంది. అందుచేత అమలవుతున్న సంస్కరణలు, దాని వలన వస్తున్న పర్యవసానాల వల్ల ఈ సంస్కరణల మీద వ్యతిరేకత కూడా బలంగానే వినిపిస్తోంది. ఈ వైరుధ్యాన్ని సరిదిద్దడానికి పేదరిక నిర్మూలన పథకాలను చేపట్టి తెల్ల రేషను కార్డుల ద్వారా బియ్యం పంపకం, దీపం, ఆదరణ, మధ్యాహ్న భోజన పథకం వంటి ప్రణాళికలు అమలు చేయటం, స్వయం సహాయక సంఘాలను ప్రోత్సహించి కావలసిన సహాయం చెయ్యటం వంటివి గ్రామాలలో అమలు చేస్తూనే వున్నారు. వీటన్నింటివలన గ్రామాలలో చోటు చేసుకుంటున్న మార్పులను అవగాహన చేసుకునే ఉద్దేశ్యంతో శ్రీకాకుళంలో రెండు గ్రామాలను సందర్శించడం జరిగింది.

శ్రీకాకుళం అనగానే మనకు ఎన్నో జ్ఞాపకాలు వస్తాయి. ఇది ఆంధ్రప్రదేశ్‌లో బాగా వెనుకబడిన జిల్లాలలో ఒకటి అని, వ్యవసాయపరంగా చూస్తే సాగునీటి వసతి లేక పంటలు బాగా పండవని, పారిశ్రామికంగా వెనుకబడిన ప్రాంతమని, పేద కుటుంబాలు చాలా ఎక్కువగా ఉంటాయని ఒక అభిప్రాయం బలంగానే వుంది. కాకపోతే ఏ కారణంగానో గతంలో ఈ ప్రదేశానికి ప్రజలు వలస రావడం వల్ల అక్కడి గ్రామాల పేర్లు - కొత్తవలస, తగరపువలస, ఆముదాలవలస, రావివలస - సూచిస్తాయి. కానీ ప్రస్తుత పరిస్థితులలో దీనికి విరుద్ధంగా కోస్తా ప్రాంతంలోనూ, పక్కనే ఉన్న పట్టణాలలోనూ రిక్షా తొక్కేవాళ్ళు, సీజన్‌లో మామిడి, జామ లాంటి పండ్లు అమ్మే చాలామంది ఆడవాళ్ళు ఈ ప్రాంతం నుంచే వస్తారు. ఒరిస్సా లాంటి పక్క రాష్ట్రంలో తోటకూలీలు ఈ ప్రాంతం నుండి వచ్చినా కూడా తమ గ్రామంతో సజీవ సంబంధం ఉంచుకున్నవాళ్ళే. ఇలా చూస్తే ఇక్కడి గ్రామాల నుంచి బయటికి వలసపోవడం జరుగుతోంది. ఇంక సాయుధ రైతాంగ పోరాటం అనగానే ఒక నక్సలైటు ఉద్యమం, దానిలో ఒక శ్రీకాకుళపోరాటం, అందులో పాల్గొన్న ఒక సత్యం మాస్టారు, పాటలుపాడే సుబ్బారావు పాణిగ్రాహి, పంచాది నిర్మల కృష్ణమూర్తి దంపతులు ఇప్పటికీ అక్కడి ప్రజల మనస్సులో మెదులుతూనే ఉన్నారని చెప్పటానికి సాక్ష్యంగా అమరవీరుల స్మృతిలో కట్టిన ఎర్రని స్థూపాలు కనిపిస్తాయి. మరి స్వాతంత్ర్యసమరంలో మేము కూడా ముఖ్య పాత్ర నిర్వహించామని చెప్పటానికి గాంధీగారు ఒక జాతీయ చిహ్నంగా తీసుకుని ప్రోత్సహించిన రాట్నం, దానితో తయారైన పొందూరు ఖద్దరు, దీనికి కావలసిన సాంకేతిక నిపుణతని అందించిన చేనేత పనివాళ్ళు ఈ ప్రాంతానికి చెందినవాళ్ళే. వ్యాపారపరంగా చూస్తే ఇక్కడి జీడిపప్పు ప్రశస్తి అందరికీ తెలిసిందే. పాపపుణ్యాల మీద నమ్మకం ఉన్నవాళ్ళకి ఇక్కడ పుణ్యతీర్థాలకి లోటులేదు. శ్రీముఖలింగం (శివుని లింగం మీద కళ్ళు, ముక్కు, నోరు ఉన్న ఏకైక రూపం), అరసవిల్లి (సూర్యదేవుడికి పూజలు జరుగుతున్న దేవాలయం, ఇంకొక సూర్యదేవాలయం కోణార్క్‌లో ఉన్నా కూడా అది పర్యాటక స్థలంగా మారిపోయింది) , శ్రీకూర్మం (విష్ణువు దశావతారాలలో ఒకటైన తాబేలు రూపంలో పూజలందుకొంటున్న ఒకే ఒక ఆలయం) ఈ ప్రాంతంలోనే ఉన్నాయి. సాహితీపరంగా కూడా ఈ ప్రదేశం ప్రాచుర్యం పొందడానికి కాళీపట్నం రామారావుగారు రాసిన 'యజ్ఞం' కథకి నేపథ్యం ఈ ప్రాంతానిదే. ఒక గ్రామంలో 'అభివృద్ధి' కోసం చేసే ప్రయత్నాలు, దానివలన గ్రామంలో నష్టపోయిన ప్రజల జీవితాలను ప్రతిబింబిస్తుంది 'యజ్ఞం' కథ. ఈ కథ సాహిత్యలోకంలో లేవదీసిన చర్చలు కథకుడిగా రామారావుగారి గొప్పదనం చెప్పడమే కాకుండా, అమలవుతున్న అభివృద్ధి పథకాలు, అవి గ్రామాలలో తీసుకొస్తున్న మార్పులు, ప్రజల జీవితాలపై వాటి ప్రభావం మీద కూడా ఒక విమర్శనాత్మక వ్యాఖ్య. శ్రీకాకుళం చూపించే ఇన్ని వైరుధ్యాల నేపథ్యంలో ఇక్కడి రెండు గ్రామాలలో ఉన్న రెండు ఎస్.సి. కాలనీలను చూడటం జరిగింది.

శ్రీకాకుళం గురించి మనకు తెలిసిన సమాచారం ఆధారంగా రెండు కాలనీల గురించి ముందుగా ఊహించే ప్రయత్నం కొంత నిరుత్సాహాన్ని, నిరాసక్తతని కలిగించాయి. వ్యవసాయపరంగా, పరిశ్రమల ఆధారంగా బాగా వెనుకబడిన ప్రాంతం అవటంతో ఈ కాలనీలలో పేద కుటుంబాలు అధిక సంఖ్యలో ఉంటాయనే ఒక భావన వస్తుంది. అందుచేత ప్రభుత్వమే కాకుండా 'వెలుగు' సంస్థ కూడా ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకుని ఎన్నో పేదరిక నిర్మూలన కార్యక్రమాలు చేపట్టాయనిపిస్తుంది. వెనుకబడిన ప్రాంతం, అందులోనూ ఎస్.సి. కాలనీ అంటే ఇవి గ్రామానికి దూరంగా వుంటాయనీ, పారిశుధ్యం తక్కువగా ఉంటుందేమో అని కూడా అనిపిస్తుంది. పేదరికం గుర్తుగా అక్కడ ఉండే మనుషులకు ఒంటినిండా బట్టలు వుండవని, శుభ్రం తక్కువగా ఉంటుందనీ, పిల్లల స్థితి మరీ అధ్వాన్నంగా ఉంటుందనీ, కొత్తవాళ్ళతో మాట్లాడే ఆసక్తి వుండదని, చేతినిండా పనులు లేక బద్ధకంగా కాలం గడిపే మనుషులు

ఉండవచ్చునని కూడా అనిపించింది. నాకు అప్పటికే శ్రీకాకుళం గురించి తెలిసిన సమాచారాన్ని క్రోడీకరించగా నా మనస్సులో ఏర్పడిన ఊహాచిత్రం ఇది. మొక్కుబడిగా కాలనీలను చూసి నా ఊహాచిత్ర పటంలోనే ఈ రెండు కాలనీలను లొకేట్ చేసే ప్రయత్నంలో అక్కడికి వెళ్ళడం జరిగింది. అంతేకాకుండా వెనుకబాటుతనం కారణంగా మనలను ఏం సహాయం చెయ్యమని అడుగుతారు ? ఏమీ చెయ్యకపోతే మీతో మేము ఎందుకు మా గురించి వివరాలు చెప్పాలి ? అంటారేమో అనే సంశయం కూడా లేకపోలేదు. ఇలా ముందుగానే తయారయిన ఒక ఊహాజనిత చిత్రపటం ఆధారంగా రెండు కాలనీలను చూడటం జరిగింది. ఈ క్రమంలో నాకు వచ్చిన విజువల్ ఇంప్రెషన్స్ (అనుభూతులు), వాళ్ళతో కబుర్లు చెప్పినపుడు తమ గ్రామంలో వస్తున్న మార్పుల మీద వాళ్ళకి ఉండే అవగాహన, ఆ మార్పులు వచ్చే క్రమం మీద వాళ్ళకి ఉండే పట్టు - అంటే నేను చూసినవి, విన్న తరువాత నాకు కలిగిన అవగాహన ఈ వ్యాసానికి ఆధారం. మామూలుగా వాడుకలో ఉండే ప్రశ్నావళి, సర్వే సమాచారం, కుటుంబాల నుండి సేకరించిన సమాచారం, స్టాటిస్టికల్ టెస్ట్స్, ఇన్‌ఫరెన్స్ టెక్నిక్స్‌తో ముడిపడకుండా ఇంద్రియ అనుభూతుల ద్వారా నాకు వచ్చిన అవగాహన ఇది. అతి సమీపంలో ఉండే రెండు కాలనీలు ఒకటి నా ఊహాచిత్రానికి సరితూగేదయితే నా ఊహాచిత్రాన్ని పూర్తిగా చెరిపివేసేది మరొక కాలనీ. ఈ రెంటి నేపథ్యంలో ఈ మార్పులను మనం అవగాహన చేసుకొనే చట్రం తయారుచెయ్యటమే ఈ వ్యాసానికి ప్రేరణ.

శ్రీకాకుళంలో బొంతలకోడూరు రెవెన్యూ గ్రామంలో ఉండే ఎస్‌సి కాలనీ మన మొదటి గ్రామం. ఇది ప్రధాన రహదారికి 12 కి.మీ దూరంలో చిన్న ఏటి పక్కగా ఉండే కాలనీ. బస్సు సౌకర్యం తిన్నగా లేకపోయినా దగ్గరి గ్రామం వరకు బస్సు మీద వచ్చి 2 కిమీ కాలినడకన కాలనీని చేరుకోవాలి. కాలనీని చేరిన వెంటనే మనకు కనిపించేది ఆ కాలనీలో ఉండే పాఠశాల. ఈ రెండు గదుల ఇల్లు పిల్లలు చదువుకునే బడి అనవచ్చును. బయటినుండి అధికారులెవరైనా వస్తే గ్రామ ప్రజలతో సమావేశమయ్యే కమ్యూనిటీహాలు అని కూడా అనవచ్చును. కొత్తగా గ్రామానికి వచ్చే వ్యవసాయ పరికరాలు వగైరా ఉంచుకునే స్టోరు హౌస్ అనవచ్చును. ఇలా బడి వివిధ రకాల కార్యక్రమాలకు కేంద్రస్థానమవుతుంది. ఇక్కడ రమారమి ముప్పై ఎస్‌సి కుటుంబాలు ముప్పై సంవత్సరాల క్రితం స్థిరపడ్డారు.

మూడు వరుసలలో పక్కా ఇళ్ళు, దానికనువుగా రోడ్లు (ఇందులో ఒకటి కొత్తగా వేసిన సిమెంట్ రోడ్డు) చూడడానికి శుభ్రంగా వుండే పరిసరాలు, ఓ పక్కగా పంట పొలాలు కనిపించాయి. ముందువరుసలో కొన్ని ఇళ్ళకు ఇంటి కప్పు కుంగిపోయినా మిగతా ఇళ్ళు బాగానే వున్నాయి. ఇంటి తలుపులు తెరచి వుండడం, ప్రతి ఇంటిముందు వాకిలి వెనకపక్క పెరడు, పెరటిలో ఒక జెర్సీ ఆవు, కొన్ని చోట్ల దూడతో సహా, దానిపక్కనే కాయలతో వున్న కొబ్బరిచెట్టు. ఏదో పని వున్నట్లుగా హడావుడిగా తిరుగుతున్న మనుషులను చూస్తే ఈ గ్రామం ఆర్థికంగా బాగానే వుంది అనే భావన కలుగుతుంది. మొదటివరుస ఇళ్ళకు కొంచెం దూరంలో సిమెంటు చప్టాతో కూడిన పెద్ద బావి, అక్కడ నీళ్ళు తోడుకునే స్త్రీలను చూస్తే ఈ కాలనీలో నీటి ఎద్దడి ఉందనిపిస్తుంది. ఇంకా ఈ కాలనీలో మనుషులు ముఖ్యంగా స్త్రీలు, పిల్లల గురించి ఎవరో కొత్తవాళ్ళు తమ ఊరికి వచ్చారని తెలిసి వాళ్ళందరు బడి దగ్గరకు వచ్చారు. అందులో ఎక్కువమంది స్త్రీలు, పిల్లలున్నారు. తీరప్రాంతాల వాళ్ళు అనుకున్నట్లుగా చాలీచాలని చీర, జాకెట్టు వేసుకోకపోవడం, అడ్డపొగాకు తాగడం లాంటివి కాకుండా తల చక్కగా దువ్వుకుని, పూర్తిగా చీరకట్టుకుని జాకెట్టు వేసుకోవడం, అంతేగాక చనువుగా వాళ్ళు మాటకలపడంతో వాళ్ళు వెనుకబడిన వాళ్ళు, అంటరానివాళ్ళు అని మనం మర్చిపోతాం. అంతేకాకుండా స్టిక్కరుబొట్లు, రంగురంగుల ప్లాస్టిక్ గాజులు, నైలాన్ చీరలు, మేచింగ్ జాకెట్లతో స్త్రీలు కన్పించి బైట ప్రపంచంలో వస్తున్న ఫ్యాషన్ ప్రపంచంలో మార్పులలో మేము కూడా భాగమేనని చెప్పినట్లు అనిపించింది. బడికి వెళ్ళే పిల్లలు ముక్కు చీమిడి కారకుండా ఒంటి మీద కురుపులు లేకుండా, చొక్కా లాగులు వేసుకుని కనిపించారు. వాళ్ళ కాలనీకి వచ్చినవాళ్ళు ఎవరో తెలుసుకోవాలనే ఉత్సుకత వాళ్ళ ముఖాలలో కన్పిస్తుంది. మొదటిసారిగా ఈ కాలనీ చూడగానే పెద్దగా తారతమ్యాలు లేని కొన్ని కుటుంబాల సమూహం అనీ, దీనిలో కొత్తగా చాలా మార్పులు చేసుకుంటున్నాయనీ అన్ని గ్రామాలు కూడా ఇలా వుంటే బాగుంటుంది కదా అని ఒక ఆశ కలుగుతుంది.

ఇక రెండో కాలనీ. జోనంకి రెవెన్యూ గ్రామంలో వుండే మరొక చిన్న గ్రామంలో ఒక భాగం. ఇది కూడా ప్రధాన రహదారి పక్కనే బస్సు సదుపాయం సక్రమంగానే ఉన్న కాలనీ. దీనిని చేరగానే పంట పొలాలు కానీ, సాగునీటి సదుపాయం కానీ, తాగునీటి సదుపాయంగానీ కాలనీ దరిదాపులలో మనకి కనిపించవు. మనకి కనిపించేది ఎగుడుదిగుడుగా కాలనీని చేరే రోడ్డు. పక్కనే ఒక పెద్ద చింతచెట్టు. దాని క్రింద ఆడ,మగ కూర్చుని మాట్లాడుకుంటూ కన్పిస్తారు. వీళ్ళకి ఇదే సమావేశ స్థలం. చిన్నపిల్లలు ఇక్కడ కనిపించలేదు. అంటే మధ్యాహ్న సమయం కాబట్టి పిల్లలు బడికి వెళ్ళి వుంటారని, బడి ఆచుట్టుపక్కలే ఎక్కడో వుంటుందని అనుకోవాలి. ఈ కాలనీలో ఇళ్ళు ఒక క్రమంలో లేకుండా కొన్ని ఇళ్ళు ఒకే వరసలో మరికొన్ని వీటికి అడ్డంగానూ వున్నాయి. పడిపోతున్న ఇంటి కప్పులు, మూసి ఉన్న ఇంటి తలుపులు, చాలా ఇరుకుగా వున్న ఒకే ఒక గది, ఒక మొక్క కానీ ఆవు కానీ లేకుండా ఖాళీగా వుండే ఇంటి పెరడులు, పనులు లేక కబుర్లతో కాలక్షేపం చేసే మనుషులు.... ఇవన్నీ కూడా ఆర్థికంగా కాలనీ యొక్క వెనుకబాటుతనాన్ని సూచిస్తాయి. రోడ్డుకు దగ్గరగా ఒక చెట్టు కింద ఒక ఆవు తప్ప, కాలనీలో ఇంకే పశుసంపదా మనకి కనిపించదు. ఇంకా ఇక్కడ మనుషుల గురించి వీరికి ఎవరో కొత్తవాళ్ళు మన కాలనీకి వచ్చారనే ఆసక్తి కనిపించదు. రహదారి దగ్గర నుండి చిన్న కాలిబాట దాటి మనమే వాళ్ళ ఇళ్ళ దగ్గరకు వెళ్ళాలి. వీళ్ళ మొహాలలో ఎన్నో అనుమానాలు,

కొత్తవాళ్ళను చూచి బెరుకు, ఎందుకు వచ్చారో, ఏం చేస్తారో అనే భయం మనకి కనిపిస్తుంది. చింతచెట్టు కింద వయస్సు మళ్ళినవాళ్ళు మాట్లాడుకుంటూ వుంటే తలుపులు మూసిన ఇళ్ళ ముందు వాకిట్లో వయస్సులో వున్న వాళ్ళు కూర్చుని వున్నారు. ఆర్థికంగా వెనుకబాటుతనం మనకి వాళ్ళ దుస్తులలో కూడా కనిపిస్తుంది. ఈ కాలనీలో అడుగుపెట్టగానే ఇక్కడ పేదరికం ఎక్కువగా వుండవచ్చునని, ఇది చలనం పెద్దగా లేని కాలనీ అనే భావన కలుగుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ రెండు కాలనీలు ఒకే జిల్లాలో దగ్గరగా వున్నా కూడా వీటిని చూడగానే వచ్చిన అనుభూతులు, మనసులో రూపుదిద్దుకున్న చిత్రం విరుద్ధంగా వుంది. మొదటి కాలనీలో చలనం వుందని, రెండవ కాలనీలో కారణాలు ఏమైనా కావచ్చును మార్పులు తక్కువగా వుండి చలనానికి అడ్డంకులు ఉన్నాయని తెలుస్తుంది.

వాళ్ళ జీవన విధానం, వాళ్ళకి భవిష్యత్ మీద వుండే ఆశలు, అవసరాలు వారి అవగాహన వారి మాటల్లోనే తెలుసుకుందాం. మొదటి గ్రామంగురించి : ముప్పై సంవత్సరాల క్రితం కొంతమంది ఎస్‌సి కుటుంబాలను ఒక చోట చేర్చి ప్రతీ కుటుంబానికి వుండడానికి ఒక ఇంటి స్థలం ఇవ్వడమే కాకుండా ఇళ్ళు కట్టించి ఇచ్చి, బొంతలకోడూరు పంచాయతీలో దీనిని ఒక భాగంగా, ఒక కాలనీగా స్థిరపరచారు. ఇంటి స్థలంతో పాటు కొంత సాగుభూమిని (33 సెంట్లు) కూడా పంచటం జరిగింది. కొన్ని సంవత్సరాలు గడిచేసరికి ఇంటి గోడలు, కప్పులు కుంగిపోతే స్తోమత వున్న కుటుంబాలు కొంతమంది మళ్ళీ 10 వేల రూ.లు ఖర్చు చేసి ఇళ్ళు మరమ్మత్తు చేసుకున్నారు. కొన్ని కుటుంబాలు అలాగే వుండిపోయాయి. తమ పొలంలో వీళ్ళు ముఖ్యంగా వరి, అప్పుడప్పుడు మిరప పండించుకుంటారు.ఈ కుటుంబాలు తమ పొలంలోనే గాక వ్యవసాయ కూలీలుగా పక్క ఊరి పొలాలలో కూడా పనిచేస్తారు. ఇంకా పక్క ఊళ్ళో దొరికే చిన్న పనులను కూడా చేసుకుంటారు. కొత్తగా 'వెలుగు' పథకం లో ఉమ్మడి వ్యవసాయ సంఘం ఏర్పరచుకున్నారు. 12 కుటుంబాలు పక్కపక్కనే వున్న తమ పొలాలలో కలిసికట్టుగా వ్యవసాయం చేసుకునేందుకు నాంది జరిగింది. అక్కడి ఆడవాళ్ళతో మాట్లాడుతూ ఉమ్మడి వ్యవసాయ పద్ధతిలో ఉమ్మడి ఏం వుంటుంది ? పంట పొలాలన్నీ కలిపివేసి ఒక ప్లాట్‌గా పండిస్తారా ? వ్యవసాయానికి కావలసిన మదుపు ఉమ్మడిగా వుంటుందా? మార్కెట్‌లో కొనవలసిన విత్తనాలు, ఎరువులు, పురుగులమందు ఇవన్నీ ఉమ్మడిగా కొంటారా? అనే ప్రశ్నలకు స్పష్టంగా సమాధానం చెప్పగలిగారు. ఎవరి పొలాలు వాళ్ళే చేసుకుంటారని, అవసరమైన మదుపు తమదేనని మార్కెట్‌లో అవసరమైనవి కొనడం కూడా ఎవరికి వారే అన్నారు. అయితే ఇందులో ఉమ్మడి ఏం వుంది? అంటే సాగునీరు మాత్రమే ఉమ్మడి అని చెప్పారు. ఎత్తిపోతల పథకం (లిఫ్ట్ ఇరిగేషన్ స్కీమ్) ద్వారా నదిలోని నీరు పైపుల ద్వారా అందరి పొలాలకు పంపకం జరుగుతుందని, దానికయ్యే ఖర్చు ఉమ్మడిగా అందరూ భరించాలని చెప్పారు. అంతేగాకుండా ఎవరి ఇష్టానుసారం వారు పంటలు పండించకూడదని, అందరూ వరి మాత్రమే పండించాలనే షరతు వుందన్నారు. మునుపటి పద్ధతిలో ఎవరికి తోచినట్లు వారికి కావలసిన మెట్ట పంటలు పండించుకునేవారిని ఇప్పుడు కలిసికట్టుగా చేసుకోవటం మూలాన ఇతర కుటుంబాలతో తమ సంబంధాలు పెరిగాయని, వాళ్ళందరూ కొన్ని పథకాలకు లబ్ధిదారులయ్యే అవకాశం లభించిందని చెప్పారు. ఉమ్మడి వ్యవసాయం చేసుకునే మా పొలాలు మీరు తప్పక చూడాలి అని వాటిని చూపించడానికి వాళ్ళు చూపే ఆసక్తిని గమనిస్తే ఈ కొత్త పద్ధతి మాదే, మా సొంతంగా అన్నీ చేసుకుంటున్నాము, మునుపటి కంటే భిన్నంగా చేసుకుంటున్నాము అనే గర్వం, దానికి సంబంధించిన సమాచార వివరణలో స్పష్టత, మనకి ఒక కొత్త అనుభూతినిస్తాయి. అందరికీ తెల్లకార్డులు వున్నాయా ? కార్డు మీద బియ్యం సరిగా అందుతున్నాయా ? అనే ప్రశ్న వాళ్ళకి అంత ముఖ్యమైనదిగా కనిపించలేదు. చాలామందికి తెల్లకార్డులున్నాయని, మిగతావాళ్ళకు కూడా ముందు ముందు రావొచ్చునని ప్రశ్నను పక్కకు పెట్టేసారు.

ఇంకొక ముఖ్యమైన మార్పు ఇక్కడ కొత్తగా చోటు చేసుకుంటున్న ఆవుల పెంపకంలో మనం చూడవచ్చును. 15 మంది ఆడవాళ్ళు కలిసి స్వయం సహాయక బృందం (సెల్ఫ్ హెల్ప్ గ్రూప్)గా ఏర్పడి రోజుకు 1 రూ. చొప్పున పొదుపు చేసి నెలకి 30 రూపాయలు ప్రతి ఒక్కరూ కట్టి ఒక నిధి ఏర్పాటు చేసుకున్నారు. దీని సహాయంతో పేదరిక నిర్మూలనా పథకం ద్వారా ప్రతి కుటుంబానికి 10,000 రూపాయలు అప్పుగా దొరికింది. దాంతో ప్రతి కుటుంబం ఒక ఆవును రోజుకి 10 నుండి 12 లీటర్లు పాలు ఇచ్చేదానిని, ఎవరిష్టం ప్రకారం వాళ్ళు కొనుక్కుని ఆ పాలు డైరీకి రోజూ అమ్మి ఇప్పటివరకు బ్యాంకులో తమ అప్పులు సగం తీర్చివేశారు. పాల ధర లీటర్‌కి ఇంత అని డైరీ వాళ్ళే ప్రతి రోజూ నిర్ణయిస్తారని, పాలలో వున్న బలాన్ని బట్టి ఇస్తారని కూడా చెప్పారు.

ఇద్దరు స్త్రీలు ముందుకువచ్చి తాము బృందానికి పెద్దలుగా (లీడర్స్) వ్యవహరిస్తామని , దానికవసరమైన పనులు తామే నిర్వహిస్తామని చెప్పారు. ఈ బృందాలు సరిగా నడవడానికి కొన్ని ఇబ్బందులు ఉన్నాయని, తమకు సరిగా చదువు రాకపోవడంతో పాల ధరల దగ్గర, బ్యాంకు పనులలో అడ్డంకిగా వుందని చెప్పారు. అంతేకాకుండా నెలవారీగా చెల్లించాల్సిన 30 రూపాయలు త్వరగా ఇవ్వరని, వాళ్ళ ఇళ్ళకు నెలంతా తిరిగి అడిగితే వాళ్ళ చేతిలో డబ్బు వున్నప్పుడు చిట్టచివరికి నెల తిరిగేలోపు ఎలాగైనా ఇస్తారని చెప్పారు. ఆవుకి కావలసిన చిట్టు, తవుడు వగైరాలు పట్టణం నుంచి ఒకేసారి తెచ్చుకుంటే రవాణా ఖర్చులు తగ్గుతాయని, కానీ అవసరమైనప్పుడు అందరి దగ్గరా డబ్బు వుండకపోవడంతో కొంత ఖర్చు ఎక్కువైనా కూడా ఎవరికి వారే తెచ్చుకుంటామన్నారు. ఇంత కష్టపడి బృందంగా ఏర్పడి, అందరితోనూ పొదుపు చేయించి, వసూలు చేసి ఆవును కొనుక్కుంటే మీకు వచ్చే లాభం ఏమిటి అని అడిగితే ప్రస్తుతానికి ప్రతిరోజూ ఏదో కొంత ఆదాయం, అదీ తమ చేతులలో వుంటుందని, అంతేకాకుండా అప్పుకే సగం చెల్లించి వేశామని, దీనికి ఆరునెలలు పట్టిందని, ఆ కారణంగా

మరొక ఆవుకి సరిపడా అప్పు బ్యాంక్ ద్వారా దొరుకుతుందని, దీంతో ఏడాది పొడుగునా పాల అమ్మకం చేసుకోవచ్చునని, దీనినే ఇంకా పెంచుకోవచ్చునని ఆశాభావం వెలిబుచ్చారు.

'మేము కూడా బాగానే ఉన్నాం' అనే భావన వ్యక్తీకరించడానికి అన్నట్లు 'మా ఇళ్ళు మీరు తప్పక చూడాలి' అని బలవంత పెట్టారు. చాలా ఇళ్ళలో కరెంటు ఉంది. ఒకరిని చూచి ఒకరు ఇళ్ళను శుభ్రంగా ఉంచే ప్రయత్నం చేస్తున్నారు. కాలనీలో కొన్ని ఇళ్ళలో 'దీపం' పథకం క్రింద వచ్చిన గ్యాసు పొయ్యిలు, ఇంకా కొన్ని ఇళ్ళలో టివిలు ఉన్నాయి. పెరటిలో కూరగాయ మొక్కలు మాత్రం పెంచరు. ఆవు తినేస్తుందనేది ఒక కారణమైతే, ఇంటికి ఇంటికి మధ్య కంచె లేకపోవటంతో ఒక ఇంటి ఆవు మరొక ఇంటిలో మొక్కలు తినేస్తే రోజంతా తీర్చలేని దెబ్బలాటలు వస్తాయని చెప్పారు. విధిగా ప్రతి ఇంటికి ఒక కొబ్బరి చెట్టు ఉంది. దాని కాయలకు మార్కెట్టు ఉందనీ, వాటిని అమ్ముకుని ఆదాయం పెంచుకోవచ్చుననీ, పీచు తీసిన కాయలు గ్రామంలో కాకుండా బయట అమ్మితే ఎక్కువ ధర వస్తుందనే జ్ఞానం కూడా వాళ్ళకు ఉంది. చదువుల సంగతికి వస్తే పిల్లలందరూ బడికివెళ్ళి చదువుకుంటారనీ, వాళ్లలోనే ఒక విద్యా వాలంటీరు కూడా ఉన్నదనీ, తమ లాగా కాకుండా పిల్లలను చదివించి పైకి తీసుకుని రావాలనే కోరిక ఉందనీ చెప్పారు. చదువు రావటం మూలాన ఆవు పాలకు సంబంధించిన లెక్కలన్నీ తమ పిల్లలే చేసి పెడతారని చెప్పారు. ఈ కాలనీలో ఉండే లోటు చెప్పమంటే మరుగుదొడ్లు లేవనీ, నీటికి ఇబ్బంది లేకపోయినా స్నానాలకు కొంచెం ఇబ్బంది ఉందన్నారు. వాళ్ళకు అందుతున్న సహాయంతో ఎలా బాగుపడాలి అనేదే వాళ్ళ ముందున్న సమస్య. ఆవులా లేక సాగు పొలాలా అనేది వాళ్ళకు సమాధానం తెలియని ప్రశ్న. ఏదైనా సరే కష్టపడితే బాగుపడటం అసాధ్యం కాదనీ, దానికి తామే బాధ్యులమని కూడా తెలుసు. తమకు కావలసింది సాధించామనే ధీమా, ఇంకా సాధించగలమనే ఆత్మస్థైర్యం కాలనీలోని మనుషులకు ఉన్నాయనే అనుభూతి మనకు కలుగుతుంది.

రెండవ గ్రామం: ఈ కాలనీ కూడా ప్రభుత్వం ప్రక్క గ్రామాల్లో ఉన్న ఎస్.సి. కుటుంబాలను ఒకచోట చేర్చి ఇంటి స్థలాలు ఇచ్చి, ఇళ్లు కట్టించి జోనంకి పంచాయతీలో భాగంగా స్థిరపరచిన కాలనీ. కాలం గడిచే క్రమంలో ఇళ్ళు పాడైపోయినా కూడా బాగు చేయించుకునే స్తోమత లేకపోవడంతో వాటిలోనే ఉంటున్నారు. ఈ కుటుంబాలు చాలావరకు పొలం లేని వ్యవసాయ కూలీలు. కాగా ఈ ప్రాంతంలో గత రెండు సంవత్సరాలలో వర్షాభావం మూలాన వచ్చిన కరువు కారణంగా వ్యవసాయపు పనులు కూడా దొరకకపోవడంతో వీరి ఆర్థిక పరిస్థితి దుర్భరంగా కనిపిస్తుంది. ఈ పరిస్థితిని ఎదుర్కోవడానికి ప్రతి కుటుంబం నుండి ఒకరు బయటి ప్రాంతాలకు, హైదరాబాదు కాని కలకత్తా కాని, వలస పోతారు. అక్కడ దొరికిన పని ఏదైనా సరే - కట్టడాలకు సంబంధించిన పనులు, రంగులు వేయటం, రిక్షా తొక్కడం, రోడ్డు పనులు, కూలీ పనులు చేసి కొంత డబ్బు ఇంటికి పంపుతారు. ఒక కుటుంబంలో ఒక వ్యక్తి బెంగుళూరుకి వెళ్ళి కుటుంబపోషణకి డబ్బు పంపిస్తూ ఉంటారు. ఈ కుటుంబాలకు కరువు సమయంలో జీవనోపాధికి ముఖ్యంగా ఉపయోగపడే పని ఒక్కటే. అది చింతకాయల గింజలు తీసి, శుభ్రం చేసి చింతపండు తయారుచేయటం. మరో పని ఒట్టిపోయిన ఆవును మేపి దాంతో కొంత కూలీ డబ్బులు సంపాదిస్తారు. కరువు పనుల కింద రహదారి నిర్మాణం వచ్చినా కూడా వీరికి మూడు/నాలుగు రోజుల పని మాత్రమే దొరికింది. వీరి జీవితం తెల్లకార్డుల మీద వచ్చే బియ్యం మీదే ఆధారపడుతుంది. అందుచేత మళ్ళీ ఆలోచనలన్నీ తమకు ఎవరు ఎటువంటి సహాయం చేస్తారు అనే దాని చుట్టూ తిరుగుతుంది. మరొకరు చేసే సహాయం మీద ఆధారపడటం అనే మానసిక స్థితిలో ఉంటున్న వీరు, తమంతట తాము తమ పరిస్థితులు బాగుపడటానికి ఏమైనా చేసుకోగలమా అనే ఆలోచనకి దూరంగా ఉంటారు.

ఉదాహరణకి ఎగుడు దిగుడుగా వున్న తమ గ్రామపు అప్రోచ్ రోడ్ తమంతట తామే బాగు చేసుకోవచ్చును అని కాక సర్కారు బాగు చేయడం లేదని ఆరోపణ చేస్తారు. అంతేగాక 'ప్రక్క గ్రామాలకు సహాయం బాగా అందుతోంది. మాకు ఎందుకు సహాయం దొరకడం లేదు?' అనే ఆక్రోశం కూడా వినిపిస్తుంది. మెట్ట ప్రాంతం, దానితో కరువు కూడా కలిసేసరికి సాగుభూముల ప్రాముఖ్యత తగ్గిపోయింది. వ్యవసాయపు పనులు లేకపోవటం, ఇంకా ఇతర పనులేవీ దొరకక పోవడంతో చెట్టు క్రింద అందరూ కూడి కబుర్లు చెప్పుకోవడమే కాలక్షేపంగా మిగిలిపోయింది.

స్వయంసహాయక బృందాలు ఏర్పరచుకోవటంలో కూడా వీరికి సమస్యలు తలెత్తాయి. ఈ కాలనీ వ్యక్తులతో కలిసికట్టుగా బృందాన్ని ఏర్పరచుకునే వీలు కుదరక పక్క ఊరి బృందంలో సభ్యులుగా చేరడంతో వీరికి ఆ బృందం చేసే పనుల మీద అవగాహన కాని, దాని వలన వచ్చే ఉపయోగాలు కాని అందలేదు. ఇంత గడ్డు కాలం అని చెబుతున్నారు కదా మరి రోజు ఎలా గడుస్తుంది? అనే ప్రశ్నకు 'అప్పుల సహాయంతో' అని సమాధానం వచ్చింది. నోటిమంచితనంతో పక్క ఊరి షావుకారి దగ్గర అప్పు తెచ్చుకుంటామనీ, ఎపుడో కుటుంబంలో ఇద్దరికీ పని దొరికినపుడు ఒకరి కూలీతో తిండి తిని ఒకరి కూలితో అప్పు తీరుస్తామన్నారు. అది కూడా లేకపోతే చింతచెట్టు క్రింద కూర్చుని సహాయం కోసం ఎదురుచూడటమే మాకు మిగిలిన పని అని చెప్పారు. "మీ ఇళ్ళు చూడవచ్చునా, మీ ఇంటి తలుపులు మూసేసి బయట కూర్చున్నారెందుకు ?" అంటే "మా ఇంట్లో ఏముంది చూడడానికి? ఖాళీ డబ్బాలు, ఖాళీ గిన్నెలు" అని సమాధానం చెప్పారు. మీకు 'వెలుగు' ద్వారా సహాయంగా ఒక ఆవు దొరికితే బాగుంటుందేమో అంటే, "మాకే తిండి లేదు, దానికి ఏం పెడతాం?" అనే నిరాసక్తత కనిపిస్తుంది. పిల్లలందరూ బడికి వెడతారనీ, ఒక పూట తిండి అక్కడే గడిచిపోతుందని బడికి పంపడానికి కారణం చెప్పారు. చివరి ప్రశ్నగా మమ్మల్ని "మీరు కాలనీకి ఎందుకు వచ్చారు? మీరు మాకేం సహాయం చేస్తారో

ముందుగా చెప్పండి" అని అడిగారు. ఈ కాలనీలో ఉండే లోటు చెప్పమంటే జీవనాధారానికి ఒక పని లేకపోటమే పెద్ద లోటు అని, ఆ కారణంగానే ప్రతి కుటుంబంలోంచి ఒకరు బయటికి వలస పోవలసిన అగత్యం ఏర్పడింది అన్నారు. తమంతట తాము బ్రతుకు తెరువు వెతుక్కోలేమనీ, బయటివారెవరైనా సరే ఏదో సహాయం చేస్తేనే బ్రతకటం సాధ్యమనే వాళ్ల ఆలోచన వారిలో న్యూనతా భావాన్ని కలుగచేస్తుంది.

ఈ రెండు కాలనీలు తులనాత్మకంగా పోల్చి చూస్తే మొదటి కాలనీలో గుణాత్మకమైన మార్పులు, కొంత చలనం కనిపిస్తే రెండవ కాలనీలో అది లోపించినట్లు కనిపిస్తుంది. రెండు గ్రామాలలో ప్రజలు గతంలో వ్యవసాయకూలీలే అయినా మొదటిది సాగునీటి సౌకర్యంకల పల్లపు ప్రాంతంలో ఏర్పడితే, రెండవది మెట్టపంటల మీద ఆధారపడే ప్రాంతంలో ఏర్పడటం, పైగా తరచుగా కరువుబారిన పడుతూ ఉండటం జరిగింది. ఈ కారణంగా మొదటి కాలనీలో చలనం సాధ్యమై రెండవ దానిలో అది లోపించినది అనుకుంటే ఇది కాలనీకి అనువైన స్థలాన్ని ఎంపిక చేసే విధానం మీద ఆధారపడింది. ఇంకొక కారణం ప్రభుత్వం అందించిన సహాయంలో తేడాలుండవచ్చును. ఒక కాలనీలో ఇంటి స్థలం, ఇల్లు కట్టుకోవడానికి డబ్బు, సాగుచేయడానికి అనువైన భూమి ఇవ్వడం జరిగితే రెండవదానిలో ఇంటి స్థలాలు మాత్రమే ఇచ్చారు. మరొక కారణం స్వచ్ఛంద సంస్థల నుండి అందిన సహాయంలో తేడాలు. మొదటి కాలనీలో ఉమ్మడి వ్యవసాయాన్ని ప్రోత్సహించడం, ఎత్తిపోతల పథకం, ఇవి కాక ఆవుల పెంపకానికి, స్వయం సహాయక బృందాలకు రుణ సహాయం చేయటం లాంటివి జరిగితే, రెండవ కాలనీలో ఇటువంటివేమీ జరుగలేదు. మరొక కారణం 'వెలుగు' కార్యకర్తలు తగిన ప్రేరణ, ప్రోత్సాహం ఇవ్వడంతో సరిపెట్టుకోకుండా ఆ పథకాలకు సంబంధించిన సమాచారం అందించటం, వాటి ఆచరణలో ఎదురయ్యే సాధక బాధకాలకు సంబంధించి సలహాలు ఇవ్వడం, వీటిని ఆచరణలో పెట్టగలిగిన సామర్థ్యం, పట్టుదల కల బృందం నాయకత్వంలో తేడాలుండవచ్చును. ఇంకొక కారణం వీటి పాలనాస్థాయిలో అంటే ఒకటి స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన యూనిట్ అయితే రెండవది ఒక గ్రామంలో భాగంగా చేర్చబడిన కాలనీ - తేడాల వలన మొదటి కాలనీలో అవసరమైన మార్పులు చేయటానికి అనుకూల వాతావరణం ఉంటే రెండవదానిలో ఆ వాతావరణం లేకపోవచ్చును.

ఇక్కడ ఇంకొక ప్రశ్న తలెత్తుతుంది. ఇవన్నీ ఒక కాలనీలో ఉంటే, రెండవ దానిలో ఎందుకు లేవు అనే రాజకీయ అంశంతో జోడింపబడ్డ సవాలు ముందుకు వస్తుంది. దాన్ని కొంచెం పక్కకు పెట్టి, రెండు కాలనీలలో మనం ప్రత్యక్షంగా చూసిన విషయాలను, వాళ్ళు చెప్పిన సమాచారాన్ని జోడించి, వీటిలోని తేడాలను అవగాహన చేసుకునేందుకు ఒక క్రమం ఉంటుందేమో చూద్దాం. మార్పులకు మౌలిక సూత్రంగా ఆచరణ-ఆలోచనకి ఉన్న సంబంధంలో ఆచరణలో మార్పులు వస్తే అవి ఆలోచనలో కూడా మార్పులకు దారి తీసి ఆచరణకి బలం చేకూరుస్తాయి అనే మౌలిక సూత్రం ఆధారంగా, కాలనీలో వచ్చిన మార్పులు ఏమిటి? దాని వలన అక్కడి ఆలోచనా సరళి, మానసిక స్థితి మారిందా, లేదా? అని చూద్దాం.

**మొదటి కాలనీ గురించి:** వ్యవసాయ కూలీలుగా ఉన్న ఎస్‌సి కుటుంబాలను ఒక చోట చేర్చి ఇంటిస్థలం, దాని ప్రక్కనే సాగుభూమి ఇచ్చి ఒక కాలనీగా స్థిరపపరచటం జరగింది. నది పక్కన ఉన్న ఈ స్థలాన్ని ఎందుకు ఎంపిక చేశారు? ఇతర పథకాల ఆధారంగా సహాయం అందించకుండా పొలమే ఎందుకిచ్చారు? ఎవరు ఇచ్చారు? అనే ప్రశ్నలు పక్కన పెట్టి ఇలా కాలనీ ఏర్పాటు చేసి కొంత సహాయం అందించటం వలన ఇక్కడ ఆచరణలో వచ్చిన మార్పులను పరిశీలిద్దాం. ఎవరికి వారే యమునా తీరే అన్నట్లుగా విడివిడిగా ఉండే కుటుంబాలను ఒక కాలనీలో చేర్చి సాగుభూమి, ఎత్తిపోతల పథకం ఇవ్వడం ద్వారా వారు ఉమ్మడి వ్యవసాయ పద్ధతులు నేర్చుకోవడం, కలిసికట్టుగా పని చేసుకోవడం, సాధక బాధకాలు పంచుకుని పంటలు పండించుకునే కొత్త ఆచరణ రూపు తీసుకుంది. గతంలో వ్యసాయకూలీలుగా ఉండే వీరు సొంత పొలం వున్న వ్యవసాయదారులుగా మారటం ఇక్కడ చోటు చేసుకున్న గుణాత్మకమైన మార్పు. వర్షం మీద ఆధారపడి పండించే వీళ్ళు ఎత్తిపోతల పథకం ద్వారా సమిష్టి వ్యవసాయం అనే కొత్త ఆచరణ చెయ్యడానికి వెనుకంజ వెయ్యలేదు. సమిష్టి ఆచరణలో భాగంగా స్వయం సహాయక బృందంగా ఏర్పడి ఆవుల పెంపకానికి కావలసిన నైపుణ్యం, పాలు అమ్మడం ద్వారా మార్కెట్ సంబంధాల మీద కూడా అవగాహన పెంచుకున్నారు. ఆచరణలో వచ్చిన మార్పులను క్షుణ్ణంగా పరిశీలిస్తే వ్యవసాయకూలీలు వ్యవసాయదారులుగా మారటం, ఒక్కొక్కరు తమకు తామే అన్నట్లుగా కాక సమిష్టిగా కొత్త ఉపాధులు చేపట్టడం స్త్రీలు కూడా ఆర్థికంగా సమాజంలో భాగమవడం గుణాత్మకమైన మార్పులకు సంకేతం. ఈ పథకాల మూలాన వచ్చిన కొత్త ఆచరణలను అక్కడి కుటుంబాలు తమ 'స్వంతం' అనుకోవడంతో, వారిలో ఒకరిద్దరు ముందుకు వచ్చి వీటికి బాధ్యత వహించి కావలసిన పనులను సక్రమంగా నిర్వహించి వీటిని విజయవంతంచేయడం జరిగింది. కొత్త ఆచరణ మూలాన ఆలోచనలు కూడా మారి బ్రతుకు తెరువుకి ఇంకొకరి మీద ఆధారపడి జీవించటం తగ్గి 'మా అభివృద్ధికి మేమే బాధ్యులం' అనే కొత్త ఆలోచన, దాని వలన వీరికి తమ మీద నమ్మకం పెరిగాయి. దీనివలన తమలో ఉండే న్యూనతా భావం పోయి ఆత్మగౌరవం పెరిగింది. అక్కడి వ్యక్తులలోను, సమూహంలోను కూడా చలనం సాధ్యమైంది. ఒక్క వాక్యంలో చెప్పాలంటే వారు వ్యవసాయ కూలీలు అనే తమ గతాన్ని పక్కకు తోసి వ్యవసాయదారులుగా వర్తమానంలో పరివర్తన చెందుతూ, భవిష్యత్తు మీద ఆశ, తామే సమిష్టిగా అభివృద్ధి సాధించగలమనే ఆత్మవిశ్వాసం, నమ్మకం పొంది తమ ఆచరణకే కాక ఆలోచనలో కూడా వచ్చిన మార్పులను సూచించారు.

రెండవ కాలనీ గురించి: వ్యవసాయ కూలీలుగా జీవనం గడిపే ఎస్.సి. కుటుంబాలలో కొందరికి ఇంటి స్థలం ఇచ్చి, ఇల్లు కట్టించి వీరిని మరో గ్రామానికి ఎపెండిక్స్ కాలనీగా ఏర్పరచారు. ఇది మెట్ట ప్రాంతం, కరువుకి గురి అవుతున్న ప్రాంతం అవటం మూలాన రేషన్ కార్డు మీద వచ్చే బియ్యం, కరువుభత్యం క్రింద ఇచ్చే కొద్దిపాటి రొక్కం, పనికి ఆహారం పథకం లాంటి వాటి మీద ఆధారపడే కాలనీ ఇది. వెనుకబడిన ప్రాంతం, ప్రత్యామ్నాయ రంగాలలో పనులు దొరకకపోవడంతో 'తమది' అంటూ స్వంతంగా చేయగలిగిన పనులు లేకపోవటం, ఇతరులు ఇచ్చే పనుల మీదే ఆధారపడడం మూలాన వాళ్ళ ఆచరణ  మారలేదు సరికదా వాళ్ళ ఆలోచనాసరళి, మానసిక స్థితి కూడా ఎవరు తమకు ఏం సహాయం చేస్తారు ? అనే దానిమీదే కేంద్రీకరించబడుతుంది. స్వయం సహాయక బృందాల వలన కూడా వీరికి కావలసిన సహాయం అందకపోవడంతో వాళ్ళ ఆచరణలో మార్పులు చోటు చేసుకోలేకపోయాయి. అందుచేత బయటి ప్రాంతాలకు రోజువారీ కూలీలుగా వలస వెళ్ళడం మినహా మరొక మార్గం లేకపోయింది. అక్కడ కూడా ఎల్లకాలం పనులు దొరుకుతాయనే గ్యారంటీ లేకపోవడంతో వీరు తమ కాలనీతో సంబంధం తెంచుకుని శాశ్వతంగా పట్నానికి వెళ్ళిపోకుండా కాలనీకి కొన్ని సమయాలలో తిరిగి వస్తూ ఇక్కడ దొరికే చిన్న పనులలో భాగం పంచుకుంటూ అటూ ఇటూ కాకుండా మిగిలిపోయారు. ఇవన్నీ పరిశీలిస్తే ఈ కాలనీ మొత్తంలో కాని విడివిడిగా కుటుంబాలలో కాని మార్పు చోటు చేసుకోలేదనే భావన మనకు కలుగుతుంది. వ్యవసాయ కూలీలుగా ఉన్న వీరు వ్యవసాయకూలీలుగానే మిగిలిపోయారు. కొన్ని కుటుంబాలలో వలస పోయి కూలీలుగా పని చేసినా కూడా గ్రామం తిరిగి రావడమే తమ గమ్యంగా పెట్టుకోవడంతో వ్యవసాయకూలీ మనస్తత్వం నుండి బయటికి రాలేకపోయారు. ఎవరో సహాయం చేస్తేనే కాని బ్రతకడం సాధ్యం కాదనీ, తమ 'స్వంతం' అనుకునే మార్పు ఏదీ లేకపోయినందున వీరిలో కొత్త ఆచరణకి స్థానం లేకపోయింది. దీనితో పాత ఆలోచనల పరిధిలోనే ఉంటూ ఇంకొకరి మీద ఆధారపడే మనస్తత్వానికి కట్టడి అయిపోయారు. వీరికి సాధించినది కాని సాధించవలసింది కాని ఏమీ లేకపోవడంతో తమపై న్యూనతాభావం, ఆత్మగౌరవం లేకపోవడం కనిపిస్తుంది. తామే పూనుకుని బాగుపడగలమనే నమ్మకం కూడా కనిపించదు. వారికి ఏం కావాలో తెలియని అయోమయస్థితి. వారి ఆలోచనలు గతంలోనే ఉండిపోయాయనిపిస్తుంది. కాలనీకి కాని, వారికి కాని చలనం ఉన్నట్టు కనిపించదు.

క్లుప్తంగా చెప్పుకోవాలంటే శ్రీకాకుళం గురించి ముందుగానే తయారుచేసుకున్న ఒక నిర్దిష్టమైన నమూనా ఆధారంగా రెండు కాలనీలకు వెళ్ళడంతో మొదలయిన నా ప్రయాణంలో కాలనీలను చూడటం, వారితో మాట్లాడడం ద్వారా కలిగిన అనుభూతుల వలన రెండు కాలనీలు విరుద్ధ రూపాలలో కనిపించాయి. ఒక కాలనీ మన ఊహాజనిత చిత్రపటానికి మక్కీకి మక్కీ సరిపోతే ఇంకొక కాలనీ ఈ చిత్రానికి పూర్తిగా విరుద్ధమైన చిత్రాన్ని మనముందు ఉంచుతుంది. ఈ విరుద్ధమైన రూపాలు మన అవగాహనా పద్ధతికి ఒక సవాలుగా నిలుస్తాయి. ఈ తేడా మొదటి కాలనీలో వస్తున్న చలనాన్ని ప్రతిబింబిస్తుంది అని అర్థం చెప్పుకోవచ్చును. చలనాన్ని అవగాహన చేసుకునేందుకు మౌలిక సూత్రంగా ఆచరణ ప్రాధాన్యంగా ఆచరణ-ఆలోచన సంబంధాలను పరీక్షించడం జరిగింది. గుర్తు ఉంచుకోవలసిన ముఖ్య విషయం ఏమిటంటే అధ్యయనానికి ఒక నిర్దిష్టమైన నమూనా ఆధారం కావాలనీ, కాని దానిలో వచ్చే పరిమితులు అధిగమించటానికి ఇంద్రియాల ద్వారా గ్రహించబడే అనుభూతులకి అధ్యయన క్రమంలో ముఖ్య పాత్ర ఇవ్వడం ద్వారా సాధ్యమవుతుందని తెలుస్తుంది. ❑

---

( 35వ పేజీ తరువాయి)

చివరికి తీర్పులు కూడా తెలియని భాషలో వస్తాయి. ఈ పరభాషా న్యాయం ఎవరికి? ప్రజలకు అర్థం కాని న్యాయశాస్త్రం, వారికి తెలియని న్యాయం తీర్పుల రూపంలో నల్లని బైండు పుస్తకాల్లో ఉండి ఎవరికి లాభం? ఇంగ్లీషు తెలిసిన వారు ఇంగ్లీషులోనే కొట్టుకోవచ్చు కోర్టుకు పోవచ్చు. వారి వివాదాలు అంతర్జాతీయ భాషలోనే వినండి. అందులోనే తీర్మానాలు కూడా చేసుకోండి. కాని ఆ భాష తెలియని వారికి సొంత భాషలోనే వివాదాలు వినాలని కోరుకునే అధికారం, హక్కులేవా? ఆ హక్కును లేవని అనే అధికారం ఎవరికి ఉంది? తమిళనాడు ముఖ్యమంత్రిగా ఉన్న జయలలిత కొన్ని అవినీతి చర్యలకు పాల్పడిందని ఆరోపిస్తూ అనేక కేసులు విచారణలో ఉన్న విషయం తెలిసిందే. ఆ కేసులో ఒక దశలో, అన్ని పత్రాలు ఆంగ్లంలోనే ఉన్నాయని, తనకు ఆ భాష రాదని, తమిళభాషలోనే తనపై ఆరోపణలు ఏమిటో, తన వ్యతిరేకంగా వచ్చిన సాక్ష్యాలేమిటో తెలియజేయాలని, లేకపోతే తనకు న్యాయంజరగదని వాదించారు. మద్రాసు హైకోర్టు ఆ వాదనను అంగీకరించి, పదివేల పేజీలదాకా ఉన్న రకరకాల పత్రాలను తమిళ భాషలోకి అనువదించడానికి అనువాదకులను నియమించింది. అంటే ముఖ్యమంత్రులకు మాత్రమే మాతృభాషలో న్యాయ వివాదాల విచారణ జరగాలని కోరుకునే అవకాశంఉంది కాని మిగతా వారికి లేదా?

ఇంగ్లీషు రాని ప్రజలకు న్యాయం చేయడం కోసం న్యాయస్థానాలు వారి భాషను అనుసరించాలి. వారి సాక్ష్య విచారణను, వారికి వ్యతిరేకసాక్ష్యాల విచారణను వారి సమక్షంలో వారికి తెలిసిన భాషలో జరిగేట్లు చర్యలు తీసుకోవాలి. భాషాభిమానానికి దీనికి సంబంధం లేదు. వారికి తెలిసిన భాషలో విచారణ జరగాలన్నదే లక్ష్యం. బహిరంగంగా విచారణ, నిందితుడి ఎదురుగానే వ్యతిరేకసాక్ష్యాల విచారణ జరగాలన్నది మౌలిక న్యాయ సూత్రం. సామాన్యుని భాషలో అతని న్యాయాన్యాయాలను విచారించకపోతే ఆ సూత్రం భంగపడినట్టే. ❑

# ప్రపంచీకరణ చివరి పాదం

డి. పాపారావు

ప్రపంచ వ్యాప్తంగా సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు ఆరంభమై సుమారు రెండుదశాబ్దాలకు పైబడి అవుతోంది. ఈ విధానాలు ఆరంభమైన తరువాత వాటిని అనుసరించిన అన్ని దేశాలలోను ఉపాధి అవకాశాలు తీవ్రంగా కుంటుపడుతున్నాయి. కంప్యూటరీకరణ పెరిగిన తరువాత గత దశాబ్ద కాలంగా ఈ పరిస్థితి మరింత ముమ్మరం అవుతోంది. లాభాపేక్ష మినహా ప్రజాహితం పట్టని, మానవీయ కోణం లేని ఈ ఆర్థిక విధానాలు సామాన్య ప్రజల జీవితాలను అతలాకుతలం చేస్తున్నాయి. ఈ క్రమంలో భాగంగానే 1990 వ దశకం నుంచి మనదేశంలో కూడా ఆరంభమైన ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు ఉపాధి అవకాశాలు దారుణంగా తగ్గిపోయే పరిస్థితికి దారితీశాయి. మరో ప్రక్కన నూతన సాంకేతిక పరిజ్ఞానపు దాడి క్రింద సాంప్రాదాయక ఉపాధి అవకాశాలు, వృత్తులు నశించి పోతున్నాయి. మరో ప్రత్యామ్నాయం లేకుండా తాము నమ్ముకున్న వృత్తులు ఇక ఎంత మాత్రమూ తాము పొట్ట పోసుకునేందుకు కొరగాని పరిస్థితిలో కోటాను కోట్లమంది వృత్తిదారులు, సామాన్యులు నలిగిపోతున్నారు.

కార్ల్‌మార్క్స్, ఏంగెల్స్‌లు తమ కమ్యూనిస్టు ప్రణాళికలో పేర్కొన్న ఈ మాటలు పైపరిస్థితికి అద్దం పడతాయి-"మధ్యతరగతి లోని క్రింది వర్గం -చిన్న చిన్న వ్యాపారస్థులు, దుకాణదారులు, రిటైర్ అయిన వర్తకులు, చేతిపని వాళ్ళూ, రైతులూ-వీళ్ళందరూ క్రమక్రమంగా కార్మిక వర్గం లోకి దిగజారిపోతారు. దీనికి కొంత కారణం ఏమంటే, వీళ్ళ దగ్గర వున్న స్వల్ప పెట్టుబడి ఆధునిక పరిశ్రమలు నడపటానికి చాలదు. పెద్ద పెట్టుబడి దార్లతో పోటీ పడలేక వీళ్ళు దివాళా తీస్తారు. మరో కారణం ఏమంటే, కొత్త ఉత్పత్తి పద్ధతులు అమలులోకి వచ్చినందువల్ల చేతిపని వాళ్ళ ప్రత్యేక వృత్తి నైపుణ్యం ఎందుకూ కొరకాకుండా పోతుంది..."

పెట్టుబడి దారీ దేశాలలోని ప్రభుత్వాలు అంగీకరించినా అంగీకరించకున్నా, అంకెల గారడీలు ఎంతగా చేసినా తిరస్కరించలేని వాస్తవం నేడు ఆ దేశాలలో పెరిగిపోతున్న ఉపాధిరాహిత్యం, నిరుద్యోగం. సరళీకృత ఆర్థిక విధానాలు అమలు జరుగుతోన్న మనదేశంలో కూడా నిరుద్యోగ పెనుభూతం మర్రి చెట్టులా ఊడలు చాస్తోంది. ఈ నేపథ్యంలోనే ఈ మధ్య కాలంలో మన రాష్ట్ర ఆర్థిక శాఖ మంత్రి రోశయ్య చదువుకున్న వారందరికీ ఉద్యోగాలు ఇవ్వలేమని పేర్కొనటాన్ని చూడాలి. రోశయ్య గారి ఈ ప్రకటన ప్రధానంగా ఉన్నత విద్యావంతులకు వర్తిస్తుంది. ఎందుచేతనంటే కేవలం ప్రాథమిక, మాధ్యమిక విద్య వున్న వారికి ఉపాధి అవకాశాలు వుండే పరిస్థితి ఈ నూతన ఆర్థిక విధానాలకు ముందు కూడా బహుస్వల్పం. కాబట్టి రోశయ్య ప్రకటనను ఉన్నత విద్యావంతులకు ఉద్దేశించినదిగా చూడగలిగే అవకాశమే ఎక్కువ. కాగా, ఈ తరహా విద్యావంతులలో కూడా నిరుద్యోగం అనేది ఎంతోకొంత మేరకు గతంలో కూడా వుంది. అయితే, రోశయ్యగారి ప్రస్తుత ప్రకటన కొత్తగా దేనిని సూచిస్తుంది? ఖచ్చితంగా ఉన్నత విద్యావంతులకు ఉపాధి కల్పించే స్థితి నేటి మనదేశ వ్యవస్థలో అనూహ్యంగా పడిపోవటాన్నే ఇది సూచిస్తోందనేది నిర్వివాదం. ఇటువంటి ప్రకటనల ద్వారా బహుశా పాలకులు సాధించగలిగినది ఒక్కటే. ఉన్నత విద్యను అభ్యసించి మంచి ఉపాధిని పొందుదామనే కాస్తంత ఆశ ఉన్న వారిని ఉన్నత విద్యారంగం వైపు కన్నెత్తి చూడకుండా చేయగలగటమే అది సాధించగలిగింది. అంటే పెద్ద చదువులు చదువుకొని జీవితంలో పెద్ద ఆశలు పెట్టుకొనే వారు ఈ ఆశలు అడియాశలై వ్యవస్థకు వ్యతిరేకంగా తిరగబడే పరిస్థితిని ముందస్తుగానే నివారించుకోవటం ఇటువంటి ప్రకటనల అసలు ఉద్దేశ్యమా అనే సందేహం రాకమానదు. ఉన్నత విద్యకు బడ్జెట్ కేటాయింపులను కుదించివేయటం, విద్యను ప్రైవేటీకరించటం చాలా కాలంగా జరుగుతున్నదే.

అయితే ఈ విధంగా ఉన్నత విద్యపై వేటు వేస్తోన్న, అసలు ఉన్నత విద్యకు వెళ్ళటాన్నే నిరుత్సాహ పరుస్తున్న పాలకులు మరోప్రక్కన రెండు ఉపాధి రంగాలలో మాత్రం ఉధృతంగా ఉపాధి అవకాశాలను కల్పిస్తున్నారు. ఆరెండు రంగాలు- ఒకటి, ప్రాథమిక ఉపాధ్యాయులు, రెండు రక్షణ దళాలు. ఒక వైపు ఉన్నతవిద్య పై వేటు వేస్తూనే, విద్యావంతులకు ఉపాధి అవకాశాలను కల్పించలేమంటూనే మరోవైపు ప్రాథమిక విద్యారంగం, రక్షణ దళాల్లో ఉపాధి అవకాశాలను భారీ స్థాయిలో కల్పిస్తోన్న పాలక వర్గాల ప్రవృత్తి విచిత్రంగా కనపడవచ్చు. అయితే దీనిలో ఆశ్చర్యపోవాల్సినది ఏమీ లేదు.

నేడు ప్రపంచ వ్యాప్తంగా దోపిడీ సమాజాలన్నీ సర్వ సంపూర్ణంగా బహుళజాతి సంస్థలు, పెట్టుబడి దారులకు నిర్లజ్జగా ఊడిగం చేసే పరిస్థితికి దిగజారి పోయాయి. కంప్యూటరీకరించిన అత్యాధునిక పరిశ్రమలు, విలీనాలు, కొనివేయడాల ద్వారా ఈ బహుళజాతి సంస్థలు తమ ఉద్యోగుల సంఖ్యను రోజు రోజుకు కురదించి వేసుకుంటున్నాయి. ప్రపంచవ్యాపితంగా కోటాను కోట్ల మంది ఉద్యోగులను ఉపాధినుంచి తొలగించి వేస్తున్నాయి. ప్రైవేటీకరణ క్రమంలో ప్రభుత్వ ఉద్యోగులను ఉపాధినుంచి తొలగించి వేస్తున్నాయి. ప్రైవేటీకరణ క్రమంలో ప్రభుత్వ

ఉద్యోగాలు కొరవై ఉపాధి అవకాశాల కోసం ప్రైవేటు రంగంపై రాను రాను ఎక్కువగా ఆధారపడవల్సిన పరిస్థితి అందరికీ తెలిసినదే. అంతేకాకుండా చిన్న చేపను పెద్ద చేప మింగినట్లు చిన్న తరహా, మధ్య స్థాయి పరిశ్రమలను భారీ ప్రైవేటు పరిశ్రమలు రోజురోజుకూ మరింతగా మింగి వేస్తున్నాయనేది కళ్ళకు కనబడే వాస్తవం. అది కూడా ప్రపంచ వ్యాప్తంగా వున్న కొద్ది వేల బహుళజాతి సంస్థలే నేడు నలుమూలలా విస్తరిస్తుండడం జరుగుతున్న క్రమం. అంటే, హెచ్చు సందర్భాలలో ఉపాధి అవకాశాల కోసం ప్రత్యక్షంగానో లేదు పరోక్షంగానో బడా కంపెనీలపై ఉద్యోగార్థులు ఆధారపడవల్సి రావటం గమనార్హం. ఈ నేపథ్యంలోనే పైన పేర్కొన్న రెండు ఉపాధి రంగాలలో మాత్రమే ఉద్యోగ అవకాశాలు ఎందుకు పెరిగిపోతున్నాయనేది ఆలోచించవల్సిన విషయం.

మొదటగా ప్రాథమిక స్థాయి ఉపాధ్యాయ ఉద్యోగాలు పెంచేందుకు సంస్కరణలు అమలు జరుపుతోన్న ప్రభుత్వాలు ఉత్సాహం చూపటాన్ని చూద్దాం. ఈ ఉత్సాహం వెనుక ప్రధానంగా రెండు కారణాలున్నాయి- ఒకటి, యావన్మంది ప్రజల మెదళ్ళను తమ పెట్టుబడి దారీ అనుకూల ప్రచారంతో అదుపు చేసే ప్రయత్నంలో భాగం. రెండవది, బహుళజాతి కంపెనీల సరకుల కొనుగోలుదిశగా సామాన్య ప్రజలను కండీషన్ చేసే ప్రయత్నం. మొదటగా, దోపిడికి తలవొగ్గి నిశ్చేష్టులుగా మారిపోయే విధంగా ప్రజలను వారి మెదళ్ళను కండీషన్ చేసే ప్రయత్నాన్ని కాస్తంత పరిశీలిద్దాం. ఇక్కడ జాక్వ్యూస్ ఎల్ లుల్ అనే రచయిత రచించిన ప్రోపగండా అనే పుస్తకంలో ఆయన పేర్కొన్న అంశాన్ని ఉటంకించవచ్చు:

ఒక కనీస జీవన ప్రమాణంతో పాటు మరొక స్థితి కూడా అవసరం. ఒక మనిషిని విజయవంతంగా ప్రచారానికి ఎర చెయ్యాలంటే అతనికి కనీసమైన సంస్కృతి ఉండాలి. పాశ్చాత్య సంస్కృతి గురించి ఏమీ తెలియని వాళ్ళను ప్రచారంలో ముంచెత్తలేం. ఇక్కడ నేను జ్ఞానం గురించి మాట్లాడడం లేదు. చాలా ఆదిమ తెగలకు మనకు తెలియని జ్ఞానం ఉంది. కానీ కావలసింది కొంత విద్య. చదవడం రానివాళ్ళు, చదవడంపై ఆసక్తి లేని వాళ్ళూ ప్రచారానికి లోబడలేరు. అక్షరాస్యత మానవ ప్రగతి అని, నిరక్షరాస్యతను తగ్గించడమే గొప్ప విజయమని కొందరనుకుంటారు. ఎక్కువ మంది నిరక్షరాస్యులున్న దేశాలను వాళ్ళు విమర్శిస్తారు. చదువే ప్రగతి మార్గమని వాళ్ళనుకుంటారు. ఇదంతా సందేహాస్పదమే. ఎందుకంటే చదవరావడం మాత్రమే ముఖ్యం కాదు. చదువుతున్నదేమిటో అర్థం చేసుకోవడం, దాని గురించి ఆలోచించడం, నిర్ధారణకు రావడం ముఖ్యం. ఇవి లేకపోతే చదువుకు అర్థం లేదు. విమర్శనాత్మకంగా చదవడం అనేది ప్రాథమిక విద్యకు మించిన, అతి కొద్ది మందికి మాత్రమే సంబంధించిన అంశం. అత్యధిక సంఖ్యాకులు బహుశా 90% మంది చదవడం వచ్చినప్పటికీ ఈ విమర్శనాత్మక నైపుణ్యాన్ని కలిగి ఉండరు. వాళ్ళు అచ్చయిన అక్షరానికి అధికారాన్ని, గొప్ప విలువనూ ఆపాదిస్తారు. లేదా మొత్తంగా తిరస్కరిస్తారు. విమర్శనాత్మక నైపుణ్యం లేనందువల్ల చదివినదాన్ని మొత్తంగా అంగీకరిస్తారు. లేదా తిరస్కరిస్తారు. అందువల్ల ఎక్కువ కష్టపడకుండా సులభంగా తమకు అందే దాన్ని అంటే ఏ వ్యతిరేకతా లేకుండా తమని ప్రభావితం చేసేదాన్ని అంటే ప్రచార సామగ్రిని మాత్రమే చదువుతారు.

పైన పేర్కొన్న ఉటంకింపు నేడు సంస్కరణలు అమలు జరుగుతున్న దేశాలలో ప్రాథమిక విద్యపై ప్రభుత్వాలు ఇంతగా శ్రద్ధ ఎందుకు పెడుతున్నాయో తెలియజేయగలదు. నిరక్షరాస్యుడైన వ్యక్తి తమ ప్రచారాలకు లొంగడనే భయమే దీనికి కారణం. కాగా కాస్తంత అక్షరాస్యుడు ప్రచారంలో పెట్టబడుతోన్న దోపిడీవర్గ భావనలను విమర్శనా రహితంగా స్వీకరించే అవకాశాలే ఎక్కువ. అలాకాకుండా ప్రాథమిక విద్యావ్యవస్థలోకి లాగబడి అప్పటికీ పాలక వర్గాల ప్రచారాలకు లొంగని వారికోసం ఎటుగూడీ రక్షణదళాల 'కరసేవ' వుండనే వుంది. ఇటువంటి వారికోసమే నేను పైన పేర్కొన్న రక్షణ దళాలలో రిక్రూట్‌మెంట్ పెంపుదల. అంటే సాధ్యమైతే తమ ప్రచారం ద్వారా మెదళ్ళను మచ్చిక చేయటం, సాధ్యం కాకుంటే భౌతిక బలప్రదర్శన ద్వారా అణచివేయటం - ఇది నేటి పాలకవర్గాల "సరళీకృత" రాజకీయ విధానం. మూడో కారణం మరొకటివుంది. వ్యవసాయరంగంలో ప్రవేశించడానికి, వ్యవసాయాధార పరిశ్రమలు నెలకొల్పడానికి పావులు కదుపుతున్న బహుళజాతి సంస్థలు, కార్పొరేట్లు, నిరక్షరాస్యులతో వారి ప్రణాళికను అమలు జరపలేరు. కాస్తో కూస్తో చదువు వచ్చి, మాన్యువల్స్ చదవగలిగిన వారు అవసరం. అందుకనే ప్రాథమిక విద్యకు ఆర్థిక సహాయం చేయటం, ఉపాధ్యాయుల రిక్రూట్‌మెంట్‌పైన ఆంక్షలు విధించకుండా, తమ సహాయం అందుకొంటున్న దేశాలకు, రాష్ట్రాలకు పూర్తి స్వేచ్ఛనిచ్చారు.

ఇక, ప్రాథమిక విద్య రెండవ లక్ష్యం బహుళజాతి కంపెనీల బ్రాండ్లను గుర్తించి, వాటి ప్రచారానికి లోబడి వినియోగదారులుగా మారే విధంగా సామాన్యులను తయారు చేయటం. పూర్తి నిరక్షరాస్యుడు తమ ప్రకటనలను చదువలేడు కనుక ఆ ప్రచారానికి లోబడడు గనుక అతనిని లేదా ఆమెను ప్రాథమిక "విద్యావంతులు" గా చేసి తమ సరుకులను ఇబ్బడి ముబ్బడిగా అమ్ముకోవటం మాత్రమే వీరి ధ్యేయం. అయితే దీనంతటి అర్థాన్ని ప్రజలు విద్యావంతులు కావటాన్ని వ్యతిరేకించటంగా దయచేసి తీసుకోవద్దు. ప్రజలు ఆలోచనా పరులుగా, చైతన్యశీలురుగా, విమర్శనాత్మకంగా అంశాలను పరిశీలించుకోగలిగేవారిగా తయారు కావటం వారి మేలుకోరే ఎవ్వరికీ అభ్యంతరకరం కాదు. కానీ ప్రజలు తమ సమావేశాలలో తమను నిలదీసి ప్రశ్నిస్తేనే "ఏమ్మా బాగా ఉపన్యాసం ఇస్తున్నావు, నీవు కమ్యూనిస్టువా?" అని ప్రశ్నించిన మన మాజీ ముఖ్యమంత్రి గారి ఉదాహరణ పైన పేర్కొన్న తరహా విద్యను పాలకులు ప్రోత్సాహించగలరా లేదా ఆమోదించగలరా అనే దానిని చెప్పకనే చెబుతున్నది.

మరో ప్రక్కన మానసిక శాస్త్ర రంగంలో రూపుదిద్దుకొంటోన్న కొత్త పరిశోధనా రంగాలైన- న్యూరో ఎకనామిక్స్ , న్యూరో మార్కెటింగ్ వంటివి నేడు ప్రపంచ వ్యాప్తంగా సామాన్య ప్రజలను కేవలం బడా సంస్థల సరుకుల కొనుగోలు దారులుగా కండీషన్ చేసే ప్రయత్నాన్ని వెల్లడిస్తున్నాయి. 2002 వ సంవత్సరంలో ఆర్థిక శాస్త్రంలో ఇరువురు అమెరికన్లకు వారి పరిశోధనలకు గాను ఇచ్చిన నోబెల్ పురస్కారం పై దిశగా జరుగుతోన్న ప్రయత్నాలకు లభిస్తోన్న ప్రోత్సాహానికి నిదర్శనం. డెనియల్ కాహ్నెమెన్, వెర్మాన్ స్మిత్ అనే ఈ ఇరువురు ఆర్థికవేత్తలు ప్రజల కొనుగోళ్ళ నిర్ణయాలను వారి మనస్తత్వం ఎలా ప్రభావితం చేస్తుందనే అంశంపై ప్రయోగశాలలో పరిశోధనలు జరిపారు. అంటే ప్రజలను దగా చేసే "కళను" మరింత "మెరుగు" పరిచినందుకు వీరికి ఈ పురస్కారం లభించింది. మానవులను అజ్ఞానంలో అంధకారంలో ఉంచి, వారిని కేవలం యాంత్రిక కొనుగోలు దారులుగా మార్చి పబ్బం గడుపుకునేందుకు బహుళజాతి సంస్థలు సాగిస్తోన్న కుట్రలలో ఇదీ భాగమే. ఇక మనుష్యులు తమ స్వభావరిత్యా తమ మెదళ్ళను ప్రధానంగా మనుగడకోసం వాడతారు మినహా ఏది సరైనదో తెలుసుకొనేందుకు కాదని ప్రముఖ మానసిక శాస్త్రవేత్త గోల్డ్‌బర్గ్ తన 'ది విజడమ్ పారడాక్స్' అనే పుస్తకంలో పేర్కొన్నారు. ఈ అర్థంలో చూస్తే పాలక వర్గాలు, బహుళజాతి సంస్థల ప్రసారాలను తాత్కాలికంగానైనా సామాన్య ప్రజానీకం స్వీకరించే ప్రమాదం మెండుగానే వుంది.అయితే, తక్షణం తన అస్తిత్వానికి ఏది సరైనదో ఆలోచించుకునే శక్తి మానవుల మెదళ్ళకు లేకున్నా, తమ మనుగడలే డోలాయమాన స్థితిలో పడ్డప్పుడు ఆలోచించక తప్పనిసరి పరిస్థితి,

పాలకవర్గాల ప్రచారపు చిక్కుముడుల నుంచి బమటపడక తప్పని పరిస్థితి అంతిమంగా, అనివార్యంగా సామాన్యుడిపై పడుతుంది ఈ విధంగా సామాన్యుడి మనుగడనే ప్రశ్నార్థకంగా చేసే దిశగానే ప్రపంచీకరణ ప్రభావాలు సాగుతున్నాయి. రోజు రోజుకు పెరిగి పోతోన్న ధనిక, పేద వ్యత్యాసాలు దీనికి తార్కాణం.

పైన పేర్కొన్న మాటలకు తార్కాణంగా మళ్ళీ కమ్యూనిస్టు ప్రణాళికలోనే పేర్కొనబడిన మాటలను ఉల్లేఖించుకోవచ్చు- "గత చరిత్రలో, మనం యిప్పటికే గమనించినట్లు, ప్రతి సమాజమూ పీడిత పీడక వర్గాల వైరుధ్యం మీద ఆధారపడింది. కానీ, ఒక వర్గాన్ని పీడించాలంటే, ఆ పీడిత వర్గం కనీసం తన బానిస బతుకును యథాస్థితిలో కొనసాగించడానికైనా కొన్ని పరిస్థితులు నమ్మకంగా ఉండాలి. ఫ్యూడల్ యుగంలోని ఫ్యూడల్ దాసులు కమ్యూన్‌లో సభ్యత్వం పొందే స్థితికి అభివృద్ధి చెందారు; ఫ్యూడల్ నిరంకుశ పెత్తనం కింద పెటీ బూర్జువాలు బూర్జువాలుగా అభివృద్ధి చెందారు. కానీ, ఆధునిక కార్మికుడు పరిశ్రమలు అభివృద్ధి అయ్యేకొద్దీ పైకిరాకుండా ఇంకా కిందికి పోతున్నాడు; కార్మిక జీవన విధానానికి కూడా అంటి పెట్టుకోలేక దినదినానికీ యింకా అడుక్కు, ఇంకా లోతుకు పోతున్నాడు. కార్మికుడు బుక్కా ఫకీరవుతున్నాడు. మరి ఈ బుక్కా ఫకీరుతనం జనసంఖ్య కంటే వేగంగా, దేశ సంపద కంటే వేగంగా పెరుగుతున్నది. కాబట్టి ఒక విషయం స్పష్టమవుతున్నది. సమాజంలో పాలక వర్గంగా వుండటానికి బూర్జువా వర్గానికిక ఎంతమాత్రమూ యోగ్యతలేదు; తన జీవిత విధానాన్ని; అత్యున్నత శాసనంగా, సమాజం మీద నిర్బంధించటానికి దానికిక ఎంతమాత్రమూ అర్హతలేదు. సమాజాన్ని పాలించడానికి అది అనర్హం. ఎందుకంటే, తన బానిసకు బానిసబతుకునైనా నమ్మకంగా చూపించగల సామర్థ్యం లేదు దానికి. తన బానిస బిచ్చమెత్తుకోవాల్సిన దుస్థితికి దిగజారిపోతే, బానిస శ్రమమీద తాను బతకడానికి బదులు తన బిచ్చం మీద బానిస బతకవల్సిన దుస్థితి సంభవిస్తే, ఏమిచేయడానికీ సామర్థ్యం లేదు దానికి. ఈ బూర్జువావర్గం కింద సమాజమిక ఎంతమాత్రమూ మనలేదు. అంటే సమాజానికీ బూర్జువావర్గం ఉనికికీ ఇక ఎంతమాత్రం పొత్తు కుదరదు".

కాగా, ప్రపంచీకరణ క్రమంలో కొడిగట్టిపోతోన్న దీపాల్లావున్న సామాన్య ప్రజలను, వారి కడగండ్ల తాలూకు క్లిష్ట దశను కుదించి వారిని సర్వ మానవ సమానత్వం, దోపిడీ రాహిత్యం దిశగా నడిపే గురుతర కర్తవ్యం నేడు వామపక్షాల భుజస్కందాలపై వున్నది. ఈ కర్తవ్యాన్ని అవి ఎంత సమర్థవంతంగా నిర్వహించగలిగితే అంత తక్కువ మానవ మారణ హోమంతో దోపిడీ వ్యవస్థ చరిత్ర చెత్త బుట్టలోకి విసిరి వేయబడగలదు. ❑

# వచ్చే సంచికలలో...

యాభైయవ పడిలో ప్రవేశించిన ఆంధ్రప్రదేశ్ రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక పరిణామాల గురించిన విశ్లేషణలు వీక్షణంలో ఈ సంవత్సరం పొడవునా ప్రచురిస్తాము.

ప్రొ.డి. నరసింహారెడ్డి, ప్రొ.జి. హరగోపాల్, ప్రొ. ఆర్.ఎస్. రావు, డా. ఎం. భారతి, డా. కె. నాగేశ్వర్, జె. శివరామ్, ప్రొ.ఎం. కోదండరామ్ తదితరుల రచనలు వచ్చే సంచికల్లో ...

# ఆంధ్రప్రదేశ్ పునరావాస విధానం 2005 : విశ్లేషణ

ఆర్.వి.రాంమోహన్

నీటి పారుదల ప్రాజెక్టుల నిర్మాణం వల్ల నష్టపోయే కుటుంబాలవారి కోసం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పునరావాస విధానాన్ని ఏప్రిల్ 2005లో ప్రకటించింది. ప్రభుత్వ ఉత్తర్వు జి.ఓ. నెం.68, నీటిపారుదల & సిఎడి (ప్రాజెక్టుల విభాగం) రూపంలో దీన్ని విడుదల చేస్తూ, దేశంలోనే గొప్ప పునరావాస విధానంగా ప్రభుత్వం దీన్ని అభివర్ణించింది.

రాబోయే అయిదేళ్ళలో రాష్ట్రంలో 23 నీటి పారుదల ప్రాజెక్టులు నిర్మించి నీటి పారుదల సదుపాయాలను భారీగా పెంచుతామని వాగ్దానం చేస్తూ డా. వై.ఎస్.రాజశేఖరరెడ్డి నేతృత్వంలో కొత్త ప్రభుత్వం 2004లో అధికారం చేపట్టింది. ఈ దశలో రాబోయే రెండేళ్ళలో కనీసం 7 సాగునీటి ప్రాజెక్టులు నిర్మించాలన్న రాష్ట్ర ప్రభుత్వ ప్రయత్నాల నేపథ్యంలో కొత్త పునరావాస విధానం అత్యంత ప్రాధాన్యతను సంతరించుకుంది. అయితే పోలవరం వంటి ప్రతిపాదిత ప్రాజెక్టుల నిర్మాణం వల్ల అనేక వేలమంది ప్రజలు ఇళ్ళు, భూములు, జీవనోపాధులను కోల్పోయి నిర్వాసితులవుతారు. ఇందువల్ల జరిగే ముంపు వల్ల అనేక ఆదివాసీ అటవీప్రాంతాలకు హాని జరిగి పూడ్చలేని పర్యావరణ వినాశనానికి, ఆదివాసీ తెగల సాంస్కృతిక విచ్ఛిన్నానికి దారి తీస్తుంది. ఒక్క పోలవరం ప్రాజెక్టు వల్లే ఖమ్మం జిల్లాలో 276 గ్రామాలకు చెందిన సుమారు లక్షా ఇరవైవేల మంది నిర్వాసితులవుతారు. వీరిలో సగానికి పైగా ఆదివాసీలే. డ్యామ్ నిర్మాణం వలన సుమారు 95 వేల ఎకరాల వ్యవసాయ భూములు నీట మునగడమే కాక, 8వేల ఎకరాలలో అటవీ వనరులు అదృశ్యమవుతాయి.

ప్రతిపాదిత పునరావాస విధానంలో కొన్ని లోపాలతో పాటు కొన్ని మంచి అంశాలు కూడా వున్నాయి. అట్లాంటివాటిలో ముఖ్యమైన వాటిని ఇక్కడ విశ్లేషించడం జరిగింది. ఈ విధానాన్ని మెరుగుపరచేందుకు కొన్ని సూచనలు కూడా ఇవ్వడం జరిగింది.

### ముంపును, నిర్వాసిత్వాన్ని వీలైనంత తగ్గించడం :

ప్రభుత్వ విధానంలో చెప్పబడిన ముఖ్య ఉద్దేశ్యమేమంటే - నిర్వాసిత్వాన్ని తగ్గించడానికి, నిర్వాసిత్వానికి ఆస్కారం లేదా అసలు నిర్వాసిత్వమే లేని విధంగా ప్రాజెక్టుల ప్రణాళికారచన చేయడం. నిర్వాసిత్వాన్ని తగ్గించడానికి ప్రత్యామ్నాయమార్గాలను అన్వేషిస్తామని ప్రభుత్వం ఈ విధానం ద్వారా బహిరంగంగా ప్రకటించడం ఒక శుభ సూచిక. అభివృద్ధి ప్రాజెక్టుల వలన సర్వం కోల్పోయేవారి పట్ల ప్రభుత్వం చూపిస్తున్న సానుకూల వైఖరికి ఇది నిదర్శనం. అయితే ఈ ప్రత్యామ్నాయ మార్గాల అన్వేషణ, వాటి మూల్యాంకనం ఆచరణలో కనపడాల్సి వుంది. ఎందుకంటే ఈ పునరావాస విధానం ప్రకటించిన తరువాత చేపట్టిన కొత్త ప్రాజెక్టులలో ప్రత్యామ్నాయాల అన్వేషణను పారదర్శకంగా చేపట్టిన దాఖలాలు లేవు. ఈ వనికోసం పోలవరం, పులిచింతల విషయంలో ఏర్పాటు చేసిన సాంకేతిక నిపుణుల కమిటీని అన్ని కొత్త ప్రాజెక్టులకు వర్తింపచేసి, ఈ ప్రక్రియను పారదర్శకంగా, సమగ్రంగా నిర్వహించాల్సిన అవసరం వుంది.

### పునరావాస ప్యాకేజీపై సంప్రదింపులు :

పునరావాస ప్రణాళిక రూపకల్పనలో, అమలులోనూ పంచాయితీరాజ్ ప్రతినిధులు, బాధిత కుటుంబాలవారు పాలు పంచుకొనేందుకు ఈ విధానం అవకాశం కల్పిస్తుంది. అంతేగాక వీరికి ప్రాజెక్టు స్థాయి పునరావాస కమిటీలో భాగస్వామ్యం కల్పించడం వల్ల బాధిత కుటుంబాలు ఈ విధానంలోని వివిధ అంశాలపై తమ వాణిని వినిపించే వీలు కల్గింది. అయితే ప్రభుత్వాధికారులు వీటికి ఏపాటి విలువ నిచ్చి ఆచరణలో పెడతారు అనేది ప్రశ్నార్థకం. ఎందుకంటే స్వాతంత్ర్యానంతరం నిర్మాణమైన ఏ ప్రాజెక్టులోనూ నిర్వాసితులతో చర్చించడం, వారి మనోభావాలను, అవసరాలను గుర్తించడం, వాటికి అనుగుణంగా పునరావాస ప్యాకేజీని పూర్తి స్థాయిలో ఒక నిర్ణీతకాలంలో అమలు చేయడం జరగలేదు. నర్మద వంటి ప్రాజెక్టులలో దశాబ్దాల తరబడి సాగిన పోరాటాలు కూడా సంతృప్తికరమైన పునరావాసాన్ని సాధించలేకపోయాయి.

### నిర్ణీత కాలవ్యవధితో కూడిన పునరావాసం :

బాధిత కుటుంబాల వారి పునరావాసానికి (నిర్వాసితులకు గృహ నిర్మాణానికి మాత్రమే) సంబంధిత జిల్లా కలెక్టర్ నిర్ణీత కాలవ్యవధితో కూడిన ప్రణాళికలను తయారుచేయాలని ఈ విధానం చెపుతుంది. అయితే ప్యాకేజీ లోని ప్రత్యామ్నాయ వ్యవసాయ భూమి కేటాయింపు, బాధిత కుటుంబాలలోని భూమి లేని పేదలు, చేతివృత్తులపై ఆధారపడేవారి శిక్షణ, నైపుణ్యాల పెంపు, పునరావాసాలపై ఎలాంటి కాలపరిమితి ప్రస్తావన లేదు.

ఏలేరు, శ్రీరామ్‌సాగర్ (ఎస్.ఆర్.ఎస్.పి.) వంటి ప్రాజెక్టులు చేపట్టి దశాబ్దాలు గడుస్తున్నా బాధితులకు సరైన పునరావాసం నేటికీ కల్పించలేదు. బాధిత కుటుంబాలకు న్యాయం జరగాలంటే పునరావాస చర్యలన్నీ నిర్ణీత కాలపరిమితికి లోబడి వుండాలి. అందుచేత గృహనిర్మాణం అనే ఒక్క అంశమే కాకుండా ప్యాకేజీలోని ప్రతీ అంశానికి సంబంధించి సవివరమైన కాలపరిమితితో పునరావాస ప్రణాళికలను రూపొందించి అమలుచేయాలి.

**దారిద్ర్యరేఖకు ఎగువనున్న వారికి లేని గృహ నిర్మాణ సహాయం :**

ఈ పునరావాస విధానం, బాధిత కుటుంబాలలోని దారిద్ర్యరేఖకు దిగువన వున్న కుటుంబానికి రూ. 40,000 లను గృహ నిర్మాణ సహాయంగా ఇస్తూ, దీన్ని వీరికే పరిమితం చేసింది. అయితే, దారిద్ర్యరేఖకు ఎగువనున్న కుటుంబాలు మొత్తం గ్రామీణ జనాభాలో 20% కి మించవు. ప్రాజెక్టుల నిర్మాణం వల్ల వారి ఇళ్ళు కూడా మునిగిపోతాయి. నివాసం అనేది ప్రతి ఒక్క కుటుంబం యొక్క కనీస అవసరం. అందుచేత ఈ రెండు వర్గాల ప్రజల మధ్య తేడాను చూపెట్టి దారిద్ర్యరేఖకు ఎగువనున్న వారికి గృహ నిర్మాణ సహాయం అందించకపోవడం సరికాదు. ప్రభుత్వం ఈ సహాయాన్ని ఇంకా పెంచి బాధిత కుటుంబాలకు పక్కా ఇళ్ళను తగినంత వైశాల్యంలో నిర్మించుకోవడానికి తోడ్పడాలి.

**సేకరించిన భూమికి బదులుగా భూమి కేటాయింపు :**

ఈ పునరావాస విధానంలోని ఒక మెచ్చుకోదగిన అంశం - ఆదివాసీలు తమ భూమికి బదులుగా ఆయకట్టు ప్రాంతంలో వారు కోరుకున్న చోట భూమిని పొందే అవకాశం కల్పించడం. ఈవిధానమే కనుక ఆచరణలోకి వస్తే ఈ అంశం ఒక నూతన ఒరవడిని సృష్టిస్తుంది. ఈ అంశం అమలులో కొన్ని చిక్కులు కూడా తలెత్తే అవకాశం లేకపోలేదు. ఆదివాసీలకు భూమి కేటాయించడానికి ప్రభుత్వం ఆయకట్టులో తిరిగి భూసేకరణ జరపాల్సి వస్తే అది సమస్యను మరింత జటిలం చేస్తుంది. ఇంత చేసినా, ఆదివాసీలు మైదాన ప్రాంతాలలోకి వచ్చి జీవనం సాగించగలరా అనేది ప్రశ్నార్థకం.

దురదృష్టం ఏమంటే ప్రభుత్వం ఇటీవల చేపట్టిన భూపతిపాలెం ప్రాజెక్టు (తూర్పుగోదావరి జిల్లా) వంటి గిరిజనులు నిర్వాసితులయ్యే చిన్న ప్రాజెక్టులో సైతం ఈ విధానం సరిగా అమలు కాలేదు. భవిష్యత్తు ప్రాజెక్టుల విషయంలో ఈ పరిస్థితే వుండవచ్చు. ప్రభుత్వం తన సొంత విధానానికి విరుద్ధంగా బాధిత కుటుంబాలతో సంప్రదింపులు జరిపి సేకరించిన భూములకు బదులుగా చాలా కొద్దిమొత్తాన్ని నష్టపరిహారంగా ఇవ్వజూపింది.

**స్వచ్ఛంద సంస్థలకు స్థానం :**

ప్రాజెక్టుల వల్ల ముంపుకు గురయ్యే ప్రాంత ప్రజల్లో అవగాహన కల్పించడంలో వారికి హక్కుల గురించి తెలియచెప్పి న్యాయమైన తమ డిమాండ్లను ప్రభుత్వంతో సంప్రదింపుల ద్వారా సాధించుకునేందుకు గత కొంతకాలంగా స్వచ్ఛంద సంస్థలు ఎంతో క్రియాశీల పాత్రను పోషిస్తున్నాయి. స్వచ్ఛంద సంస్థలు పునరావాస ప్రక్రియలో పాలు వంచుకోవడానికి, దాని అమలును గుణాత్మకంగా మెరుగుపరచి తమ వంతు కృషి జరపడానికి ఈ ప్రభుత్వ విధానం కూడా వీలు కల్పిస్తుంది. ప్రాజెక్టు స్థాయిలో పునరావాస కమిటీ, పర్యవేక్షక కమిటీ రాష్ట్ర స్థాయిలో పర్యవేక్షక కమిటీలలో స్వచ్ఛంద సంస్థలు ముఖ్య భూమిక పోషించడానికి ఈ విధానం అవకాశం కల్పిస్తుంది. ప్రభుత్వంతో కలిసి బాధిత కుటుంబాల వారికి, ఈ కమిటీల ద్వారా, నిర్ణీత సమయంలోపు ఉత్తమ ప్రయోజనాలు అందించేందుకు స్వచ్ఛంద సంస్థలకు ఇదొక సదవకాశం.

అనేక విషయాల్లో ఈ విధానం ఒక సమగ్రమైన డాక్యుమెంట్. ప్రభుత్వం దీన్ని ఎంత చిత్తశుద్ధితో ఆచరణలో పెడుతుందనేది అతి ముఖ్యమైన విషయం. పోలవరం వంటి భారీ ప్రాజెక్టులు ప్రారంభించేముందు, ఇప్పటికీ పునరావాసం పూర్తి కాని ఏలేరు వంటి ప్రాజెక్టులలో ఏళ్ళ తరబడి నష్టపరిహారం అందని వేల కుటుంబాలకు ఒక దారిని చూపి, ప్రభుత్వం తన నిబద్ధతను నిరూపించుకోవాలి. ఇటువంటి ఆకర్షణీయమైన పునరావాస విధానాలతో కేంద్ర ప్రభుత్వాన్ని మెప్పించి ప్రాజెక్టులకు అవసరమైన అనుమతులతో సరిపెట్టకుండా, రాష్ట్ర ప్రభుత్వం దీన్ని అమలు చేసి ముంపు బాధితులకు న్యాయం చెయ్యకపోతే, అలా సాధించిన అభివృద్ధి, నిజమైన అభివృద్ధి ఎలా అవుతుంది ? ❑

## కొత్త పుస్తకాలు




అబద్ధాల వేట-నిజాల బాట - వ్యాసాలు - నరిసెట్టి ఇన్నయ్య, పరిష్కర్త : ఇసనాక మురళీధర్, 432 పేజీలు, వెల రు. 150. రేషనలిస్ట్ వాయిస్ ప్రచురణ. ప్రతులకు : రేషనలిస్ట్ వాయిస్ పబ్లికేషన్స్, 3-15, ఎపి హౌజింగ్ బోర్డ్ కాలనీ, మౌలాలి, హైదరాబాద్ 500 040

# వీక్షణం రచయితల సమావేశం

అక్టోబర్ 9, 2005 ఆదివారం 'వీక్షణం' రచయితల ఇష్టాగోష్టి సమావేశం సి.డి.ఆర్.సి., హిమాయత్‌నగర్‌లో జరిగింది. ఈ సమావేశంలో ప్రొ. వకుళాభరణం రామకృష్ణ, డి.పాపారావు, ప్రొ.కె.ఆర్.చౌదరి, శ్రీధర్‌దేశ్‌పాండే, ప్రొ.ఎం.కోదండరామ్, విద్యాభూషణ్, జి.వి.రత్నాకర్, ఎస్.సుబ్బారావు, బి.ఎస్.రాజు, వి.హనుమంతరావు, ఎన్. వేణుగోపాల్, కె.దిలీప్, రామ్‌కి, రాము పాల్గొన్నారు.

ప్రధాన సంపాదకులు వి.హనుమంతరావు 'వీక్షణం' తరపున రచయితలకు ఆహ్వానం పలికారు. పత్రిక ప్రారంభ సందర్భం, ఉద్దేశ్యాలు పంచుకున్నారు. వర్కింగ్ ఎడిటర్ ఎన్.వేణుగోపాల్ పత్రికను అభివృద్ధి చేయడానికి రచయితల సలహాలు, సూచనలను ఆహ్వానించారు.

ప్రొ.వి.రామకృష్ణ మాట్లాడుతూ రచయితలకుండే ప్రాధాన్యతలు, విషయాలకుండే తక్షణ ప్రాధాన్యతలు, ఇతర వత్తిడుల వల్ల రాయలేకపోవడం జరుగుతోందని అన్నారు. అయితే దీనికి రచయితల వెంటబడి మరల మరల గుర్తుచేస్తూ, తగినంత సమయమివ్వాలని సూచించారు. ప్రొ.కోదండరామ్ మాట్లాడుతూ లబ్ధప్రతిష్టులే కాక ఇతర రచయితల చేత కూడా మనం రాయించాలన్నారు. ప్రొ.కె.ఆర్.చౌదరి వివిధ సంస్థలు ప్రచురిస్తున్న రిపోర్టులను కూడా ప్రచురించాలన్నారు. డి.పాపారావు మాట్లాడుతూ భిన్న వైఖరులకు స్థానం కల్పించాలన్నారు. విద్యాభూషణ్ మాట్లాడుతూ వీక్షణానికి పాఠకుల నుండి మంచి స్పందన ఉందని, ఇంటర్‌నెట్ పేజి ఒకటుంటే బాగుంటుందన్నారు. ఎస్.సుబ్బారావు మాట్లాడుతూ నిజాయితీగా పనిచేస్తున్న స్వచ్ఛంద సంస్థల రిపోర్టులు ప్రచురించాలని, రాజనీతి శాస్త్ర విద్యార్థులకు కూడ అవకాశం ఇస్తే బాగుంటుందన్నారు. శ్రీధర్ దేశ్‌పాండే తెలంగాణా గురించి వీక్షణం చర్చిస్తుందని తెలిసింది కాబట్టి ఇకపై క్రమం తప్పకుండా రాస్తానన్నారు. బి.ఎస్.రాజు మాట్లాడుతూ కొత్తగా రచనలను చేస్తున్న వారిని ప్రోత్సహించి, సానబట్టాలన్నారు.

వి.హనుమంతరావు వచ్చిన రచయితలందరికి కృతజ్ఞతలు తెలియజేసారు.



ఫోటోలో వున్నవారు ఎడమనుంచి కుడికి - ప్రొ.కె.ఆర్.చౌదరి, ప్రొ.వకుళాభరణం రామకృష్ణ, వి.హనుమంతరావు, ఎన్.వేణుగోపాల్, ప్రొ.ఎం.కోదండరాం, శ్రీధర్ దేశ్‌పాండే, బి.ఎస్.రాజు, జి.వి.రత్నాకర్, డి.పాపారావు, విద్యాభూషణ్, ఎస్.సుబ్బారావు

## కదంబం

# ఇరాక్ మరో వియత్నాం కానున్నదా?

అక్టోబర్ 25న బాగ్దాద్‌కు 25 మైళ్ళ దూరంలోని ఓ పల్లెటూరు సమీపంలో మరణించిన ఇద్దరు అమెరికన్ సైనికులను కలుపుకుంటే ఇప్పటివరకూ ఇరాక్ యుద్ధంలో అమెరికా కోల్పోయిన సైనికుల సంఖ్య 2000కు చేరుకుంది. 2003 మార్చిలో సామూహిక జనహనన ఆయుధాలున్నాయనే నెపంతో ఇరాక్‌పై ఏకపక్ష దాడికి దిగిన అమెరికాకు ఇది ఏమాత్రం మింగుడుపడని పరిణామం. తేలికగా తనదారికి వస్తుందని నమ్మి కన్నూ మిన్నూ గానక ఇరాక్ యుద్ధానికి తెరలేపి అమాయక ఇరాకీలను వేలసంఖ్యలో ఊచకోత కోసినందుకు అమెరికా తగిన మూల్యం చెల్లిస్తున్నట్లు కనపడుతోంది. వరున మానవబాంబుల గెరిల్లా దాడులతో ఇరాక్ నిత్య అగ్నిగుండంగా మారిపోయింది. రోజురోజుకీ అమెరికా గడ్డపై ఈ యుద్ధం ఆపేయాలనే డిమాండ్ ఊపందుకుంటోంది.

**వివిధ యుద్ధాలలో అమెరికా కోల్పోయిన సైనికులు**

| యుద్ధం | సంవత్సరం | మరణాలు |
|---|---|---|
| కొరియన్ | 1950-1953 | 36,574 |
| వియత్నాం | 1964-1975 | 58,200 |
| గల్ఫ్ | 1990-1991 | 382 |
| అఫ్ఘన్ | 2001-కొనసాగుతోంది | 248 (అక్టోబర్ 2005) |
| ఇరాక్ | 2003-కొనసాగుతోంది | 2001 (అక్టోబర్ 2005) |

ఇరాక్ బాడీకౌంట్ అనే బ్రిటీషు పరిశోధనాసంస్థ అంచనా ప్రకారం ఇప్పటివరకూ ఈ యుద్ధంలో మరణించిన ఇరాకీయుల సంఖ్య 30,051 వరకూ ఉండవచ్చు. ఇంకొందరి అంచనాల ప్రకారమైతే ఈ సంఖ్య 1,00,000కు చేరువగా ఉండవచ్చు.



ఈ మారణకాండకు అంతమెప్పుడో కూడా అర్థంకాని అయోమయంలో అమెరికా ప్రభుత్వం ఉంది. ఇదేవారంలో అమెరికా నేతృత్వంలో ఇరాక్ కొత్తరాజ్యాంగంపై జరిగిన రెఫరెండంలో 63 శాతం ఇరాకీ ప్రజలు పాల్గొన్నారనీ ఇందులో అత్యధికులు (78శాతం) ఈ రాజ్యాంగాన్ని ఆమోదించారనీ ప్రసార సాధనాలు వెల్లడించాయి. ఇదే సమయంలో ఈ రెఫరెండం బూటకమనీ అల్-జజీరా వెబ్‌సైట్ ఓ కథనంలో వెల్లడించింది. సద్దాం అధ్యక్షుడిగా ఉన్నప్పుడు జరిగిన రెఫరెండం ఫార్స్‌తో దీన్ని పోల్చిందా ఛానెల్.

అధర్మయుద్ధంలో బందీగా చిక్కి అమెరికా నడుపుతున్న ఇరాకీ ప్రత్యేక ట్రిబ్యునల్ ముందు విచారణ ఎదుర్కొంటున్న సద్దాంహుస్సేన్ కేసు గందరగోళంలో పడింది. అతని లాయర్లలో ఒకరైన సాదున్ జవాబీ అక్టోబర్ మూడోవారంలో హత్యకు గురయ్యారు. దీంతో ఆగ్రహించిన సద్దాం లాయర్లు ఈ విచారణను బహిష్కరిస్తున్నట్లు ప్రకటించారు. ❑

# మనవాళ్ళు కొనేది పనికిరాని చెత్తే



సరళీకృత ఆర్థిక విధానాల పుణ్యమా అని ఇప్పుడు మార్కెట్ సంస్కృతి వర్ధిల్లుతోంది. ఎటు చూసినా షాపింగ్ మాల్‌లు, షోరూమ్‌లు. పల్లె, పట్నం అన్న తేడా లేదు - అన్ని చోట్లా వినియోగం ... వినియోగం. ఇంతకీ మన వాళ్ళు పడీ పడీ కొంటున్న వస్తువులేంటి, అందులో పనికి వచ్చేవేంటి, పనికిరానివేంటి? ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు వెల్లడించింది ఇటీవల విడుదలైన 59 వ రౌండ్ నేషనల్ సాంపిల్ సర్వే. దీని ప్రకారం

- భారతీయులు 1987-88 మధ్య కాలంలో ఆహారంపై 64 శాతం ఖర్చుపెట్టే వారు. 2003కు వచ్చేసరికి అది గ్రామీణ ప్రాంతాల్లో 56 శాతానికి, పట్టణప్రాంతాల్లో 42 శాతానికి పడిపోయింది.
- గ్రామీణ ప్రాంతాల్లో తృణ ధాన్యాలపై పెట్టే ఖర్చు తలసరి వినియోగంలో 26 శాతం (1987-88) నుండి 18 శాతానికి (2003) పడిపోయింది. పట్టణ ప్రాంతాలలో ఇది 15 శాతం నుండి 10 శాతానికి తగ్గింది.
- తాజా గణాంకాల ప్రకారం గ్రామీణ ప్రాంతాల్లోని ఒక వ్యక్తి నెలకు పండ్లు కొనటానికి 10 రూపాయిలు ఖర్చుపెడితే, కూల్‌డ్రింకులు, ఇతర తినుబండారాలపై 25 రూపాయలు ఖర్చు చేస్తున్నారు.
- కూల్‌డ్రింకులు, ఇతర తినుబండారాలపై గ్రామీణ భారతం నెలకు ఖర్చు చేసే మొత్తం ఎంతో తెలుసా? - సుమారు రూ.1854 కోట్లు!
- ఆంధ్రప్రదేశ్‌లో పట్టణ ప్రాంతాలలో తలసరి వినియోగపు ఖర్చులో 14.94 శాతం కూల్‌డ్రింకులకు, ఇతర తినుబండారాలపై ఖర్చు చేస్తారు. గ్రామీణ ప్రాంతాలలో ఇది 9.60 శాతం. ❑

## ఇక్కడ స్త్రీలు వేధించబడతారు




ప్రపంచ వ్యాప్తంగా వెర్రి తలలు వేస్తున్న లైంగిక హింస భారత్‌లో కూడా ప్రమాదకర స్థాయిని చేరుకుందని ఐక్యరాజ్య సమితి నివేదిక వెల్లడిస్తోంది. 'యత్ర నార్యస్తు పూజ్యంతే, రమంతే తత్ర దేవతాం' అన్న నానుడి ఉన్న మనదేశంలో కుటుంబ హింసను ఎదుర్కొంటున్న స్త్రీలలో దాదాపు 70 శాతం ఈ హింస 'న్యాయమైనదే' అని భావించడం మన సమాజంలో స్త్రీ ఎంత పరాధీనంగా ఉందో సూచిస్తోంది.

గృహహింస, లైంగిక హింస, మానసిక హింస వంటి అనేక రూపాలలో స్త్రీలపై కొనసాగుతున్న ఈ దాడి వారిని జీవితాంతం వేదనకు గురిచేస్తోంది. వారి పిల్లలపై కూడా ఈ హింస చెరగని ముద్ర వేస్తోంది. ఈ హింస వల్ల పెరుగుతున్న ఆరోగ్య సేవల ఖర్చు, కోర్టులు పోలీసుల పై పెట్టే ఖర్చు వల్ల ప్రభుత్వాలు కూడా భారీ మూల్యమే చెల్లించాల్సి వస్తుంది. మన దేశంలో సగటున ప్రతి మహిళ హింస వలన ఏడాదిలో వారం రోజులపాటు పని చేయలేని పరిస్థితి ఉన్నది.

మహిళలకు ఆర్థిక స్వేచ్ఛ లేకపోవడం కూడా విచ్చలవిడి హింసకు దారితీస్తున్నదనే అభిప్రాయం కూడా ఈ నివేదిక వ్యక్తపరచింది. దీనికి ఉదాహరణగా కేరళలో స్వంత ఆస్తి లేని 49 శాతం మహిళలపై హింసాత్మక సంఘటనలు జరగగా, స్వంత ఆస్తి ఉన్న మహిళలలో కేవలం 17% పైనే ఇటువంటి దాడులు జరగడాన్ని నివేదిక ఉటంకించింది.

# కదంబం

## వరి జన్యువులపై పేటెంట్



సింజెంటా అనే స్విట్జర్లాండ్ విత్తనాల సంస్థ వరి జన్యువులపై పేటెంట్ కోసం ప్రయత్నిస్తోందన్న వార్త ప్రపంచవ్యాప్తంగా సంచలనం సృష్టిస్తోంది. ఈ కంపెనీ ఇప్పటికే వరి జన్యువులపై పరిశోధనకు సంబంధించి దాదాపు 15 పేటెంట్ దరఖాస్తులు చేసినట్టు సమాచారం.

1997-98 సంవత్సరంలో వరి జన్యువులపై పరిశోధించడానికి ఇంటర్నేషనల్ రైస్ జీనోమ్ సీక్వెన్సింగ్ ప్రాజెక్ట్ (ఐ ఆర్ జి ఎస్ పి) ఏర్పాటైంది. ఈ ప్రాజెక్టులో చైనా, జపాన్, భారత్, అమెరికా, బ్రెజిల్, దక్షిణ కొరియా, థాయిలాండ్, బ్రిటన్‌కు చెందిన అనేక ప్రభుత్వ, ప్రైవేటు పరిశోధనా సంస్థలు భాగస్వాములుగా ఉన్నారు. అయితే రైస్ జీనోమ్ ప్రాజెక్టు మొదలైన వెంటనే బహుళజాతి విత్తనాల కంపెనీలైన మోన్‌సాంటో, సింజెంటాలు కూడా వరి జన్యువులపై పరిశోధన ప్రారంభించాయి. సింజెంటా, ఐ ఆర్ జి ఎస్ పి 2000 సంవత్సరం నుంచి పరస్పరం సహకరించుకున్నాయి. 2005 ఆగస్టులో వరి జన్యువుల అమరికను 99.9 శాతం కనుక్కున్నట్టు ఐఆర్‌జిఎస్‌పి ప్రకటించి వరి జన్యువుల అమరికను బహిర్గత పరిచింది.

అయితే నెల తిరక్కుండానే ఇప్పుడు సింజెంటా వరి జన్యువుల అమరికకు సంబంధించి పేటెంట్లకు దరఖాస్తు చేసింది.

ప్రపంచవ్యాప్తంగా దాదాపు 300 కోట్ల మందికి వరి ముఖ్య ఆహారం. ప్రపంచవ్యాప్తంగా పండే వరిలో 95 శాతం అభివృద్ధి చెందుతున్న దేశాలు పండిస్తాయి. ప్రపంచ దేశాలలో పండించే దాదాపు 60 శాతం వరి విత్తనాలు సాంప్రదాయ పద్ధతులలో భద్రపరచినవే. అందుకే వరిపై బహుళజాతి విత్తన కంపెనీలకు ఇంత మక్కువ.

త్వరలోనే వరి జన్యువుల పేటెంట్ కోసం ఐఆర్‌జిఎస్‌పి కూడా దరఖాస్తు చేయనున్నదన్న వార్త కోట్లాది పేద ప్రజలకు ఇప్పుడు మినుకు మినుకుమనే చివరి ఆశ.

## కొత్త రకం శరణార్థులు

మారుతున్న పర్యావరణ పరిస్థితులు ఒక కొత్త రకం 'శరణార్థులను' సృష్టిస్తున్నాయని, వీరి సంఖ్య 2010 నాటికి 5 కోట్లకు చేరవచ్చుని అంటోంది యునైటెడ్ నేషన్స్ యూనివర్సిటీ వారి సరికొత్త నివేదిక.

యు.ఎన్. డే ఫర్ డిజాస్టర్ రిడక్షన్ గా పిలవబడే అక్టోబర్ 12నాడు విడుదల చేసిన ఈ రిపోర్టు అనేక ఆశ్చర్యకర గణాంకాలు, వివరాలు వెల్లడించింది. దీని ప్రకారం ఇప్పటి వరకూ శరణార్థులుగా గుర్తించబడిన వారిలో ఈ 'పర్యావరణ శరణార్థులు' లేరు. అయితే నానాటికీ పెరిగిపోతున్న ప్రకృతి వైపరీత్యాల కారణంగా భారీ సంఖ్యలో ప్రజలు తమ నివాసాలను వదిలి, ఇతర ప్రాంతాలకు వలస వెళ్తున్నారు. సునామీ, హరికేన్ రీటా వంటి విపత్తులు సంభవించినప్పుడు సహాయ సహకారాలందుతున్న మాట నిజమే అయినా క్రమంగా జరుగుతున్న పర్యావరణ మార్పుల వల్ల వలసపోతున్న వారికి ప్రభుత్వ సంస్థలు పెద్దగా సాయపడలేక పోతున్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఆనకట్టల నిర్మాణం వలన దాదాపు 10 కోట్ల మంది ప్రజలు నిర్వాసితులైనట్టు ప్రపంచ బ్యాంక్ అంచనా వేసింది.

ఐక్యరాజ్యసమితి అండర్ సెక్రటరీ జనరల్ హాన్స్ వాన్ గింకెల్ 'శరణార్థి అనే మాటను పునర్ నిర్వచించుకోవలసిన సమయం ఆసన్నమైంది' అంటున్నారు.

# తెర వెనుక మాయమవుతున్న జీవితం!

డి.వి.రామకృష్ణారావు

అమెరికా దేశంలోని ఒక మహా నగరంలోని కథ. అసలే అమెరికా, అందునా మహానగరం అంటే జీవితం ఎంత వేగంగా, యాంత్రికంగా ఉంటుందో మనం ఊహించుకోవచ్చు. ఈ కథను నేను చాలారోజుల క్రితం ఒక స్నేహితురాలి వద్ద విన్నాను. రచయిత పేరు గుర్తు లేదు. నేను పంచుకుందామనుకున్న విషయానికి దగ్గరయిన కథ. అమెరికా దేశపు మహానగరంలో ఒక యువజంట కలిసి జీవిస్తుంటారు. వాళ్ళ మధ్య చిన్న చిన్న భిన్నాభిప్రాయాలు తలెత్తుతాయి. ఒకరిమీద ఒకరు అలిగి ఇద్దరూ మాట్లాడుకోవడం మానేస్తారు. నెమ్మదిగా వాళ్ళ మధ్య దూరం పెరుగుతూ వుంది. మాట్లాడుకుని సరిదిద్దుకునే సమయాలూ లేవు. ఎవరి ఉద్యోగాలు, ఎవరి వ్యాపకాలు వారివి. ఇద్దరూ విడిపోదామనుకునే స్థాయికి వారి మానసిక పరిస్థితి చేరిపోయింది. నగరంలో ఇంకో చోట ఆమె వేరే ఫ్లాట్ చూసుకుంది. అతను కూడా మరొక ఫ్లాట్ చూసేసుకున్నాడు. ఇలా వాళ్ళు విడిపోదామనుకునే ఆలోచనకు అనుగుణంగా ఎవరి ప్రయత్నాల్లో వాళ్ళుంటారు. ఈలోపు నగరానికి విద్యుత్ సరఫరాచేసే పవర్ గ్రిడ్ ఫెయిలవుతుంది. నగరమంతటా కొద్దిరోజులు కరెంటు వుండదు. కరెంటు లేకపోవడంతో నగర జీవితం కాస్త మందగిస్తుంది. ఇంట్లో ఇప్పుడు టీవీ కూడా పనిచేయడం లేదు. కొవ్వొత్తుల దీపపు కాంతిలో సాయంత్రాలు ఆ యువజంట నెమ్మదిగా మాట్లాడుకోవడం మొదలుపెడతారు. అలా మాట్లాడుకుంటూ వారిని బాధించిన సంఘటనలు, సందర్భాలు పరస్పరం వ్యక్తపరచుకుంటారు. నెమ్మదిగా ఒకరినొకరు అర్థం చేసుకోవడం మొదలుపెడతారు. పశ్చాత్తాపపడతారు. కరెంటు ఫెయిల్యూర్‌తో దొరికిన వెసులుబాటుతో వాళ్ళు మాట్లాడుకుంటారు. మళ్ళీ ఒకటవుతారు. సంక్షిప్తంగా ఆ కథ ఇది.

సరిగ్గా ఇలాంటి విచ్ఛిన్నమైపోతున్న జీవన పరిస్థితులలో మనమంతా జీవిస్తున్నామనిపిస్తుంది. ఎందుకంటే ఎప్పుడూ ఆఫీసుల్లో కంప్యూటర్లు, ఇంట్లో టీవీలు , చేతుల్లో సెల్‌ఫోన్‌లు ఇలా ఏదో ఒక తెర మనను కమ్ముకుపోయింది. సున్నితమైన మానవ సంబంధాల మధ్య ఈ తెరలు అడ్డుగోడలుగా నిలుస్తున్నాయనిపిస్తుంది. ఏదో తెరకు అతుక్కుపోయి, అచేతనంగా పడి వున్నామనిపిస్తుంది. వాస్తవ జీవితానికి చాలా దూరంగా బతుకుతున్నామనిపిస్తుంది. అలా అని సాంకేతిక పరిజ్ఞానాన్ని మొత్తంగా తిరస్కరించడం ఎంత మాత్రం కాదు. అవి ఎవరి ప్రయోజనాలను నెరవేరుస్తున్నాయి? ఎటువంటి విలువలు, జ్ఞానాన్ని మనకిస్తున్నాయి అని ఆలోచన చేసినప్పుడు చొచ్చుకొస్తున్న సామ్రాజ్య వాద విలువలు, ముంచుకొస్తున్న మార్కెటింగ్ సంస్కృతి మనకు విస్పష్టంగా కనిపిస్తాయి.

టీవీలు ఇంతగా లేని సందర్భాన్ని గుర్తు చేసుకున్నప్పుడు కుటుంబ సభ్యులంతా కలసి మాట్లాడుకోవడం, రోజువారీ దినచర్యలో, పని వద్ద ఎదురైన తమ అనుభవాలు కలబోసుకోవడం వుండేది. ఇంటి పనిలో, ఇరుగూ, పొరుగూ, వారి చిన్న చిన్న పనులలో సహాయ సహకారాలు చేసుకోవడం వుండేది. ఇప్పుడు ఎవరి దగ్గరకు పోయినా చేసే పని ఉమ్మడిగా టీవీని వీక్షించడం. సమయం అయిపోయిందనుకోగానే హడావుడిగా విడిపోవడం. ఒకే ఇంటి పై కప్పు కింద వున్న నలుగురి మధ్య కనిపించని గోడలా ఈ టీవీ తెర. వళ్ళు తోమడం, తినడం, పడుకోవడం, మాట్లాడుకోవడం అన్నీ ఈ బ్యాక్‌డ్రాప్‌లోనే జరుగుతున్నాయి.

ఇంటి నుంచి బయట పడ్డాక కూడా రైల్వే స్టేషన్లు, హోటళ్ళు, బస్‌లు, చిన్న చిన్న దుకాణాల్లో ఇలా చెప్పుకుంటూ పోతే ఎక్కడ పడితే అక్కడ ఈ టీవీ తెర మన ఆలోచనల్లోకి, పనుల్లోకి, మాటల్లోకి వచ్చి అడ్డుపడుతూ వుంటుంది. క్రికెట్, పాటలు మధ్యమధ్యలో న్యూస్, సినిమా... ఇలా దృశ్యాలు మారిపోతుంటాయి. కోకొల్లలుగా వాణిజ్య ప్రకటనల హోరు. మొత్తంగా ఆలోచించినప్పుడు టీవీలో ప్రసారమయ్యే కార్యక్రమాలు, వాణిజ్య ప్రకటనలు, కలిగే వినోదం, పొందే జ్ఞానం కంటే మెదడు చచ్చు పడడానికి కావలసినంత అవకాశం వుందనిపిస్తుంది.

ఉన్నత వర్గాల కుటుంబ తగాదాలు, వాళ్ళ పట్టుదలలు , ఎత్తుకు పైఎత్తులు, కుతంత్రాలు, పన్నాగాలు, హత్యలు ఇవి సీరియల్స్‌గా వస్తుంటాయి. అత్తాకోడళ్ళ మధ్య, అన్నాదమ్ముల మధ్య, ఆడపడుచుల మధ్య మరింత ఘర్షణలు పెంచే విధంగా సన్నివేశ చిత్రణలుండడం మనం చూస్తాం. పిల్లల కార్యక్రమాలుగా వచ్చేవి కూడా శక్తిమాన్‌లు, సూపర్‌మాన్‌లు, స్పైడర్‌మాన్‌లు, అభూతకల్పనలు, క్షుద్ర సీరియల్స్‌ని ప్రసారం చేయడం మనం చూస్తాం. సెక్యులర్ భావనలు పోయి అన్ని మతాలను సమాన దూరంలో వుంచడం కాక, అన్ని మతాలను సమాన దగ్గర (?) లో ఉంచడం మనం చూస్తాం. మతాన్ని పెంచడమో, విద్వేషాన్ని పెంచడమో చూస్తాం. ప్రభుత్వం ప్రసారం చేసే దూరదర్శన్ ఛానల్‌కు ఏకంగా 'సప్తగిరి' అని పేరు పెట్టడాన్ని చూస్తే ఈ విషయం మనకు మరింత స్పష్టంగా అర్థమవుతుంది.

ఆత్మీయులకు వీడ్కోలు చెప్పాలని స్టేషన్‌కు పోయి అక్కడి టీవీలో అనవసరమైనదేదో చూసే ధ్యానలో పడిపోయి అమూల్యమైన ఆ వీడ్కోలు సందర్భం యాంత్రికంగా గడిపేయడం చూస్తాం. మొత్తంగా చూస్తే చాలా అప్రమత్తంగా వుంటే తప్ప మన మనసులో వున్నది ఎదుటివారితో పంచుకునే పరిస్థితి లేదు. అనుకోకుండా కలసి , అనుకోకుండా పలకరించి, అనుకోవలసింది అనుకోకుండా విడిపోవడం మనం గమనించవచ్చు.

పసిపిల్లల నుండి వృద్ధుల దాకా వికృతమైన విలువల ప్రభావానికి లోనవడం, విపరీత ప్రవర్తనలను వ్యక్తపరచడం మనం గమనించవచ్చు. ఆమధ్య ఒక ఊళ్ళో జరిగిన సంఘటన ఒకటి మీకు చెప్తాను. ఒక పదహారేళ్ళ అబ్బాయి, వాళ్ళ బంధువులింట్లో పిల్లలకు తోడుగా పడుకున్నాడు. పెద్దాళ్ళు పక్కనే వున్న ఊరికి పనిమీద పోయారు. పిల్లల్లో ఒక పాపకు అయిదేళ్ళు. ఇంకో పాపకు 8 ఏళ్ళు. తోడుగా వుండడానికి వచ్చిన ఆ అబ్బాయి రాత్రి టీవీలో అశ్లీల దృశ్యాల ప్రభావానికి లోనై అయిదేళ్ళ పాపను రేప్‌చేసి చంపేసిన ఘటన టీవీ కలగచేస్తున్న దుష్ప్రభావానికి ఒక ఉదాహరణ మాత్రమే. ఇలాంటి దుర్మార్గాలు, విలువల పతనం, వెలుగులోకి రాని సంఘటనలు ఎన్నో ఎన్నెన్నో మన చుట్టూ జరుగుతున్నాయి.

నిరంతరంగా ప్రసారమయ్యే శబ్ద, దృశ్యాల వల్ల చెవులకు, కళ్ళకు, అంతిమంగా మెదడుకు తీవ్రమైన ఒత్తిడి కలిగి నిద్రలేమితో నిరంతరం తలనొప్పితో బాధపడుతున్నారు. ధ్వని, దృశ్య, ఆలోచనల కాలుష్యంతో రక్తపోటుకు , గుండెపోటుకు గురవుతున్నారు. మొత్తంగా శరీర కదలికలు తగ్గిపోయి ఏ పనికీ కదలలేకుండా అచేతనంగా పడివుండే స్థితి కనపడుతోంది. గతంతో పోల్చుకున్నప్పుడు ఇప్పుడు మనుష్యులు మాట్లాడుకునే సరాసరి సమయం తగ్గిపోయింది. మనుషులు ఒకరినొకరు చూసుకునే, పరిశీలించుకునే, పలకరించుకునే సమయాలు తగ్గిపోయాయి. మానవీయమైన స్పర్శ, స్పందన, ప్రేమలు తగ్గిపోయాయి.

ఇక కంప్యూటర్లు వచ్చాక పరిస్థితి మరింత దిగజారిపోయింది. ఉత్తరాలు రాసుకున్నా, సంగీతం వినాలన్నా, ఆఫీసు పనయినా, విజ్ఞానం వెతుక్కోవాలన్నా, ఆటలైనా, చివరకు అశ్లీల దృశ్యాలకు, విలువలకు అన్నింటికీ వేదికై పోయింది. ఈ-సేవలు, ఈ-మెయిల్స్, ఈ-బ్యాంకింగ్ ఇలా జీవితం అన్ని పార్శ్వాలలోకి చొచ్చుకొచ్చింది. అవసరంగా కంప్యూటర్‌లో గడిపే సమయం గురించి నేను మాట్లాడడం లేదు. ఒక అవసరానికి పోయి అనవసరంగా గంటలకు గంటలు కంప్యూటర్ వద్దనే గడుపుతున్న సమయం గురించి మాట్లాడుతున్నాను. ఇంతేకాక కంప్యూటర్ నేర్చుకొనే పేరుతో యువత పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చిన సైబర్‌కేఫ్‌లు అందిస్తున్న అశ్లీల మత్తులో మునిగిపోతున్నారు. విలువలు పతనమై పోతున్న భవిష్యత్‌కు పునాది అవుతున్నారు.

ఇక సెల్‌ఫోన్ సరేసరి. డ్రైవ్ చేసేటప్పుడు, రోడ్డుపైన, ఇంట్లో ఎక్కడపడితే అక్కడ ప్రశాంతంగా నడక సాగకుండా, ఆలోచనలు సాగకుండా నిరంతర వేధింపయిపోయింది. అటు మార్కెటింగ్ ఉద్యోగుల నుంచీ, చివరకు చదువుకునే విద్యార్థుల వరకూ అవసరం ఉన్నా లేకపోయినా కర్ణుడి కవచకుండలాల్లాగా మన దేహంలో ఒక భాగమైపోయింది. కలుసుకున్న ఏ ఇద్దరూ పదినిమిషాలు కూడా ఏకాగ్రతతో మాట్లాడే పరిస్థితి, వినే పరిస్థితే లేవు. ఉండేది, కలిసేది ఒకరిని, మాట్లాడేది ఇంకెవరితోనో అన్నట్లు అయిపోయింది జీవితం.

ఈమధ్య చేసిన సర్వేలో వెల్లడయిన ఆసక్తికరమైన విషయమేమంటే అధిక శాతం మంది రోజుకు మూడుగంటలకన్న ఎక్కువగా టీవీని చూస్తున్నారు. దీనినిబట్టి మానవసంబంధాలకూ, సంభాషణలకూ ప్రేమలు వ్యక్తపరచుకోవడానికి, కలవడానికి, ఆలోచించడానికి మిగతా సమయమెంతో మనం అంచనా వేసుకోవచ్చు. 5-7 గంటలు నిద్ర, 8-10 గంటలు ఉద్యోగం, 1-4 గంటలు ఉద్యోగానికి పోయి రావడానికి చేసే ప్రయాణం (నగరాల్లోనయితే), మూడుగంటలకి పైగా టీవీ చూడడం అయితే, ఇంక మానవసంబంధాలకి మిగిలే సమయమెంతో మనం లెక్కకట్టుకోవచ్చు. ఇలాంటి సంక్లిష్ట పరిస్థితుల్లో చాలా అప్రమత్తంగా, జాగరూకతతో మానవసంబంధాలు, ప్రేమలను కాపాడుకోవలసి వుంది. ❑

కరపత్రం:

# పోలవరం ప్రాజెక్టును ఎందుకు వ్యతిరేకిస్తున్నాం?

**పో**లవరం రాష్ట్ర ప్రభుత్వం తలపెట్టిన 'జలయజ్ఞం'లోని అత్యంత ప్రతిష్ఠాత్మకమైన ప్రాజెక్టు. దానిని ఏ విధంగానయినా పూర్తిచేస్తానని ముఖ్యమంత్రి ప్రకటిస్తున్నాడు. దానికి ఏ అనుమతులూ లేవుకదా అంటే అనుమతుల అవసరం ఏమిటని ఒకసారి అంటాడు, ముందు పని ముగించేసుకొని ఆ తరువాత అనుమతులు తెచ్చుకోకూడదా అని ఇంకొకసారి అంటాడు. ఇదిగో అనుమతులు తెచ్చేస్తున్నామని వేరొకసారి అంటాడు.

పోలవరం కట్టదగ్గ ప్రాజెక్టయితే ఈ పట్టుదలను అభినందించవచ్చు. దానికి సహాయం కూడా అందియ్యవచ్చు. కానీ అది కట్టదగ్గ ప్రాజెక్టు కాదని మానవహక్కుల వేదిక అభిప్రాయం. ఇది అభివృద్ధి నిరోధకమైన అభిప్రాయం అని చాలామంది అనబోతారు కాబట్టి దీనిని వివరించడం అవసరం అని మేము భావిస్తున్నాం.

స్థూలంగా మూడు కారణాల వల్ల ఈ ప్రాజెక్టును వ్యతిరేకించాలని అనుకుంటున్నాం. ఒకటి, అది ఆదివాసుల జీవితాలను పెద్దఎత్తున విధ్వంసానికి గురి చేస్తుంది. రెండు, ఇప్పటికే అభివృద్ధి చెందిన ప్రాంతాలను మరింత అభివృద్ధి చేయడానికి ఇప్పటికే వెనకబడి ఉన్న ప్రాంతాలను, ప్రజలను ముంచుతుంది, నిర్వాసితులను చేస్తుంది. మూడు, ఉత్తర తెలంగాణ జిల్లాలలోని మెట్ట భూములకు తగిన మోతాదులో గోదావరి జలాలను దక్కకుండ చేస్తుంది.

పోలవరం ప్రాజెక్టు స్వరూపాన్ని గురించి సమగ్రమైన నివేదిక ఇప్పటివరకు ప్రభుత్వం ప్రజల ముందు ఉంచలేదు. చేపడుతున్న కాలవల నిర్మాణానికీ ప్రకటించుకున్న ప్రాజెక్టుకూ పొంతన కనిపించడం లేదు. ప్రకటించుకున్న ప్రాజెక్టు లెక్కల ప్రకారం పోలవరం ప్రాజెక్టు ఉభయ గోదావరి, కృష్ణా జిల్లాలలో 7 లక్షల 27 వేల ఎకరాలకు సాగునీరు ఇస్తుంది. 975 మెగావాట్ల విద్యుత్తు ఉత్పత్తి చేస్తుంది. 23 టిఎంసిల నీళ్లు ఎడమ కాలవ ద్వారా విశాఖపట్నం దాకా అనేక గ్రామాలకూ, పట్టణాలకూ తాగడానికీ, పరిశ్రమల అవసరాలకూ ఇస్తుంది. 80 టిఎంసిల నీటిని కుడి కాలవ ద్వారా కృష్ణా బేసిన్‌కు తరలించి కృష్ణా బేసిన్ ఎగువ ప్రాంతాల నీటి అవసరాలు తీరుస్తుంది. ఈ అవసరాల కోసం పోలవరం దగ్గర నిర్మించబోయే డ్యాం నుండి అది 325 టిఎంసిల నీళ్లు తీసుకుంటుంది.

ఈ ప్రయోజనాలు సాధించడానికి ఈ ప్రాజెక్టు ఎంత విధ్వంసం సృష్టించబోయేదీ ప్రభుత్వం చెప్పడంలేదు. స్పష్టమైన సమాచారం ఇవ్వకుండ 'నిర్వాసితులను తప్పక ఆదుకుంటాం' అనీ 'నిర్వాసితులకు ఏ కష్టమూ రానివ్వం' అనీ ప్రకటిస్తున్నది. అప్పుడెప్పుడో 15 సంవత్సరాల క్రితం జరిగిన సర్వేలను బట్టి, ఈ ప్రాజెక్టు కింద మూడు జిల్లాలలో 9 ఏజెన్సీ మండలాలు ముంపుకు గురవుతాయి. 276 గ్రామాలు పూర్తిగానో పాక్షికంగానో మునుగుతాయి. అప్పటి జనాభా లెక్కల ప్రకారం ఒక లక్షా పదిహేడు వేల మంది నిర్వాసితులవుతారు.

ఆ మండలాలు పోలవరం (పశ్చిమ గోదావరి జిల్లా), దేవీపట్నం (తూర్పు గోదావరి జిల్లా), వరరామచంద్రాపురం, కూనవరం, చింతూరు, భద్రాచలం, బూర్గంపాడు, కుకునూరు, వేలేరుపాడు (ఖమ్మం జిల్లా). ఇవన్నీ ఏజెన్సీ మండలాలే. జనాభాలో దాదాపు సగం మంది ఆదివాసులు, ప్రధానంగా కోయ, కొండరెడ్డి తెగలవారు.

అప్పటికీ ఇప్పటికీ ముంపు గ్రామాల సంఖ్య పెరగకున్నా వాటిలోని జనాభా తప్పక పెరిగే ఉంటుంది. ఇప్పుడు లక్షా యాభైవేల దాకా ఉండవచ్చు. వీరికి పునరావాసం ఇస్తామని ప్రభుత్వం ఎన్ని మాటలు మాట్లాడినా వీరి జీవన ప్రమాణం ఇప్పుడున్న దానికంటే బాగా పడిపోతుందనడంలో సందేహమేమీ లేదు. ప్రాజెక్టు వల్ల ముంపుకు గురయ్యే ప్రజలకు తొలిసారిగా పునరావాస 'హక్కు' కల్పిస్తూ రాష్ట్ర ప్రభుత్వం మొన్నటి ఏప్రిల్ నెలలో జారీచేసిన జీవో 68లో నిర్వాసితుల జీవన ప్రమాణం పడిపోకుండ చూసే నదుపాయమేదీ లేదు. తాత్కాలిక ఆర్థిక సహాయం మాత్రమే ఆ జీవో ఇస్తుంది. నిర్వాసితులు కాబోయే వారిలో సగం మంది ఆదివాసులని ముందే చెప్పాం. వారికి ఏజెన్సీలోనే పునరావాసం కల్పించడానికి భూమి లేదు. అటవీ సంరక్షణ చట్టం ఒప్పుకోదు. ఏజెన్సీ బయట వారికి పునరావాస కాలనీలు ఒకవేళ ఏర్పాటు చేసినా వారక్కడ జీవనాధారం ఇప్పుడున్న దానిలో పదవ వంతు కూడా సంపాదించలేరు. అడవి ఇచ్చే పుష్కలమైన ఉమ్మడి ఫలసాయం, రకరకాల గింజలు, ఆకులు, దుంపలు, జిగురు, తేనె మొదలైన చిన్నతరహా అటవీ ఉత్పత్తులు, వంట చెరుకు, పశుగ్రాసం బయట దొరకవు. షెడ్యూల్డు ప్రాంతానికి ప్రత్యేకమైన చట్టాల రక్షణా ఇక ఉండదు.

రాజకీయంగా నోరులేని ప్రజల జీవితాలను ఇంతటి విధ్వంసానికి గురి చేసి, ఇప్పటికే అంతో ఇంతో బాగున్న వారి బతుకులు ఇంకింత బాగు చేయడం కోసం కడుతున్న ప్రాజెక్టును కట్టదగ్గదిగా ఎందుకు భావించాలి?

దాని బదులు అవే గ్రామాలకు అదే నీటిని సాగునీరుగా అందియ్యడం నిజమైన అర్థంలో 'అభివృద్ధి' కాదా అని కూడా అడుగుతున్నాం. పోలవరం ప్రాజెక్టు కింద మునగబోయే 276 గ్రామాలు గోదావరి నది ఒడ్డున ఇటూ అటూ ఉన్నాయి. వాటిని దాటి కిందికి ప్రవహించి, కింద రాబోయే పోలవరం కట్ట తాకిడికి వెడల్పయి ఆ గ్రామాలను ముంచబోయే నది నీటిని, ఎత్తిపోతల

ద్వారా గానీ వేరే ఏ రకంగానయినా గానీ అవే గ్రామాలకు సాగునీరుగా అందించినట్లయితే ఆ నీటిని సద్వినియోగం చేసినట్టూ అవుతుంది, మైదాన ప్రాంతాల వారి బతుకులనే కాక అడవిబిడ్డల బతుకులనూ బాగు చేసినట్లవుతుంది. అభివృద్ధిలో సమతుల్యమూ సాధించినట్లవుతుంది. బాగున్నవాళ్ళను ఇంకా బాగుచేయడానికి ఏమీలేని వాళ్ళను ఇంకింత నాశనం చేయడం ఏరకమైన అభివృద్ధి ?

ఈ పని చేస్తే మహా అయితే ఒక లక్ష ఎకరాలు సాగులోకి వస్తాయేమోగానీ ఇప్పుడు కట్టబోయే ప్రాజెక్టు వల్ల ఏడు లక్షల ఎకరాల సాగు, 975 మెగావాట్ల కరెంటు వగైరా ఒనగూడుతాయి కదా అంటారేమో. 'అభివృద్ధి' అనే దానిని 'ఎంత' అనే తప్ప 'ఎవరికి' అనే ప్రశ్నతో బేరీజు వేసుకోనక్కరలేదనే ఈ వైఖరే అప్రజాస్వామికం అని మేము అంటున్నాం. టోకున ఎన్ని ఎకరాలు సాగులోకి వచ్చాయి, ఎన్ని ఊర్లకు నీళ్ళందాయి అని మాత్రమే కాక ఎవరి భూములకు అందాయి? ఏ ఊర్లకు అందాయి? అని ప్రశ్నించుకొని సమతుల్యాన్ని పెంచే ప్రత్యామ్నాయాన్ని ఎంచుకోవడం మెరుగయిన, ప్రజాస్వామికమైన అభివృద్ధి పంథా అని అంటున్నాం.

దానివల్ల గోదావరి జలాలలో మన వాటా నీళ్ళు మనం పూర్తిగా వాడుకోక 'వృథా' కానివ్వడం జరుగుతున్నదని భయపడనవసరం లేదు. పోలవరం ముంపు ప్రాంతానికి ఎగువన ఇదే నీటిని వెనుకబడిన తెలంగాణ జిల్లాల కోసం ఉపయోగించడానికి తలపెట్టిన ప్రాజెక్టులు అతీగతీ లేకుండా ఉన్నాయి. 85 టిఎంసిల నీటిని వినియోగించుకోగల ఇచ్చంపల్లి ప్రాజెక్టు పొరుగు రాష్ట్రాల అభ్యంతరాల కారణంగా మొదలే కాకుండ ఉండిపోయింది. దానిని తగిన విధంగా రూపొందించే ఆలోచన చేస్తే అది సమతుల్యంతో కూడిన అభివృద్ధికి దోహదపడుతుంది. 'దేవాదుల' అనే పేరుతో మొదలయి ఇప్పుడు గోదావరి ఎత్తిపోతల పథకం అనే పేరుతో కేవలం 5 టిఎంసిల వినియోగానికి భారీగా నిర్మిస్తున్న ప్రాజెక్టు ద్వారా 50 టిఎంసిల దాకా నీళ్ళు తీసుకొని కరీంనగర్, వరంగల్, మెదక్, నల్లగొండ జిల్లాల ఎగువ ప్రాంత భూములకు సాగునీరిచ్చే ఆలోచన ప్రభుత్వ ప్రణాళికలోనే ఉంది. తెలంగాణ జిల్లాలకు నీళ్ళివ్వగల ప్రతిపాదిత ప్రాజెక్టులు (శ్రీరాంసాగర్ వరద కాలవ, ఎల్లంపల్లి వగైరా) ఉన్నాయి గానీ అవి పోలవరంతో నీటి కేటాయింపుకు పోటీకి రాగల ప్రాజెక్టులు కావు కాబట్టి వీటిని మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తున్నాం.

పోలవరం ప్రాజెక్టు నిర్మాణంలో భాగంగా ప్రస్తుతం తవ్వుతున్న కాలవలనూ ప్రాజెక్టు ఫలితాల గురించి ప్రభుత్వం చెప్తున్న మాటలనూ బట్టి చూస్తే పై ప్రాజెక్టులకు నీళ్ళేమయినా ఉంటాయా అన్న సందేహం వస్తుంది. పోలవరం ద్వారా కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాలలో ఏడు లక్షల ఇరవై ఏడు వేల ఎకరాలు కాదు 16 లక్షల ఎకరాలకు నీళ్ళిచ్చే ఆలోచన ఉన్నట్టు ప్రభుత్వం ప్రకటనలు తెలియచేస్తున్నాయి. గోదావరి డెల్టాలో పదిన్నర లక్షల ఎకరాల స్థిరీకరణ కూడా పోలవరం ద్వారా చేపడతామని అంటున్నారు. పోలవరం నీళ్ళు ఎప్పుడొస్తాయోనని దానికి ప్రత్యామ్నాయంగా దానికి ప్రతిపాదిత ఆయకట్టులోనే కొంత భాగాన్ని తడపడానికి రూపొందించిన తాడిపూడి పుష్కరం ప్రాజెక్టులను ఒకవైపు పూర్తి చేస్తూ, మళ్ళీ అదే ఆయకట్టుకు పోలవరం కాలువలు కూడా తవ్వుతున్నారు. తొలినాటి అంచనాల ప్రకారం పోలవరం ప్రధాన కాలవ 9000 క్యూసెక్కుల ప్రవాహం కోసం నిర్మించాలని ఉండగా ఇప్పుడు 17,500 క్యూసెక్కుల ప్రవాహానికి తగినట్టు నిర్మిస్తున్నారు. చాలా వెడల్పుగా లోతుగా నిర్మిస్తున్నారు.

దీనిని బట్టి చూస్తే పోలవరం ద్వారా 325కాదు, 500 టిఎంసిల దాకా నీళ్ళు తీసుకునే ఆలోచన ఉన్నట్టు స్పష్టం అవుతుంది. కేవలం వ్యవసాయానికేనా లేక కోస్తా జిల్లాలలో వేగంగా అభివృద్ధి చెందుతున్న పారిశ్రామిక అవసరాలకూ తీసుకోబోతారా అన్న సందేహాలూ ఉన్నాయి. సమాచారాన్ని ఒక హక్కుగా భావిస్తున్న ఈ రోజులలో ఈరకమైన ఊహాగానాలు చేయడం మనకు సిగ్గనిపించినా సమాచారాన్ని దాచిపెట్టడం ప్రభుత్వానికి సిగ్గనిపించడం లేదు కాబట్టి కంటికి కనిపిస్తున్న విషయాలను బట్టి ఈ ప్రశ్నలు వేసుకోవలసి వస్తున్నది.

పూర్తయిపోయిన ప్రాజెక్టులు పోను గోదావరి జలాలలో మన రాష్ట్ర వాటా ఇంక 680 టింఎసిలే ఉందని నిపుణుల అంచనా. అందులో 500 పోలవరం ద్వారా తీసుకునేటట్టయితే ఎగువన ఉన్న తెలంగాణ జిల్లాల అవసరాలకేం మిగులుతుంది? ప్రాంతీయ అసమానతలు అప్రజాస్వామికం అని అందరూ ఒప్పుకుంటున్నట్లు మాట్లాడుతున్న ఈరోజులలో ఇటువంటి ప్రాజెక్టులను అంగీకరించగలమా?

పైగా దుమ్ముగూడెం, ఇచ్చంపల్లి మొదలయిన ప్రాజెక్టులు పోలవరం ప్రాజెక్టు భద్రతకు కూడా అవసరం అని నిపుణులు అంటున్నారు. గోదావరి నదిలో సంవత్సరంలో కొన్ని దినాలు పెద్దెత్తున ప్రవాహం ఉంటుంది. 20 లక్షల క్యూసెక్కుల నుండి 36 లక్షల క్యూసెక్కుల దాకా ఈ ప్రవాహ పరిమాణం ఉండగలదు. ఎగువన కట్టవలసిన ప్రతిపాదిత ప్రాజెక్టులేవీ కట్టకపోతే పోలవరం ఆనకట్టే నేరుగా ఈ ప్రవాహాన్ని భరించవలసి వస్తుంది. దానికది తట్టుకోలేదనీ పెద్దెత్తున విధ్వంసం జరిగే ప్రమాదముందనీ నిపుణులు అంటున్నారు. అంతా నాకే కావాలన్న ఆశపోతుతనం మన ఆరోగ్యానికి కూడా మంచిదికాదు మరి!

గోదావరి జలాలను కృష్ణా బేసిన్‌కు తరలించడం పోలవరం ప్రాజెక్టు ముఖ్య లక్ష్యాలలో ఒకటని రాష్ట్ర ప్రభుత్వం అంటున్నది. తొలినాటి అంచనాల ప్రకారం తరలించబోయేది 80 టిఎంసిలే. అందులో 35 టిఎంసిలు కర్నాటక, మహారాష్ట్రల వాటాగా పోతాయి. ఆమేరకు ఆ రాష్ట్రాలు కృష్ణా జలాలను ఎగువన అప్పుకుంటాయి. ఇంక మిగిలిన నీటి బదిలీ 45 టిఎంసిలే. అయినప్పటికీ ఇది రాయలసీమలోని కరువుప్రాంత ప్రాజెక్టుల అవసరాలకు ఉపయోగపడుతుందని పోలవరం ప్రాజెక్టును సమర్థిస్తూ చేసే ఒక ముఖ్య వాదనగా ప్రభుత్వం అంటున్నది.

గోదావరి జలాలను కృష్ణా బేసిన్‌కు తరలించడం అంటూ జరిగితే అది రాయలసీమకే కాదు దక్షిణ తెలంగాణకూ ఉపయోగపడుతుంది. ఉపయోగపెట్టవలసి ఉంటుంది. ఈ బేసిన్ బదిలీ గురించి బచావత్ అవార్డులో ప్రస్తావించిన చోట కృష్ణా బేసిన్ ఎగువనున్న దుర్భిక్ష ప్రాంతాల గురించి ప్రస్తావించారే తప్ప ఒక ప్రాంతాన్నో కొన్ని జిల్లాలనో ప్రస్తావించలేదు. కరువు రాయలసీమలో ఉన్నట్టే దక్షిణ తెలంగాణలోనూ ఉంది. నీళ్ళు రెండు ప్రాంతాలకూ కావాలి.

అయితే ఆ అవసరాల కంటె ముందు గోదావరి బేసిన్‌లోని ఉత్తర తెలంగాణాకు చెందిన మెట్ట ప్రాంతాల అవసరాలకు ప్రాధాన్యం ఇవ్వడం న్యాయంగా ఉంటుంది. ఆ ప్రాంతాలకు గోదావరి జలాలు తప్ప వేరే లేవు కాబట్టి ఈ ప్రాధాన్యం న్యాయమైంది. దీనికి అవసరమైన ప్రాజెక్టుల రూపకల్పన అరకొరగా ఉంచేసి వేరే అవసరాల గురించి మాట్లాడడం న్యాయం కాదు.

కాబట్టి ఆదివాసుల జీవించే హక్కు, వారి మనుగడ హక్కు, అభివృద్ధిలో సమతుల్యం, నీటి హక్కులలో న్యాయమైన ప్రాధాన్యం, చివరికి ప్రాజెక్టు భద్రత - దేనిని ప్రమాణంగా పెట్టుకొని చూసినా పోలవరం ప్రాజెక్టు సమర్థనీయం కాదు. కాకపోగా, దానికి అవసరమైన ఏ అనుమతులూ లేవు. నీటి లభ్యత ఉంటే దానిని వాడుకునే హక్కు, ప్రాజెక్టు డిజైన్‌లకు కేంద్ర జలవనరుల సంఘం అనుమతి అవసరం. అది లేదు. పదివేల ఎకరాల అడవి భూమి పోలవరం ప్రాజెక్టు క్రింద మునగనుంది కాబట్టి కేంద్ర అటవీశాఖ అనుమతి అవసరం. దానికోసం అంతే మొత్తంలో అడవి పెంచడానికి భూమి కేటాయించడం అవసరం. అదీ లేదు. అడవితో బాటు ఆదివాసుల ఆవాసాలు మునుగుతాయి కాబట్టి కేంద్ర సాంఘిక సంక్షేమశాఖ అనుమతి అవసరం. అది కూడా లేదు. విలువయిన జీవావరణం ముంపుకు గురవుతుంది కాబట్టి కేంద్ర పర్యావరణ శాఖ అనుమతి అవసరం. అది సహితంలేదు. ఇవేవీ లేకపోయినా, టెండర్లు పాడుకోవడానికి కాంట్రాక్టర్లుంటే చాలునని రాజశేఖరరెడ్డి ప్రభుత్వం అనుకోవచ్చును గాని చట్టం అనుకోదు.

ఇన్ని కారణాల వల్లా పోలవరం ప్రాజెక్టు వద్దంటున్నాం. దాని నిర్మాణాన్ని ఆపాలంటున్నాం. ఇప్పటికే దానిని ఆపడానికి ఉద్యమిస్తున్న ఆదివాసీ ప్రజలతో అందరం కలవాలంటున్నాం.

3 సెప్టెంబర్ 2005 **మానవ హక్కుల వేదిక**

---

PRINTED BOOK

RNI Regn. No. APTEL/2003/11482

Postal Regn. No. LII/RNP/H-HD-1029/2004-06



# ప్రతి అడుగు ప్రజలకోసం



## స్ఫూర్తివంతమైన నాయకత్వంలో అభివృద్ధి పథంలో ఆంధ్రప్రదేశ్

- ఊరూరా, వాడవాడల పర్యటిస్తూ, ప్రజలను పలకరిస్తూ సమస్యలను పరిష్కరించే ప్రయత్నమే 'రాజీవ్ పల్లెబాట'
- ప్రతి గ్రామాన్ని ఇంటర్‌నెట్ ద్వారా అనుసంధానం చేసి వారికి ఆన్‌లైన్ ద్వారా సమాచారం అందించడం కోసం 'రాజీవ్ ఇంటర్నెట్ విలేజ్'
- నాలెడ్జ్ కారిడార్, బ్రాడ్‌బాండ్, జవహర్ నాలెడ్జ్ సెంటర్, ఇ-ప్రొక్యూర్‌మెంట్, బహుళ ప్రయోజన కార్డులు వంటి ప్రాధాన్యతలు
- నిరుద్యోగ యువత కోసం ఉపాధి లక్ష్యంగా 'రాజీవ్ యువశక్తి'
- ప్రజలతో ప్రత్యక్ష సంబంధాలను కలిగి వుంటూ, వారి సమస్యలను తెలుసుకుని, వాటికి తక్షణమే తగిన పరిష్కారాన్ని చూపించే 'రాజీవ్ నగరబాట'
- రూ. **500** కోట్లతో ఎస్.సి., ఎస్.టి, బలహీన వర్గాల సమగ్రభూమి అభివృద్ధి ప్రాజెక్టు 'ఇందిర ప్రభ'
- రాష్ట్రంలో పేదలకు గత ఏడాది **6.54** గృహాల నిర్మాణం చేపట్టడం జరిగింది. ఈ ఏడాది **12.50** లక్షల గృహ నిర్మాణం చేపట్టాలన్నది లక్ష్యం
- స్వయం సహాయక బృందాలలోని మహిళలకు 'ఇందిరా క్రాంతి పథం' ద్వారా పావలా వడ్డీకే రుణాలు
- ఎస్.సి. కాలనీలకు త్రాగునీటి సౌకర్యం కల్పించేందుకు రూ.**253** కోట్లతో 'అంబేద్కర్ జీవనధార'
- దేశంలోనే మొట్టమొదటిసారిగా పట్టణ నిరుపేదలకు అందించే గృహ సౌకర్యం 'రాజీవ్ గృహకల్ప'
- ఎస్.సి., ఎస్.టి., బి.సి. మరియు ఇతర భూమి లేని **2.18** లక్షల మంది నిరుపేదలకు **3,23,299** ఎకరాల భూమిని రెండు విడతలుగా పంపిణీ చేయడం జరిగింది
- **46** వేల కోట్ల రూపాయలతో **26** ప్రాధాన్యతా ప్రాజెక్టులు, **4** భారీ ప్రాజెక్టులు చేపట్టి, **2** నుండి **5** సం.లలో పూర్తి చేయడం. వీటి ద్వారా **86.75** లక్షల ఎకరాల ఆయకట్టు సాగులోకి వచ్చే అవకాశం.



జారీ చేసినవారు : సమాచార, పౌరసంబంధాల శాఖ

R.O.No. 269/SOU/Advt. I/2005

Owned, Printed and Published by V. Hanumantha Rao at 301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayat Nagar, Hyderabad - 500 029. Ph : 55843495. Printed at Charita Impressions, Azamabad, Hyderabad. For Nutan Art Printers, Hyderabad. Editor : N. Venugopal

**VEEKSHANAM**
301, Mythri Residency,
3-6-394, Road No. 3, Himayatnagar, Hyderabad - 500 029.